TPLA122B04

# టార్టిఫ్

(టర్జిఫ్ )

అనువాదం

అవసరాల సూర్యారావు




ఉమా పబ్లిషర్సు, విజయవాడ.

# రాడిన్

మధ్యాహ్నంవేళ వేసవిఎండలు మండుతూవున్నా, పొద్దుటపూటమాత్రం ఎంతో చల్లగా హాయిగా ఆహ్లాదంగా వుంది. ఆకాశంలో ఒక్క మబ్బుతునకైనా లేదు. నిర్మలమైన నీలిఆకాశం మనోజ్ఞంగావుంది. ఎర్రని సూర్యబింబం పసిపిల్ల వానిలా పైకెగబ్రాకుతున్నది. రాత్రి కురిసిన మంచు బిందువులు చెట్లమీద ముత్యాలవలె తళతళ మెరుస్తూ, నేలమీద జారిపడుతున్నాయి. గాలికి పూలగుత్తులు కదులాడుతూ వింత వింత రకరకాల పరిమళాలను వెదజల్లుతున్నాయి. అప్పుడప్పుడు గాలి గుప్పున రొప్పుకొచ్చి లోయలకు కొట్టుకొని కీచుమంటున్నది. ఆకాశంలో తోరణాల మాదిరి పిట్టలు రెక్కలల్లార్చుతూ ఎగురుతున్నాయి. బారులు బారులుగా పోతున్న పిట్టలు సున్నాలుచుడుతూ చక్రీలు కొడుతున్నాయి. పిట్టల కిలకిలలుతప్ప అంతా నిశ్శబ్దంగా ప్రశాంతంగా వుంది. నాజూకుగా వంగినిలుచున్న కొండ దిగువభాగాన విరిసిన గోధుమచేలు గాలికితకితలకు పులకరిస్తున్నాయి. చేలనానుకుని చూడముచ్చటగావున్న మళుపులు తిరిగిన బాట; బాటచివర లోయలమధ్య ఒక కుగ్రామం. ఆ గ్రామానికి పోయేందుకు యిదొక్కటే దారి. ఆ దారి వెంట ఒక నిండుజవ్వని తెరచిన గొడుగును ఎదురెండకు అడ్డంపెట్టుకుని గ్రామంవైపు అడుగులువేస్తోంది. తూచినట్లు అడుగులువేస్తూ ఏమి తోచిందోకాని మధ్య మధ్య ఆగిపోతూ నిట్టూరుస్తున్నది. కట్టుకున్న దుస్తులు కెరటాలుగా, గాలికి

కదులుతున్నాయి. తరంగాలుగా కదులుతున్న గోధుమచేల మిసిమినిచూస్తూ నిండు సంతృప్తితో ఆమె చిరునవ్వు నవ్వింది. ఆమె వెనకాలే కొంచెం దూరంలో అడుగులను మడుగులొత్తుతూ నమ్రతతో పాలేరు నడిచివస్తున్నాడు. ఆకాశంలో ఎగురుతున్న పిట్టలను ఒకసారి, గోధుమచేల తళతళలను యింకోసారి చూస్తూ, ఆ యువతి గ్రామ పొలిమేరను చేరుకుంది. పొలిమేర చేరువలోవున్న ఒక చిన్న గుడిసెచెంత ఆగి తన వెనకాలేవస్తున్న పాలేరువంక చూసింది. ఆమె చూపులలోని ఆజ్ఞను అతను వెంటనే గ్రహించి గుడిసెలోకి మళ్లి మరుక్షణంలోనే ఒక ముసలిరైతును వెంటబెట్టుకొని వచ్చాడు. ముసలిరైతు ఆమెనుచూసి అత్యంత భక్తి శ్రద్ధలతో నమస్కరించి ఒదిగి నించున్నాడు. ఆమె అతని వంక తేరిపారజూసి ఆతృతతో ప్రశ్నించింది.

"ఎలావుంది? నింపాదిగాలేదా?"

వణుకుతున్న స్వరంతో అతను "నింపాదిగానా? వచ్చే ప్రాణం పోయేప్రాణం. చాలా బాధపడుతోంది అమ్మగారూ!" అని మూలిగాడు.

"అయితే నేనొకసారి చూసివస్తాను"

"దయచేయండి అమ్మగారు!"

అతనికేసి విచారంగాచూస్తూ, పావ్లోవ్నా భారంగా అడుగులువేసుకుంటూ గుడిసెలోకి వెళ్ళింది. లోపల తేమగా వుంది. ఉక్కబోస్తున్నది. గుడిసెనంతటిని పొగ ఆవరించింది. చీకటిలో, మూల మంచంమీద రోగి మూలుగుతూవుంది. వచ్చేప్రాణం, పోయేప్రాణం. ముడతలుపడినమోము కుంచుక

పోయింది. తలచుట్టూ పాతగుడ్డ చుట్టకొనివుంది. అటూ యిటూ దొర్లుతూ ఆ వేదనతో దీర్ఘంగా నిట్టూరుస్తూ గిలగిల తన్నుకుంటున్నది.

పావ్లోవ్నా మెల్లగా రోగిచెంతకువెళ్ళి నుదుటను స్పర్శించింది. నుదురు వడ్లగింజవేస్తే పేలపుగింజవలె పేలి పోతూవుంది. మంచంమీందకు వంగి పావ్లోవ్నా నెమ్మదిగా "ఎలావుంది నీవంట్లో మార్టిరియోనా!" అని అడిగింది.

"వంట్లోనా, యింకా నయంకావడ మేమిటి తల్లీ! అయి పోయింది. నాపని అయిపోయింది. ఊపిరికడగట్టిపోతోందితల్లీ!"

అదేవిటలాభయపడుతావు? అన్నింటికీ ఆ పరమేశ్వ రుడే వున్నాడు.''

పావ్లోవ్నా చుట్టూపరికించి ఊరడించింది:

"ఏం భయంలేదు. నీజబ్బు నిమ్మళిస్తుంది. నిన్న నేను పంపించిన మాత్రలు వేసుకున్నావుకదా?"

పావ్లోవ్నా ప్రశ్న విని ఒక్కసారి మూలిగి నిట్టూర్చి రోగి పక్కకు వత్తిగిలింది. ఆమెప్రశ్నకు ముసలిరైతు సమా ధాన మిచ్చాడు. "మాత్రలు వేసుకుం దమ్మగారు!"

"నువ్వుకాక ఆవిడ కింకెవరూ తోడులేరా?"

"లేకేం. ఆవిడమనుమరాలే వుంది. కాని, అది ఎప్పుడైనా యింటిపట్టు నుంటేనా? ఆగమ్మకాకల్లే తిరుగు తోంటుంది. అమ్మమ్మకు జబ్బుగావుందన్నా; కాదు చచ్చి పోతోందన్నా, దానికి ఖాతర్లేదు. గొంతులో నీళ్ళుచుక్కైనా పొయ్యదు. ఇక నేనుచూస్తే, కూచుంటేలేవలేను. లేస్తేకూచో లేను. ముసలాణ్ణి ఉంటేనేం, లేకపోతేనేం?"

"పోనీ, మా హాస్పటల్‌కు తీసుకవెళ్ళితే?"

"వద్దమ్మా, వద్దు. ముసలిదానికి ప్రాణం ఎలాగూ పోతుంది. ఆ పోయే ప్రాణం ఈ గుడిసెలో పోతేనే మంచిది. ఇంతకీ దాని నోసటరాత ఎలాగుందో!"

గుడిసెలోంచి రోగిమూల్గు వినిపించింది. మూలుగుతోనే "అమ్మా, దిక్కులేనిదాన్ని. దీనురాల్ని. నట్టడవిలో మమ్మల్ని వదిలేయకమ్మా!" అంటూ వంట్లో యిక సత్తువ లేనట్లు మళ్ళీ మూల్గి కళ్ళుమూసుకుంది.

"భయపడకు. చేతనైనదంతా చేస్తాం. ఇదిగో యీ టీ, పంచదార తీసుకో. అప్పుడప్పుడు కొంచెం కొంచెం తాగుతూవుండు. ఇంట్లో కుంపటి వుందా?... ఆ పిల్ల యింటిపట్టునుండకుండా ఎందుకలా తిరుగుతుంటుంది; నలుగురూ నవ్వుతారనే సిగ్గైనా వుండొద్దా?" పావ్‌లోవ్నా తనచేతిలోని పొట్లాలను అతని కందిస్తూ "మళ్ళీ రేపో, ఎల్లుండో చూడ్డానికి వస్తాను. బెంగేమీ పెట్టుకోకు. మనోవ్యాధికి మందులేదు. డాక్టరిచ్చిన మందుమాత్రం జాగ్రత్తగా తీసుకో" అంటూ రోగికి ధైర్యం చెప్పింది. కృతజ్ఞతాపూర్వకంగా రోగి రెండుచేతులూ జోడించింది. పావ్‌లోవ్నా ప్రేమతో రోగితల నిమిరింది.

గుడిసెలోనుంచి ఇవతలకివస్తూ ముసలిరైతువంకచూసి, "ఏప్పూటమందు ఆప్పూటే యియ్యి. డాక్టరు చెప్పినట్లు నడుచుకోవాలి. అప్పుడప్పుడు టీ యిస్తూవుండు. కొంచెం ఉల్లాసంగా వుంటుంది," అంటూ పావ్‌లోవ్నా హెచ్చరించింది. ముసలి రైతు మౌనంగా తలవూపాడు.

గుడిసెలోనుంచి యివతలపడ్డాక కాని, ఆమెకు వూపిరి చిక్కిందికాదు. మెల్లగా గొడుగు తెరచి, గుడిసెదాటి యింటికి వెడుతూంటే మలుపులో ఒక గుర్రపుబగ్గీ ఎదురైంది. బగ్గీలో ముప్పైఏళ్ళ యువకుడొకడు కూర్చొని గుర్రాన్ని అదిలిస్తున్నాడు. తొడుక్కున్నకోటు మాసిపోయి బూడిదరంగుతో వికారంగావుంది. ఎదురుగా వస్తూన్న పావ్లోవ్నాను చూసి యువకుడు ఒక్కసారి బగ్గీనిఆపి గుర్రాన్ని ఆమెవైపుమళ్లించి నవ్వుతూ "యింతదూరం ఏంపనిమీద వచ్చావో నేను తెలుసుకోవచ్చునా ?" అంటూ పలకరించాడు.

"వేరే పనేముంది ? ముసలిదాని వంట్లో బాగాలేదు. చూద్దామని వచ్చాను ... సరే, మైకేల్, నువ్విప్పుడు ఎక్కణ్ణుంచి వస్తున్నట్టు ?"

మైకేల్ లెజ్నోవ్ ఆమె కళ్లవంకచూసి చిరునవ్వు నవ్వాడు. "రోగుల్ని చూడడం బాగానేవుంది. యింత శ్రమ పడేబదులు మీ హాస్పిటల్లో దాన్ని పడేస్తే ?"

"అలాగే చేర్పిద్దును. కాని ఆమె కదల్లేని స్థితిలో వుంది."

"రోగులు కదల్లేకపోతే, అసలు హాస్పిటల్ మూసివేస్తేసరి."

"హాస్పటల్ మూయటమా ! ఎవరు చెప్పారు నీకీ మాట ?"

"ఏం, ఎందుకు మూసివేయకూడదు ?"

"ఎందుకు మూసివేయాలి ?"

"ఎందుకు మూసివేయాలో 'లాసున్స్కయా'ను అడుగు, చెబుతుంది. స్కూళ్లు, ఆస్పత్రులు వట్టి దండుగని ఆవిడ ఉద్దేశం. దానధర్మాలనేవి అనవసరంట! విద్యకూడ అంతే. వీటికోసం లేనిపోని పటాటోపంకూడదని ఆమె అభిప్రాయం."

యీ మాటలువిని పావ్లోవ్నా నవ్వి, "ఆవిడ చాలా తెలివైంది. ఆవిడంటే నా కెంతో ప్రేమ, గౌరవం. కాని మానవమాత్రుడన్నవాడు తప్పుచేయకుండా వుండడు. ఆవిడ చెప్పే ప్రతి విషయాన్ని నేను ఆమోదించలేను" అంది.

"ఆవిడకు తనమాటలో తనకుమాత్రం నమ్మకముందా ఏమిటి?"...పొద్దున్నే నువ్వు తారసపడ్డందుకు నా కెంతో ఆనందంగా వుంది.

"ఆనంద మెందుకు?"

"మంచి ప్రశ్నే. నువ్వెప్పుడు కనిపించినా నా కానందమే. యీ రోజు మరీని. యీ ప్రకృతిలాగే నువ్వూ ఎంతో అందంగా వున్నావు."

పావ్లోవ్నా పెదవులపై చిరునవ్వు విరిసింది.

"ఏం. ఎందుకలా నవ్వుతున్నావు?"

"నవ్వువస్తే నన్నేం చెయ్యమంటావు. నన్ను వర్ణించేటప్పుడు కవిత్వం వెలిగించావుగాని దానిలో తేజస్సులేదు"

"అవును మరి. తేజస్సు ఉండాలంటే అగ్ని ప్రజ్వరిల్లాలి. నిప్పు ఉంటేగాని పొగ రాదు."

"శీతాకాలంలో నిప్పుదగ్గర కూర్చుంటే వెచ్చగానే వుంటుంది."

"వెచ్చగానే వుంటుందిగాని; నిప్పును ముట్టుకుంటే చెయ్యి కాలుతుంద నేమాట మర్చిపోకు."

"ఓస్సే. యింతేగదా. అంతమాత్రానికి ప్రాణంపోదు."

"అలా నీ చేయి కాలినప్పుడు చూడాలనివుంది. అప్పుడు నువ్వు ఏమంటావో వింటాను."

కళ్లెం విదిలిస్తూ మైకేల్ లెజ్‌నోవ్ గుర్రాన్ని అదిలించాడు.

"వెళ్లొస్తాను."

"ఉండుండు వెళ్ళిపోకు. మళ్ళీ ఎప్పుడొస్తావు?"

"రేపొస్తాను. మీ అన్నను అడిగినానని చెప్పు."

బగ్గీలో కూర్చుని కుదుపులకు కదులుతూ జారి పోతున్న టోపీని సర్దుకుంటూ మైకేల్ వెళ్ళిపోయాడు. చూపులకు అందినంతవరకు గుర్రపుబగ్గీని చూస్తూ పావ్‌లోవ్నా అక్కడే నుంచుంది. కొంతసేపు పోయాక తలవంచుకుని నేలనుచూస్తూ ఏమో ఆలోచించుకుంటూ మెల్లగా యింటిదారిపట్టింది. కొంచెందూరం నడిచేసరికి ఆమె ఆలోచనలకు అంతరాయం కలిగింది. వంచిన తలను హఠాత్తుగా పైకెత్తి చూసింది. ఎదురుగా గుర్రంపై స్వారీ చేసుకుంటూ తన అన్న అటే వస్తున్నాడు. అతని పేరు సెర్జీపావ్‌లోవిచ్. కొంతకాలం సైన్యంలో కెప్టెన్‌గా పనిచేసి పింఛను తీసుకున్నాడు. అవివాహితుడు. ఏ బాదరబందీ లేదనుకునేసరికి చెల్లెలుభారం అతనిమీద పడింది. పావ్‌లోవ్నాభర్త మరణించిన తరువాత చెల్లెలి యింట్లోనే వుంటూ, జమీందారీ వ్యవహారాలను చక్కబెడుతున్నాడు. గుర్రంమీద

వస్తున్న తన అన్నకన్నా, అతని వెనకాలే వస్తున్న మరొక వ్యక్తి పావ్‌లోవ్నాదృష్టి నాకర్షించాడు. మసిపి పొట్టి. బొత్తాలులేని కోటు. మెడకు పొడుగైనశాలు. బూడిదరంగు టోపీ. చేతిలో బెత్తం. చూడడానికి చిత్రంగా కన్పిస్తున్నాడు. పావ్‌లోవ్నానుచూసి అతను మందహాసం చేశాడు. చిరునవ్వు నవ్వుతూ ఆమెచెంతకు వెళ్ళి ఎంతో గౌరవంగా ప్రసన్న వదనంతో "సమస్కారమండీ" అన్నాడు.

"ఓహో మీరా! ఎవరో అనుకున్నాను. మిఖిలోవ్నా యింటినుంచి వస్తున్నారా ?"

యీ ప్రశ్నకు 'పాండలవిస్కీ' ముఖం విప్పారింది. "అవునవును. ఆవిడే మీకోసం నన్ను పంపింది. మీ యింటికి వెళ్ళాను. మీరింట్లో లేరని, ఇటే వచ్చారని మీ అన్నగారు చెప్పారు. సరే. ఆయన ఎలాగా పొలంమీదకు వెళ్ళు తున్నారు. ఆయనతోటి మిమ్మల్ని కలుసుకోనేందుకు నేనూ బయలుదేరాను. ఆడబోయిన తీర్థం ఎదురైనట్లు మీరే ఎదురయ్యారు."

పాండలవిస్కీ మాట్లాడేది రష్యన్‌భాష అయినా, మాటల్లో యాస లేకపోలేదు. ఉచ్చారణలో పాశ్చాత్య భాషల ప్రభావం పొడగడుతున్నది. కాని ఆప్రభావం ఎట్టిదో తేలికగా చెప్పడం కష్టం. అతని ముఖలక్షణాలలో రూపురేఖలలో కొంత వైలక్ష్యం. పొడుగ్గా, సూటిగావున్న ముక్కు, విశాలమైన కదలని కళ్ళు, మొద్దుగావున్న ఎర్రని పెదవులు, బల్లబరుపుగావున్న నుదురు, నల్లని జుట్టు. యివన్నీ ఆశియావాసుల లక్షణాలకు చెందినవి. కాని

జన్మభూమి ఒడెస్సా అని, తను బైల్లోరస్యాలో
ానీ పాండలవిస్కీ చెపుతూవుంటాడు. బైల్లోరస్యాలో
ి వితంతువు, దానశీలి, అతనికి ప్రాపకమిచ్చిందనీ,
ంతువుపలుకుబడివల్ల తాను ప్రభుత్వోద్యోగి నైనా
ప్పుడప్పుడు అతను చెపుతూవుండడంకద్దు. ఇందులో ఏమీ
శ్చర్యంలేదు. ఏమి అంటే: తన మాటలనేర్పువల్ల ఊహాల
వల్ల, నిండుజవ్వనుల ప్రేమను యిట్టే చూరగొనడంలో,
పాండలవిస్కీ అతిచతురుడు. ప్రస్తుతం అతను లాసున్స్కయా
ప్రాపకంలో వుంటున్నాడు. లాసున్స్కయా ధనవంతురాలు.
జమీందారిణి. పాండలవిస్కీ తనకు ఆశ్రయ మిచ్చినవారిపట్ల,
ఎంతో అణకువగా మెలగుతూ, తలలోనాలుకవలె మెస
లుతూ, రాణింపుకువచ్చే నేర్పరి. నేర్పరితనానికి తగట్టు
గొంతులో ఎంతో మాధుర్యముంది. చక్కగా పాడతాడు.
పాడుతున్నట్లు మాట్లాడుతాడు. మాట్లాడుతూ ఎదుటివారి
కళ్ళల్లోకి గుచ్చిగుచ్చి చూస్తూ, ప్రేమను ఒలకబోస్తూ
సమ్మోహనపరుస్తాడు. ఎప్పుడూ మిలమిల్లాడుతూవున్న దుస్తు
లతో కలకల్లాడుతూ వుంటాడు. దుస్తులు వేసుకోవడం ఒకం
తకి తెమలదు. గంటలకొద్దీ దుస్తులను సవరించుకొంటూ,
ముస్తాబౌతాడు. ఇక గడ్డం గీసుకోవడం, తలదువ్వుకోవడం
సరేసరి; పూటల్లా అదేపని.

అతను చెప్పిందంతా విని పావ్లోవ్నా తన అన్నగారి
వంక తిరిగింది. 'ఇవాళంతా తమాషాగావుంది. ఒకరితరువాత
ఒకరు. ఎవరోఒకరు కన్పిస్తూనేవున్నారు. ఇప్పుడిప్పుడే
మైకేల్ లెజ్జినోవ్ యిలావెళ్ళాడు.'

'ఎవరూ ? లెజ్జినోవా ? ఎక్కడికైనా పనిమీ వెళుతున్నాడా ?'

'కామోసు, గుర్రపుబగ్గీమీద వెళుతున్నాడు. సంచిలాంటిబట్టలు వేసుకున్నాడు. బట్టలనిండాదుమ్మే. తనూ పామనిషి.

'కాని మంచివాడు.'

'ఎవరూ ? లెజ్జినోవా ?' అంటూ పాండలవిస్కీ ఆతృతతో అడిగాడు.

'అవును. మైకేల్ నికోలోవిచ్ లెజ్జినోవ్. అది అతని పూర్తిపేరు' అంటూ సమాధానం చెప్పి,—పాకోలోవిచ్ తన చెల్లెలివంక తిరిగాడు.

'వేళ మించిపోతుంది. త్వరగా వెళ్ళివస్తాను. చేలల్లో విత్తనాలు జల్లుతున్నారు.'

వాసిలోవిచ్ గుర్రాన్ని మళ్ళించి వెనక్కు తిరిగి 'పాండలవిస్కీ నిన్ను యింటివద్ద దిగబెడతాడు.' యీ మాట విని మహదానందంలో పాండలవిస్కీ, 'తప్పకుండా దిగబెడతాను' అంటూ ఆమెకు తన చేతి నందించాడు. ఆమె అతని చేతిని పట్టుకొని నడవసాగింది.

సుకుమారమైన పావ్లోవ్నా చేతుల స్పర్శ, అతని కెంతో ఉల్లాసం కలిగించింది. మృదువుగా ఆమెచేతులను పట్టుకొని నెమ్మదిగా కదిలిస్తూ, మెల్లగా అడుగులు వేస్తున్నాడు. అతని కళ్ళల్లో వింత వెలుగు ప్రకాశిస్తోంది. ముత్యపు బిందువులవలె రెండు కన్నీటిబొట్లను రాల్చాడు. యువకుని, శరీరపు వెచ్చదనానికి పావ్లోవ్నా ఉద్రేకపడింది. జలజల

ఆనందబాష్పాలను రాల్చింది. పాండలవిస్కీ-శరీరం జలదరించింది. అవును. అందమైన పికిలిపిట్టవంటి పిల్ల చేతులు తాకేసరికి ఎవరికైనా ఆనందంగా వుంటుంది. అందులోను పావ్‌ల్వోవ్నావంటి సుందరి 'స్పర్శ'. ఆమె అందాలబరిణె అని ఆ వూరూవాడా అందరికీ తెలుసును. ఆమెచూపులలోని మాధుర్యం, అవయవాల తీరు, మెడవంపులు ఎవరినైనా సమ్మోహపరుస్తాయి. సంపెంగవంటి ఆమెముక్కు-సొగసును చూసిన యువకులకు మతిపోతుంది. మబ్బులచాటున వుండే నీలినీడలను పుణికిపుచ్చుకున్న ఆమె కనుచూపులు, పూలగుత్తులు. తుమ్మెదరెక్కలవంటి ఆమె జుత్తు నిగనిగ, అపురూపసౌందర్యంతో మనసును ఉద్రేకపరుస్తుంది. గులాబీరేకులవంటి పెదవులు, నవ్వితే సొట్టలుపడే బుగ్గలు, యువకులను ఉద్విగ్న హృదయులను చేస్తాయి. ఆమె శరీరలావణ్యం కంటె, మోములో, నిగూఢంగా దాచుకున్న భావాలు మనస్సులను మరీ లాలిస్తాయి. ఆత్మవిశ్వాసం, దయ, అణకువ, ప్రేమ, వాత్సల్యం ఆమె మోములోనుంచి సదా ఉట్టిపడుతూ వుంటాయి. ఆమె నవ్వు పిసిపిల్లల నవ్వు. పురుషులేగాక స్త్రీలుసైతం ఆమెపట్ల అనురాగంతో ఉంటారు.

నవ్వుతూ ఆమె పాండలవిస్కీని అడిగింది.

'లాసున్‌స్కయా నాకోసం కబురుపెట్టిందన్నావు?'

'అవును. యీవేళ ఎవరోవస్తున్నారు. మిమ్మల్ని కూడా భోజనానికి రమ్మంది.'

'ఎవరు వస్తున్నారు?'

పీటర్సుబర్గునుంచి చక్రవర్తి ఆంతరంగిక సేవకుడు వస్తున్నాడు. ఆయనతో యీమధ్యనే లాసున్స్కయాకు పరిచయ మేర్పడింది. ఆయ నెంతో నాగరికుడు, చాలా గొప్పవాడు, అన్ని తెలుసున్నవాడు, అంటుంది లాసున్స్కయా. సాహిత్యమంటే ఆయనకెంతో ఆసక్తియట. రాజకీయ ఆర్థిక శాస్త్రాలలో ప్రవీణుడట. తా నొక గొప్పవ్యాసాన్ని రాశాననీ, దాన్నిచూసి లాసున్స్కయా తన అభిప్రాయం చెప్పాలనీ అతనికోరిక. బహుశ అందుకోసమే వస్తున్నాడుగామోసు.'

'అతను రాజకీయ, ఆర్థిక శాస్త్రంమీదవ్యాసంరాశాడా?'

'పటిష్టమైన శైలిలో ఆ వ్యాసం రాశాడట. యీ విషయంలో లాసున్స్కయా మంచీ చెడ్డ తేల్చిచెప్పగల ప్రజ్ఞావంతురాలు. అదంతా ఎందుకు ? ఆవిడను 'జుకోవిస్కీ' లాంటి కవి సలహాలు అడుగుతూండేవాడు. అన్నట్టు 'సాంద్రికో' పేరు ఎప్పుడైనా విన్నారా ?'

'ఉహుం. నే నెప్పుడూ వినలేదు.'

'ఆయనపేరు ఎప్పుడూ వినేలేదూ ? ఒడెస్సాలో ఉన్నాడులెండి. నే నింతవాణ్ణి అవటానికి ఆయనచేతిచలవే కారణం. ఆయనలాంటివాడుసైతం లాసున్స్కయా సలహా లేనిదే ఏపనీ చేసేవాడుగాదు. రష్యన్ భాషలో గొప్పవిద్వాంసురాలని యీావిడపై ఆయన కెంతో గౌరవం.

'సరే. దానిమాటకేం. యిప్పుడు వస్తున్నాయన పండితుడా ?'

'పాండిత్యం సంగతి నాకు తెలియదుకాని గొప్ప ప్రపంచజ్ఞానం కలవాడట. ప్రపంచ వ్యవహారాలన్నీ యిటే

ఆకళింపుకు తెచ్చుకున్నాడట. ఒక వస్తువును చూపులతోనే గ్రహిస్తాడట. సంగీతం గురించి అతను చెపుతూవుంటే గంటలతరబడి చక్రవర్తి వింటూవుంటాడట. సంగీతశాస్త్రం గురించి, ఆయనను అడిగి తెలుసుకోవాలని నాకు వుంది. సంగీతమంటే నేను చెవికోసుకుంటానుగదా...' అంటూ పాండలవిస్కీ తన చేతిలోని పువ్వును ఆమెకు అందించాడు.

'ఇది చాలా మంచిపువ్వు.'

ఆమె పువ్వును తీసుకొని రెండడుగులువేసి చేతిలో నుంచి దాన్ని జార్చింది. యిద్దరూ మెల్లగా నడుస్తున్నారు. యిక్కడికి యిల్లు ఎంతో దూరంలేదు. తోటలమధ్య పెద్ద పెద్ద కిటికీలతో, తెల్లని మేడ కన్పిస్తోంది. మేడచుట్టూ నిమ్మ తోట గుబురుగా పెరిగింది.

నేలమీదపడ్డ పూలవంక పాండలవిస్కీ దీనంగా చూస్తూ నసుగుతూ ఆవిడను 'యీవేళ భోజనానికి వస్తారా? ఆవిడ మీకోసం కనిపెట్టుకు కూర్చుంటుంది. మీ అన్నగారు కూడా వస్తానన్నారు.

'ఇద్దరం తప్పకుండా వస్తాం. నటాలియా కులాసాగా వుందా?'

'ఆఁ.'

ఇద్దరూ తోటలుదాటి యింటి సమీపానికొచ్చారు. చటుక్కున పాండలవిస్కీ ఆగి నేను చాలా దూరం వచ్చేశాను. వెళ్ళివస్తాను.'

'మా యింటికి రాకుండా వెళ్ళిపోతారా?

రాకుండాపోవడం నాకూ కష్టంగానేవుంది. కాని ఆలస్యమైపోతుందేమోనని భయం. జమిందారిణి నాకోసం నిరీక్షిస్తూంటుంది. మంచి పాటొకటి పాడి వినిపిస్తానని చెప్పి వచ్చాను. యింటికివెళ్ళి కాస్త ఆ కృతిని సాధనచేసుకొని ఆమెకు వినిపించాలి. నాదొక చిన్న మనవి. నేను మీామనస్సుకేమీా నొప్పి కలిగించలేదుగదా?'

'అబ్బెబ్బె. అవేం మాటలు! అసలు మీారలా ఎందుకనుకుంటున్నారు?'

పాండలవిస్కీ నిట్టూర్చి తన కళ్లను గిర్రున తిప్పి నేల వంక చూశాడు. కొంచంసేపాగి ఆమెకు నమస్కరించి 'వెళ్లొస్తాను' అంటూ వెనక్కి-అడుగులు వేశాడు. పావ్లొవ్నా గిరుక్కున తిరిగి తన యింట్లోనికి వెళ్ళిపోయింది. ఆమెవంక తేరిపారచూసి, పాండలవిస్కీ యింటిదారిపట్టాడు. పూర్వంవలె అతనిమోములో యిప్పుడు కాంతిలేదు. మొహం ముడుచుకున్నాడు. మూతి బిడాయించుకున్నాడు. కనుబొమ్మలు చిట్లించి ఒక నిట్టూర్పు విడిచాడు. నడకలో అప్పటి డాబు, దర్పం తగ్గాయి. గబగబా అడుగులువేస్తున్నాడు. అడుగులు భారంగా పడుతున్నాయి. చేతిబెత్తం వూపుకుంటూ ఒక ఫర్లాంగుదూరం నడిచి హఠాత్తుగా ఆగిపోయాడు. ముడుచుకున్న పెదవులు విప్పారి చిన్ననవ్వు వెలసింది. రోడ్డు ప్రక్క ఒక అమ్మాయి పశువులను తోలుకుంటూ వస్తున్నది. పిల్లిపిల్లలాగా మెల్లిగా అడుగులువేస్తూ, ఆ పిల్లదగ్గరకు వెళ్లాడు. ఆ పిల్ల సిగ్గుతో తలవంచుకుంది. బిత్తరపోయి భయంతో చూసింది. పాండలవిస్కీ ఆ పిల్లతో సంభాష

కుపక్రమించాడు. ఆ పిల్ల తనచేతిని మొహాని కడ్డంపెట్టుకొని దూరంగా తొలగిపోతూ 'వెళ్లు, వెళ్లు' అని అరచింది.

అతను లాలనగా చేతులు తిప్పుతూ, బుజ్జగించుతూ 'పారిజాతపు పువ్వులు తెచ్చిపెడతాను. నీలాంబరాలు కోసి పెడతాను. ఎంత బాగుంటాయని!' అన్నాడు.

'అవన్నీ నన్నెవరడిగారు? దండలు గుచ్చుకొని నీ మెడలో వేసుకో.'

'పువ్వు లిస్తానంటే ఆడపిల్లలు ఒద్దనగూడదు.'

'దా రెందుకు అటకాయిస్తావు? నీ దారిన నువ్వు పో.'

ఆ పిల్ల కళ్ళెర్రజేసి గద్దించేసరికి పాండలవిస్కీ భయంతో మొహంపక్కకుతిప్పుకున్నాడు. దారిలోఒ త్రిగిలిచుట్టూకలయ జూశాడు. ఒక ఫర్లాంగుదూరంలో వాన్యూపెట్యా కనిపించారు. వాళ్ళిద్దరూ లాసున్‌స్కయా బిడ్డలు. పిల్లలవెంట బెసిస్టోవ్‌కూడా వస్తున్నాడు. బెసిస్టోవ్ యిరవై రెండేళ్ళ యువకుడు. పొడగరి. దీర్ఘనాసిక, మిలమిలమెరిసేకళ్లు. ఈమధ్యనే పట్టభద్రుడై, యిప్పుడు వాన్య, పెట్యాలకు యింటివద్ద విద్యగరపుతున్నాడు. మనిషి నిజాయితీపరుడు. నిర్మొహమాటి. దయార్ద్రహృదయుడు. దుస్తులు వేసుకోవటంలో ఆసక్తి ఏమీ కన్పించదు. అందంకోసం కాదుగాని, జుత్తు బద్ధకంచేత కత్తిరించకుండా పెరగనిచ్చాడు. అతనికి పుస్తకాలన్నా, వాదనలన్నా ఎంతోయిష్టం. పాండలవిస్కీనడత అతనికి రుచించదు.

'బెసిస్టోవ్ అంటే యింటిల్లిపాదికి ఎంతో అభిమానం. అత నందరితోను కలివిడిగా వుంటాడు. తన యజమానురాలు లాసున్‌స్కయాకు కొందరంటే ద్వేషం, మరికొందరంటే

తగని అభిమానం. ఆమె ద్వేషాభిమానాలతో ప్రమేయం లేకుండా బెసిస్టోవ్ అందరితో స్నేహంగా వుంటాడు. లాస్సున్‌స్సయా కొడుకులకు తమ గురువుగారంటే పూజ్య భావముంది గాని, భయంమాత్రం లేదు. యిందుకు కారణం బెసిస్టోవ్ పిల్లల నెప్పుడూ భయపెట్టి ఎరుగడు.

పిల్లలనుచూసి పాండలవిస్కీ లేచి అభిమానంతో, బుగ్గలు నిమురుతూ 'యింత పొద్దున్నే బయలుదేరారే? నేనంటే వేరు. నాకు నడక తప్పదు. నడుస్తూ, ప్రొద్దున్నే ప్రకృతిని చూస్తూ గడపడం నాకు వెర్రి' అన్నాడు.

యీ మాటలు విని బెసిస్టోవ్ నవ్వుతూ వ్యంగ్యంగా ఒక చురక అంటించాడు.

'మేం చూస్తున్నాంగా, నీ వెర్రేమిటో! పాపం దారి తప్పావు గాబోలు ఆపిల్లని దారి అడుగుతున్నావు!—

పాండలవిస్కీ చీదరించుకుంటూ 'ప్రకృతీ, సౌందర్యం అంటూ ఒక టుంటేగా నీకు? నువ్వు ఒట్టి భౌతికవాదివి! అసలు నీ ఆలోచనలన్నీ దరిద్రగొట్టు ఆలోచనలే. నాకు తెలుసుగా; యిందులో కొత్త ఏముందీ.'

బెసిస్టోవ్ హేళనగా అతనివంక చూశాడు.

పాండలవిస్కీ తిరిగి అదే మాటలను రెట్టిస్తూ 'నువ్వు దరిద్రగొట్టు దామోదరుడివి. కవిత్వం, సంగీతం, పువ్వులు, లతలు అంటే నీకు పడేపడదు.'

యీ నిందావాక్యాలకు బెసిస్టోవ్ సమాధానమేమీ యివ్వలేదు. పిల్లలవంక తిరిగి దూరంగాఉన్న రేగుచెట్టు

చూపిస్తూ, 'చూద్దాం, ఆ చెట్టు ఎవ్వరు ముందు ముట్టు కుంటారో పరిగెత్తి వెళ్లండి'.

'నేను శ్రీ.' 'నువ్వు చుక్క' అంటూ పిల్లలు గబగబా రేగుచెట్టువంక పరిగెత్తారు. పరుగెత్తుతూన్న పిల్లలను చూసి పాండలవిస్కీ "చదువూ సంధ్యా లేదు. గుర్రాల్ని పరిగెత్తించినట్లు పరిగెత్తిస్తున్నాడు. ఎవ్వడికీ 'ఓ' అంటే, 'నా' రాదు. యిక పిల్లలు గొడ్లను కాసుకోవలసిందే" అంటూ పైకి వినిపించేటట్లే సణిగాడు. దుస్తులవంక నీటుగా చూసుకుంటూ చొక్కాని దులుపుకుంటూ, కాలరు సాఫుచేసుకొని మేడవైపు బయలుదేరాడు. తనగది చేరగానే దుస్తులుమార్చుకొని విచిత్రమైన భంగిమపెట్టి యీలవేసుకుంటూ పియానో ముందు చతికిలబడి, లాసున్స్కయాకు వినిపించవలసిన కృతిని సాధకం చేసుకుంటున్నాడు.

## 2

లాసున్స్కయా భవంతి ఆ ప్రాంతాల్లోకల్లా చాలా పెద్దది. పద్దెనిమిదో శతాబ్దపు శిల్పాలతో కొండమీదవున్న ఆ భవంతి కొట్టవచ్చినట్టు వుంటుంది. కొండ దిగువున రెండు మూడు నదులు ప్రవహిస్తూ, కొంచెందూరంలో సంగమిస్తున్నాయి. లాసున్స్కయా ధనవంతురాలు. ఆమెభర్త ప్రీవీ కౌన్సిలర్‌గా వుంటూ, కీర్తికికీర్తి, డబ్బుకుడబ్బు గడించి మరణించాడు. తాను యూరప్‌అంతా పర్యటించాననీ, వివిధ దేశాలలోని తగు మనుష్యుల్నందరినీ ఎరుగుదునని ఆమె

గొప్ప చెప్తూవుంటుంది. కాని నిజానికి యూరప్‌లో యీవిణ్ణి ఎవరూ ఎరగనే ఎరగరు.

పీటర్సుబర్గులో వుంటున్నప్పుడుకూడా ఆమె ఏమీ గణనకు రాలేదు. మాస్కోలోమాత్రం ఆమెను అందరూ ఎరుగుదురు. పెద్దపెద్ద ఉద్యోగస్తులను, రాజబంధువులను, జమీందార్లను విందులిస్తూ ఖ్యాతి గడించింది. వారిదృష్టిలో లాసున్‌స్కయా దయాధర్మపరురాలు కాకపోయినా, తెలివైన మహిళ. తన యవ్వనదశలో ఆమె చాల సొగసుగా వుండేది. ఆమెసౌందర్యాన్ని అభివర్ణించుతూ కవులు గీతాలు వ్రాశారు. యువకులరక్తం పొంగులెత్తి ఆమెచూపులకోసం ఆమెచుట్టూ చేరేవారు. ఆమె మాట్లాడితే యువకుల హృదయాలు ద్రవించిపోయేవి. యిదంతా పాతిక, ముప్పైఏళ్ళ కిందటిమాట.

యిప్పుడు ఆమెలో పూర్వపులావణ్యం మృగ్యం. కొత్తగా యిప్పుడామెను చూసినవాళ్ళు 'ఈవిడ తనజీవితంలో ఎప్పుడైనా అందంగా కన్పించిందంటే ఎలా నమ్మడం' అని తమలోతాము ప్రశ్నించుకుంటారు. పరిసరాలు కొని తెచ్చిన మార్పునుజూసి ఆశ్చర్యచకితులౌతారు. ఎవరికి ఎలా వున్నా పొండలవిస్కీకిమాత్రం ఆమెనేత్రాలలోని సొగసు ఎప్పటిలాగానే కనిపిస్తూ వుంది. ఆమెకు చాలా పలుకుబడి వుందని, యూరప్‌అంతా ఆమెకు మోకరిల్లుతుందని బడాయిగా చెప్తూనే వుంటాడు.

లాసున్‌స్కయా ముగ్గురుబిడ్డల తల్లి. తొలిచూలు ఆడపిల్ల. ఆమెపేరు నటాలియా. వయస్సు పదిహేడేళ్లు. నటా

లియా తరవాత యిద్దరూ మగపిల్లలే. పెద్దవాడు వాన్యా పది పదకొండు సంవత్సరాల కుర్రవాడు. రెండవవాడు పెట్యా అన్నకంటె రెండేళ్లు చిన్న.

వేసవికాలం వచ్చిందేతడవు, బస్తీ వదలిపెట్టి లాసున్‌స్కయా తన జమీలోవున్న భవంతికి వచ్చేస్తుంది. ఆవిడ వచ్చిందనగానే చుట్టాలూ, స్నేహితులు గుమిగూడుతారు. వారితో ముఖ్యంగా పెండ్లికాని యువకులతో కాలం గడపడం ఆమె కొక వేడుక. పట్టణంలో ఆడవాళ్ళమధ్య ఎల్లకాలం గడపడమంటే ప్రాణసంకటంగా వుంటుంది. చెప్పినకబుర్లే చెప్పుకుంటూ, చూచినమొహాల్నే చూస్తూవుండడం ఆమెకు చికాకు. బస్తీలో సేవకురాండ్రమధ్య నోటికొచ్చినట్లు మాట్లాడుతూ, మాటల్లో సరదాలుతీర్చుకుంటూ ఒకొక్కప్పుడు వాళ్ళనుకవ్విస్తూ, మరొకప్పుడు అధికారంచలాయిస్తూ వుంటే ఆమెకు ఆ ఉత్సాహం కొంతకాలమే. రాజుల ప్రేమ కథలు, సరస సల్లాపాలు చిలవలుపలవలుగా వర్ణిస్తూ ఊరికే మాట్లాడుతూవుంటుంది. దాస దాసీజనం యీ సమయంలో ఏం మాట్లాడినా ఏమీ అనదు. పైగా యువతులను రెచ్చగొడుతుంది. ఆ సన్ని వేశం కాస్తా ముగిసేక యజమానురాలు ఎప్పట్లాగే వాళ్ళమీద పెద్దపులిలా విరుచుకుపడుతూంటుంది.

బస్తీ విడిచిపెట్టి తన గ్రామానికొస్తే యిక ఆవిడ బోను విడచిన పెద్దపులే. తనచుట్టూచేరిన పల్లెటూరివాళ్ళమీద అధికారం చెలాయించడమేగాక వారిని అవమానపరుస్తుంది. తాను నాగరికత బలిసిన జమీందారిణి. మిగిలినవాళ్లు అనా

గరికులు, మోటుమనుష్యులు. బస్తీ జనమంటే ఆమెకునిర్లక్ష్యం. పల్లెజనమంటే నిర్లక్ష్యానికితోడు అసహ్యం.

ఇంతసేపు గొంతుసవరించి పియానోచెంత సంగీతకృతి సాధకం చేసుకుంటున్న పాండలవిస్కీ చివరికి ఆలాపన కట్టిపెట్టాడు. తనగదివిడిచి మధ్యహాలులోకి వచ్చాడు. అప్పటికే హాలు అలంకరించి వుంది. లాసున్స్కాయా కాళ్లు జాపుకొని మెత్తని సోఫామీద ఠీవిగా జేరగిలబడింది. ముందుబల్లమీది పూలగుత్తులను నెమ్మదిగా తీసి నాజూకుగా వాసనచూస్తూ వుంది. కిటికీచెంత నటాలియా ఆమెపక్క అరవైఏళ్ళ ఒక ఫ్రెంచి వృద్ధవనిత కూర్చున్నారు. ద్వారంచెంత ఒక మూల కూర్చుని బెసిస్టోవ్ వార్తాపత్రిక చదువుకుంటున్నాడు. అతని చేరువనే వాన్యా పెట్యాలు పులిజూదం ఆడుకుంటున్నారు. తలుపులకు జేరబడి ఒకచేయి వెనక్కిపెట్టుకొని పిగసోవ్ నించునివున్నాడు.

పిగసోవ్ ఒకవింతమనిషి. అంతా చిత్రమైన ప్రవృత్తి. లోకంలో ఏదైనా ఎవరైనా ముఖ్యంగా ఆడవాళ్ళంటే అతనికి అరికాలిమంట. ఏదో ఒకటి మనస్సులో పెట్టుకొని పొద్దున్న లేచింది మొదలు రాత్రి పడుకునేవరకూ ఊరికే సగుణుగుతూనే వుంటాడు. ఆవిసుగుదలకు విధీవిరామంలేదు. లేనిపోని విమర్శ, చెణుకులు, సూటిపోటిమాటలు కందిరీగలాగ చెవుల్లో గుయ్‌గుయ్‌మంటూ ఒకటేరొద. అతని నవ్వూ గొంతుకధ్వని, మాటలు విన్నవాళ్ళకు అతనేదో జబ్బుతో బాధపడుతూన్నట్టు అనిపిస్తుంది. పిగసోవ్తత్వ మెలాంటిదో తెలిసివుండే లాసున్స్కాయా అతనిని ఆహ్వానించుతూ

వుంటుంది. అతని వికారాలనుచూస్తూ, ఆనందిస్తూ వుంటుంది. అతను మాటలాడుతుంటే ఆమె కడుపుబ్బ నవ్వుతుంది. ప్రతి చిన్న విషయాన్ని అభూతకల్పనలతో గోరంతలు కొండంతలు చేయడం పిగసోవ్‌కు అలవాటు. ఉపమానాలు, అతిశయోక్తులు అతని మాటల్లో దొర్లుతూవుంటాయి. ఏదైనా ఒక దురదృష్టకర సంఘటన చెవిని పడిందా దాని అంతు కనుక్కొండే వదిలిపెట్టడు. స్వల్పసంఘటననుసైతం భూతద్దంతోచూస్తూ గంటలతరబడి ప్రశ్నలపై ప్రశ్నలు కురిపిస్తూనే వుంటాడు. మాటవరసకు ఒక పల్లెటూరు కాలి పోయిందనో లేక వంతెన కూలిపోయిందనో, ఒక రైతు గడ్డి కోస్తూ కొడవలితో చేతులు కోసుకున్నాడనో అతని చెవిని పడితే యిక నిద్రపోడు. యీ ప్రమాదానికి కారణం ఎవతె? ఆవిడెవరు? ఎందుకింత అజాగ్రత్తగా వుంది? అంటూ ప్రశ్నలడుగుతూనే వుంటాడు. ఏ ప్రమాదానికైనా ఆడదే కారణమని అతని ఉద్దేశం. 'నే చెప్పలేదూ! స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః' ప్రళయహేతువులైన' అతని ఉద్దేశ్యాలు అప్పుడప్పుడు అతని ప్రాణానికి ముప్పు తెస్తూ వుంటాయి. యిలాంటి మాటలతోటే పిగసోవ్ ఒకసారి తన ప్రాణం మీదకు తెచ్చుకున్నాడు. పిగసోవ్ మాటలకు కోపగించి ఒకావిడ అతనిపై కలియబడింది. ధూం ధాం అంటూ కొట్ట వచ్చింది. ఆమెకాళ్ల మీదపడి, ఎంతో బతిమాలుకుంటేనే తప్ప పిగసోవ్ బయటపడలేకపోయాడు. ఇక ఆ తోవవెంట తొంగిచూడనని మాట యిచ్చిన తరువాత ఆమె అతన్ని కనికరించి వదిలిపెట్టింది.

ఆడవాళ్లు అవమానింపబడడం అతనికిసరదా. ఒకసారి లాసున్‌స్కీయా గుర్రం ఒక దాసీపిల్లను కొండమీదనుంచి కిందకు పడవేసింది. ఆ గుర్రానికి పంచకల్యాణి గుర్రమని ముద్దుగా అతను పేరుపెట్టాడు. ఆ దాసీపిల్ల పడినచోటు అతనికి పుణ్యక్షేత్రం. గొప్ప యాత్రాస్థలం.

యిటువంటి సదుద్దేశాలు ఉన్నాయికనుకనే జీవితంలో పిగసోవు ఏ మంచినీ సాధించలేకపోయాడు. తలిదండ్రులు పేదలు. తాలూకా ఆఫీసులో గుమాస్తాపని చేసుకొని పిగసోవుతండ్రి కాలంవెళ్ళబుచ్చాడు. వచ్చేజీతపురాళ్లు కుటుంబపోషణకే సరిపడేవికావు. అందువల్ల పిగసోవు చిన్నప్పుడు చదువుకు గుంటగట్టి గంటవాయించాడు. ఆ చదివిన నాలుగురోజులూ వానాకాలంచదువే. కొడుక్కి యింతఅన్నంపెట్టడం; నాలునిక్కర్లు కుట్టించడంతో తనబాధ్యత తీరిపోయిందని తండ్రి అనేవాడు. తల్లికి అభిమానంవున్నా చేయగలిగిం దేమీలేదు. ముద్దుముద్దుగామాత్రం కొడుకునుసాకింది. కాని ఆ మాతృప్రేమనుకూడ పిగసోవు ఆట్టేకాలం నోచుకోలేదు. చిన్నతనంలోనే తల్లి చనిపోయింది. గుండెధైర్యం తెచ్చుకొని పిగసోవు తనకుతానే బస్తీకిపోయి స్కూల్లోచేరాడు. ఫ్రెంచి, జర్మను, లాటిన్ భాషల్లో వ్యవహారజ్ఞానం అలవరుచుకున్నాడు. తాలింఖానాలోచేరి కుస్తీపట్లూఅవీ నేర్చుకొని మంచిసర్టిఫికెట్లుసంపాదించాడు. వయస్సువస్తున్నకొద్దీ అతనిలో పట్టుదలహెచ్చింది. డోర్పాట్ చేరేసరికి చేతిలో రాగిదమ్మిడీ లేదు. దరిద్రం వెంటాడుతూనే వుంది. అయినా పట్టుదల అధికమైంది. ఏదో కొంత విజ్ఞానం ఆర్జించుకొని విద్యావంతుడ ననిపించుకొని,

భాగ్యవంతుల పరిచయం, స్నేహం సంపాదించాలని అతని అభిలాష. ఈ ప్రయత్నంలో అడ్డంకులేమొచ్చినా అతను లెఖ్ఖ పెట్టలేదు. విశ్వవిద్యాలయంలో చేరేసరికి బాధలు మరీ విపరీతమైనాయి. లేమితోపాటు పట్టుదల, ఉత్సాహం, అకుంఠిత దీక్ష పెరిగాయి. ప్రతివస్తువును పరిశీలనగా చూడడం, సూక్ష్మాతిసూక్ష్మంగా ఆలోచించడం అతని కలవాటైంది. అతనిమాటలు కత్తులవలె చురుక్కుమంటాయి. వింతతరహాగా ప్రసంగిస్తూ కోపంతో చురచురలాడుతాడు. తాటాకుమంటలా అట్టే మండి యిట్టే చల్లారిపోతాడు. అభిప్రాయాలు చెప్పుకోదగ్గంత ఉదాత్తమైనవికావు అయితేనేం; తన అభిప్రాయాలు అమూల్యమైనవని, గంభీరమైనవని అతనిఊహ. సద్యఃస్ఫురణ, చతురత తనకు వెన్నతోపెట్టినవిద్య అన్నట్లుగా, యితరులకు తోచేటట్లు మాట్లాడే నేర్పరి, అతని మాటలు విని, అసాధారణ ప్రజ్ఞావంతుడని మామూలు మనుష్యులు భావిస్తుంటారు.

చచ్చిచెడి చాయంగల విన్నపాలతో పిగసోవ్ పట్టభద్రుడయాడు. ఇక ఎం. ఎ చదువుకొని ప్రొఫెసరు కావాలని కలలుకన్నాడు. విద్యారంగంలో అయితే తాను మెప్పుపొందగలనని, సహచరులతో సమానఛాయాతో మెలగగలనని ఆశించాడు. సహచరుల మెప్పుకోసం వారిని పొగడుతూ, భాగ్యవంతుల స్నేహం విశ్వవిద్యాలయంలోనే సంపాదించాడు. కాని పిగసోవ్ తత్వం సహచరులకు కిట్టలేదు. చిన్నతనంనుంచీ తగిన గురువు లేకపోవడంవల్ల కేవలం తన శక్తిమీదనే ఆధారపడి, ఒక పద్ధతిగా చదువుకోక

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు. (కృష్ణా జిల్లా.)

పోవడంవల్ల పిగసోవ్‌కు పాండిత్యం దూరంగానే వుండి పోయింది. ఈ చింత అతనిహృదయాన్ని సదా దహించుతూనే వుంది. దీనికితోడు అతని సహాధ్యాయి డొకడు హఠాత్తుగా జీవితంలో గొప్పవాడై పోవడం మరీ కంటకమనిపించింది. మరి ఆ సహాధ్యాయి పెద్ద తెలివైనవాడుకాదు. పైగా మందబుద్ధి కూడాను. అతన్ని చీటికిమాటికి పిగసోవ్ వేళాకోళం చేస్తూండేవాడు. ఎంత పరిహాసాస్పదుడైనా చిన్నతనంనుంచీ క్రమశిక్షణతో పెరగడంవల్ల అతని సహాధ్యాయి రాణింపుకు వచ్చాడు. అతను గొప్ప ఉద్యోగి కావడంతో పిగసోవ్‌కు వెన్నుమీద పొడిచినట్లైంది. పుస్తకాలను, నోట్సుని పొయ్యిలో పారవేసి పిగసోవ్ సివిల్ సర్వీసులో చేరాడు. చేరినవెంటనే తాను గుమాస్తాగిరీనుంచి నిచ్చెనెక్కినట్లు ఒక్కొక్క మెట్టే పైకెగబ్రాకి పెద్దఉద్యోగి కాబోతున్నానని తలపోశాడు. రానురాను ఆ పెద్దఉద్యోగం మొదట అనుకున్నంత సులభంగా చేతికి చిక్కేదికాదని తేలిపోయింది. కాగా యీ గుమాస్తాగిరీ తలకు భారమైంది. ఎక్కడవేసిన గొంగళి అక్కడే వున్నట్లు గుమాస్తా ఫైల్లు చేతుల్లోంచి మారలేదు. దక్షత లేకపోయినా, తన అసమర్థతను మాటల్లో ముఖభంగిమల్లో కప్పిపుచ్చుకునే టక్కరితనం సాహసం ఆఫీసులో అతనికి రక్షణదుర్గాలు.

ఎప్పుడూ ఏదో పనిచేస్తున్నట్లు, ఆలోచిస్తున్నట్లు, కలలోకూడా ఫైళ్ళనుగురించే పలవరిస్తున్నట్లు కనిపించేవాడు. కాని అతను కలలుగంటున్న ప్రపంచం వేరు. జీవితంలో ఏదో ఒకలాగ గొప్పవాణ్ణి కావాలనేకోరిక అతన్ని భూతంలా

పట్టుకొని వేధించసాగింది. గొప్పవాణ్ణి కావాలనేతొందరలో తప్పటడుగులు వేశాడు. ఫలితంగా గుమస్తాగిరీకి స్వస్తి చెప్ప వలసివచ్చింది. ఉద్యోగానంతరం పిగసోవ్ ఒక గ్రామానికి వలసపోయాడు. అక్కడ తలవని తలంపుగా ఒక భాగ్యవంతుల పిల్లతో జోస్తీ కుదిరింది. నవ్వులతోను, పొగడ్తలతోను, హాస్య సంభాషణలతోను ఆ పిల్లను పిగసోవ్ మంత్రముగ్ధను చేశాడు. ఇద్దరికీ వివాహమైంది. కొన్నేళ్ళుగడిచాయి. కాని పిగసోవ్‌కుమాత్రం మనస్వాస్థ్యం చిక్కలేదు. తను సంసారి కావడం తనకేదో తన కుటుంబజీవితం దుఃఖభాజన మనిపించి ప్రపంచమంతా పచ్చగా కనిపించింది. భర్తతో వేగలేక భార్య పొలం పుట్రా అమ్ముకొని మాస్కో వెళ్ళిపోయింది. పిగసోవ్‌కు యిల్లాలుపోయి యిల్లుమాత్రం మిగిలింది. భార్య తనను పరిత్యజించేసరికి పిగసోవ్‌కు మతిపోయింది. జీవితంలో యింత పరాభవం తా నెన్నడూ సహించలేదని మనస్సు క్షోభపడింది; కాని పట్టుదల హెచ్చింది. భార్యమీద కోర్టులో కేసుపెట్టాడు, ఓడిపోయాడు. దానితో తలదిమ్మెత్తి తన యింట్లోనే ఏకాకిగా ఉండిపోయాడు. కొంతకాలం పోయే సరికి బుద్ధి ఆస్తిపాస్తులమీదికి మళ్ళింది. భూమి పుట్రా సంపా దించాలనే ఆశ హెచ్చింది. చుట్టుపక్కలవాళ్ళను మచ్చిక చేసుకున్నాడు. తన యింటికి గ్రామస్థుల నాహ్వానించడం, నవ్వుతూ పలకరించుతూ ఆప్యాయంగా మాట్లాడడంప్రారంభిం చాడు. మొహంముందు పొగడ్తలు, మొహం వెనకాల తిట్లు దీవనలు అతనికి నిత్యకృత్యమైపోయింది. పల్లెజనాన్ని ఒక తరహా అనుపాజ్ఞల్లో వుంచాలని తాపత్రయం. అయితే అతని

ఎదుట భయభక్తులు నటించుతూ, మొహం చాటైతే ఎవరూ భయపడేవారుకారు. ఈ తాపత్రయంలో పిగసోవ్ యిప్పుడు మాటవరుసకికూడ పుస్తకం తెరచిచూసిన పాపాన పోవడం లేదు.

లాసున్స్కయా విందుకు ఆహ్వానించేసరికి పిగసోవ్ ఊరుదాటి యిన్నాళ్ళకు బయటకొచ్చాడు. విందు ప్రారంభం కాబోతుంటే పాండలవిస్కీ హాలులోకి ప్రత్యక్షమయాడు. లాసున్స్కయా అతన్ని ఆహ్వానించి, మందహాసంతో వాన్ని లోవ్నా వస్తోందా? అని ప్రశ్నించింది.

'మీరు పిల్చినందుకు ఎంతో సంతోషించింది. విధిగా వస్తానంది' అంటూ పాండలవిస్కీ జుత్తు సవరించుకుని, చేతులు ముందుకుసాచి గోళ్ళవంక చూచుకున్నాడు.

'పావ్లోవిచ్ కూడా వస్తున్నాడా?'

'ఆఁ! అన్నా చెల్లెలూ కలిసే వస్తున్నారు.'

పిగసోవ్ వంక లాసున్స్కయా తిరిగి ఓహో! మన ఆడవాళ్ళంతా వస్తున్నారన్నమాటే! మా కుటుంబమంటే ఎంత అభిమానం!

ఆడవాళ్ళంతా వస్తున్నారనే మాటవిని పిగసోవ్ ఉలుక్కిపడ్డాడు. పెదవులు కంపించాయి. చేతులు వణికాయి. భుజాలు అదిరాయి. వాదనకు వచ్చినవాడిలా ఊపిరి బిగించి, రావడంలో వింతేముంది? రాకేం చేస్తారు? పేరంటమంటేసరి, ఎగిరెగిరి మరీ వస్తారు. బొట్టుపెట్టి వాయిన మిస్తామంటే పదామడల దూరమైనాసరే పరుగెత్తుకెడతారు. వెనకటికి నాలాంటిదే ఒకావిడ పేరంటానికి పిలవకపోయినా,

'మా అప్ప పట్టుచీరె కట్టుకొస్తానందిట! ఆడవాళ్లంతా యింతే!...అహాఁహాఁ! మన ఆడవాళ్ళ సంగతి కాదనుకోండి!'

'అదేం? మనవాళ్లనికూడా అందులో చేర్చు. నీ నోటికి అడ్డా, ఆపా?'

'ఇందులో మన, పరభేదం లేదనుకోండి. ఆడదాని నైజమే అంత. ఊఁ అంటే కోపం. ఆఁ అంటే కోపం. కోప మొచ్చినా పట్టలేరు. రాకపోయినా పట్టలేరు. సంతోష మొస్తే చూళ్లేం. దుఃఖం కలిగితే ఓదార్చలేం. మాట్లాడితే కళ్లమ్మట నీళ్లు. బొటబొట ఒకటే ఏడుపు. మూతి వంకర పోతుంది. కళ్లు ఉబ్బిపోతాయి. బుగ్గలు లోతుకుపోతాయి. మాటవరసకి ఒక ఎలకనుచూసి ఆడది భయపడిందే అను కుందాం ... లేదా నూనెగిన్నె కాకి పట్టుకుపోతూంటే చూసిందే అనుకుందాం...అదంతా యెందుకు? పొరుగమ్మో ఇరుగమ్మో ఓ నెక్లెస్ చేయించుకుని మెళ్ళో వేసుకుందను కోండి...అలాంటప్పుడు ఏ ఆడదైనా ఏం చేస్తుందంటే...'

'ఏం చేస్తుంది పిగసోవ్? ఆడదాన్నయినా నాకీ విషయాలే తెలియవ్...'

'ఏం చేస్తుందా' అంటూ పిగసోవ్ బొర విరుచుకుని ఆడదానిలా ఒక భంగిమపెట్టి నిలబడ్డాడు.

'ప్రతీ ఆడదీ మొదట పెట్టే భంగిమ యిది. వెంటనే అమ్మో అమ్మో! 'అమ్మ నా కూతురో' అని అరుస్తుంది. తరవాత లబో లబో మంటుంది. నెత్తిమీద నీళ్ళకుండ వున్నట్లు, ఆడకూతురికి ఎంత వేగం వస్తాయండీ కన్నీళ్లు!... ఓసారి ఏమైందంటే...'

'సగం సగంలో ఆపేయకు. మొండితేలు కుడుతుంది.'

'ఆడదానికి నిజంగా బాధ కలిగితే ఏయే భావాలు, ఉద్రేకాలు పుట్టుకొస్తాయా అని నేను పరిశోధించాను. ఒకావిడ వెనకాలే వెళ్ళి.'

'వెళ్ళి ఏం జేశావు ?'

పిగసోవ్ కళ్లు మిలమిలా మెరిసాయి.

'ఆవిడ వెనకాలే వెళ్ళి చేతిలోవున్న కత్తితో ఆవిడ భుజంమీద మెల్లగా పొడిచాను. ఆమె కెవ్వున కేక వేసింది. కేకవిని అద్భుతం, అద్భుతం అనుకున్నాను. కెవ్వుమనివినిపించిన ఆ కేక తెచ్చిపెట్టుకున్న దేమీగాదు. నిజమైన ఉద్రేక మంటే అదే. హాలులో వున్నానన్నమాట ! వాళ్ళంతా పకపకా నవ్వసాగారు. నవ్వుతూ లాసున్‌స్కయా నీవన్నీ అబద్ధాలే. బాకుతో నువ్వు ఒక ఆడపిల్లను పొడిచావని నమ్మమంటే ఎలానమ్మడం ?'

'ఆఁ. బాకుతోనే పొడిచాను. ప్రమాణపూర్తిగా పెద్ద బాకుతోనే పొడిచాను. బాకంటే బాకు కాదు. యుద్ధంలో బాకు.

ఫ్రెంచి వనితవంక తిరిగి 'అతని మాటలేమీ నమ్మకండి. హాస్యానికేవో అలా అంటూవుంటాడు. పిగసోవ్ సంగతి ఎవరికి తెలియదుగనుక' అని లాసున్‌స్కయా సర్దుబాటు చేసింది. కాని ఫ్రెంచివనితకోపం చల్లారలేదు. లోలోపల సణుక్కుంది. పిగసోవ్ తనధోరణి సాగించుతూ 'నామాట నమ్మమని ఎవరు చెప్పారు? ఆడవాళ్ళు ఎంతకైనా తగుదురు. ఉన్న విషయం చెప్పాను. నామాట నమ్మకపోతే మా పొరుగు వాళ్ళ నడగండి. యింకో దారుణం చెప్పనా ? మా పొరుగా

విడపేరు ఎలినా. ఒకసారి ఏంజేసిందో తెలుసునా ? తన మేనల్లుడిపీక ఉత్తరించింది. ఈసంగతి ఆవిడే నాతో చెప్పింది.'

'ఆహా ! నీబుద్దేలా వికసిస్తోందో !'

'నాబుద్ధిమాటకేం ? ఆడవాళ్ళబుద్ధి నన్ను పూర్తిగా చెప్పనియ్యండి. అంతావిని, ఇది మంచి, యిది చెడ్డా అని అప్పుడు తేల్చండి. యింతకీ ఎలినా మంచిదే. లేనిపోనివి ఆవిడ మీద చెప్పడానికి, నా కేంబట్టింది ? ఆవిడేమన్నా నాకు విషం పెట్టిందా ? ఉన్నవిషయం చెప్తున్నాను.'

'యిక యీ ధోరణిలోకి నువ్వుదిగితే తెల్లగుర్రాన్నెక్కినట్లే. గుర్రం దిగమన్నా దిగవు. యిలా మాట్లాడడం నీ కో వ్యసనం అయిపోయింది.

'ఏమిటేమిటీ ? వ్యసనం; తెల్లగుర్రం ! వ్యసనమంటూ ఒకటుంటే అదంతా ఆడవాళ్ళకే. నాకు మాటాడటం ఒక వ్యసనమైతే వాళ్ళకు మూడు వ్యసనాలు. యీ మూడు వ్యసనాలు మూడు గుర్రాలు. నిద్రలోకూడా వాటిమీదే స్వారీ చేస్తూవుంటారు.'

'ఏమిటా ఆడవాళ్ళవ్యసనాలు ?'

'మూడూ. మూడు. ముచ్చెం మూడు' అంటూ పిగసోవ్ మూడువ్రేళ్ళను చూపించాడు. ఒక్కొక్క వేలేముడుస్తూ 'ఒకటి: అలగడం, రెండు: కోపగించడం, మూడు: తిట్టడం.'

'ఆడవాళ్ళమీద నీకింత కోపంరావడానికి కారణం, ఎవరో నిన్ను మోసగించి వుంటారు.'

'మోసగించడమా ?' అని పిగసోవ్ ప్రశ్నించాడు.

పిగసోవ్ ఉదంతం జ్ఞప్తికివచ్చి లాసున్‌స్కాయా అవునన్నట్లు తల వూపింది.

'అవును. నా జీవితంలో ఒకే ఒకసారి ఒక స్త్రీ నన్ను మోసగించింది. కాని ఆవిడ చాలామంచిది. ఉత్తమురాలు.

'ఎవ రావిడ ?'

'మా అమ్మ !'

'మీ అమ్మా! ఆవిడ నిన్నెలాగ మోసగించ గలుగుతుంది ?'

'నన్నుకని యీ భూమిమీద పడ వేసింది యింతకన్నా మోసమేముంది ?'

యీ మాటలువిని లాసున్‌స్కాయా మౌనంగా ఊరుకుంది.

ఆమె కనుబొమ్మలు ముకుళించుకున్నాయి. సంభాషణ, సంతోషానికి బదులు దుఃఖకారణమౌతున్నదని భయ పడింది. పాండలవిస్కీ-వంక తిరిగి కృతి ఒకటి పాడమని ఆదేశించింది. పాండలవిస్కీ పియానో చెంత కూర్చుని పాడ సాగాడు. కృతి మధురంగా పాడుతున్నాడు. నటాలియా సంగీతాన్ని శ్రద్ధగా వింటూ కూర్చున్నది. లాసున్‌స్కాయా 'ఆ కృతంటే నా కెంతో యిష్టం. నువ్వేమి వినడంలేదే? ఏమి టాలోచిస్తున్నావు పిగసోవ్ ?'

'ఏమి టాలోచిస్తున్నానా ? లోకంలో మూడురకాల అహంకారులు ఉన్నారు. ఆ మూడురకాల్ని గురించీ ఆలోచిస్తున్నాను. మొదటిరకం అహంకారులు, వాళ్లు బ్రతుకుతారు. యింకొకళ్లని బ్రతకనిస్తారు. రెండోరకం, తాము

బ్రతుకుతారు; యితర్లను బ్రతక నివ్వరు. యిక మూడోరక మంటారా? వాళ్ల దుంప తెగ, వాళ్ళు బ్రతకనూ బ్రతకరూ, ఒకళ్ళని బ్రతకా నివ్వరు. మొత్తంమీద యీ మూడు రకాల్లోనూ ఆఖరివాళ్ళు ఆడవాళ్ళు."

'అమోఘం, అమోఘమయ్యా పిగసోవ్! ఆడవాళ్ల అహంకారం మాటకేంగాని...నీ మాటల్నిచూసి నువ్వే తన్మయుడవై పోతున్నావే! ఆశ్చర్యం, నా మాటలమీద నీ కెంత నమ్మకం! నీ మాటకిక తిరుగులేదన్నట్టు, కుండలు బద్దలుకొట్టినట్టు మాట్లాడేస్తావ్? నువ్వెప్పుడూ పొరపాటే చేయవా?'

'ఎందుకు చేయను? నేనేకాదు. మొగవాళ్ళంతా పొరపాటు చేస్తారు. కాని ఆడదిచేసే తప్పుకీ, మొగాడుచేసే పొరపాటుకీ ఒకటే భేదముంది. అదేమిటో మీకు తెలుసునా?'

'తెలియదు'

'నే చెప్తావినండి. మాటసామెతకు రెండురెళ్లు ఎంతంటే మగవాడు నాలుగు అనిగాక అయిదనో, మూడనో అనొచ్చు. అదేప్రశ్న ఆడదాన్నడిగితే రెండురెళ్లు ఒకకొవ్వొత్తి అవుతుం దంటుంది.'

'యీ మాటలు చాలాసార్లు చెప్పావు. యిప్పుడు నువ్వు వింటున్న సంగీతానికీ, నువ్వు చెప్పిన అహంకారుల సిద్ధాంతానికీ పోలిక ఏమిటి?'

'ఏమీలేదు, అసలు ఆ సంగీతం నే వింటేగా?'

'నీ ధోరణి మళ్ళించడం ఎవ్వరితరంకాదు. సంగీతం యిష్టం లేకపోతే మరి దేనిమీద నీ కిష్టం? కావ్యపఠనం?'

'అది మన కిష్టమేగాని ఆధునిక కావ్యాలంటేమాత్రం పడదు.'

'అవేం పాపం చేశాయో?'

'అలా అడగండి చెప్తాను. ఈమధ్యనే ఒకసారి ఏమైందంటే, నేనూ ఒక పెద్దమనిషీ, ఒక నది దాటవలసి వచ్చింది. సరే. పడవమీద బయలుదేరాం. పడవనిండా సామాను వుంది. మనుషులూ వున్నారు. పడవ దారిమధ్యలో ఒక యిసుకతిన్నెవద్ద నిలబడిపోయింది. దాన్ని పైకిలాగేసరికి పడవవాళ్ళకు తలప్రాణం తోకకు వచ్చింది. వాళ్లు శ్రమ పడుతూవుంటే పడవలోని పెద్దమనిషి తానే లాగుతున్నట్లు మూలగడం ఆరంభించాడు. పనిచేసేది ఒకళ్లు. మూలిగేదింకొకళ్ళు. అలాగేవుంది మన ఆధునిక సాహిత్యం!'

లాసున్‌స్కయా నవ్వుతున్నకొద్దీ పిగసోవ్ తనధోరణిని మరీ హెచ్చించాడు. 'యీ ఆధునిక కవులకు మహా విచిత్రమైనమాట లలవడ్డాయి. ఆధునిక జీవితాన్ని చిత్రీకరించడమట. సామాజిక సమస్యలను ప్రగాఢ సానుభూతితో పరికించడమట. సామాజికసమస్యలు వాస్తవికత, సానుభూతి యివన్నీ విచిత్రమైన మాటలు.'

'యింతసేపు నువ్వు దుయ్యబట్టిన ఆడవాళ్ళు మరీ మాటలు అలవర్చుకోలేదే?'

'ఆ మాటలు చెవినపడితే వాళ్ళూ ఉపన్యసిద్దురు.'

లాసున్‌స్కయా మోము ఎర్రబడింది. తెచ్చిపెట్టుకున్న నవ్వుతో 'అబ్బే. నువ్వు వట్టి దండాసివై పోతున్నావు పిగసోవ్' అంది. పిగసోవ్ నోరుమెదపలేదు. అంతా నిశ్శబ్దం.

బెసిస్టోవ్‌ను చేతితో తాకుతూ కుర్రవాళ్లు 'జోలోటోనోషా' అనే ప్రదేశం ఎక్కడుంది మాష్టారూ?' అని కుతూహలంతో ప్రశ్నించారు.

బెసిస్టోవు సమాధానం చెప్పేలోపున, పిగసోవ్ జోక్యం కలిగించుకున్నాడు. 'ఎక్కడుందా? దిక్కుమాలిన ఉక్రేనియాలో వుంది.' ప్రసంగంమధ్య ఉక్రేనియా ప్రసక్తి వచ్చేసరికి పిగసోవు తనదృష్టిని అటుమళ్ళించాడు. లాసున్‌స్కయా కేసి తిరిగి 'నాచేతిలో డబ్బేవుంటే ఉక్రేనియాలో నేను ఓ మహాకవి నై పోదును.'

'నీకు ఉక్రేనియాభాష వచ్చునా?'

'ఒకక్షరం రాదు. రావలసిన అసవరంలేదు.'

'భాష రానక్కర్లేదు?'

'కవి కావడానికి భాషెందుకు? ఓ కాయితంముక్క తీసికొనేదీ; శ్మశానగీతికలు వ్రాసేదీ. క్రూర ఘోర దారుణ కర్కశ మృత్యువహా! కబళించినది చిన్నారిని తృటిలో ఒక కబళముగ అంతేగా కవిత్వమంటే! విసిల నిర్మల వినువీధి విహారించెనుగా మేఘముల్ పచ్చని పర్వతశ్రేణుల ఒత్తుగ జుత్తుగ కప్పెనురా! అని రాస్తేసరి ఇదీ గీతికే. అచ్చుకొట్టి అవతల పారవెయ్యొచ్చు. పదిమందీ చదువుతారు. ఉక్రేనియన్ వాడు మరీని.

గడ్డంకింద చెయ్యిపెట్టుకొని, గుస్లు మిటకరిస్తూ 'ఆహా! ఏమికవిత్వం; ఏమికవిత్వం అని ఆనందంతో పరవశుడౌతాడు. వాళ్ళకు ఉద్రేకం జాస్తిగదూ. ఆనందభాష్పాలు జలజలారాల్తాయి. ఆధునికసాహిత్యం విశేషించి ఉక్రేనియన్

కవిత్వంగురించి యింత చులకనగా పిగసోవ్ మాట్లాడుతున్నందుకు బెసిస్టోవ్‌కు కొంచెం కోపంవచ్చింది.

'ఏమిటండీ. మీరుమాట్లాడుతున్నది? మీకు ఆభాష రాదు. ఆదేశం చూసివుండరు. నేను ఉక్రేనియాలో వున్నాను. నాకా భాషవచ్చు. కావ్యమాధుర్య మేమిటో నాకు తెలుసు. మీరుచెప్పిన ఓహో, గీహోలు మీ స్వంతకవిత్వంలో నేగాని నేను యింకెక్కడా వినలేదు.'

'వినకపోవచ్చును. కాని నేం జెప్పేదేమిటో నువ్వు అర్థం చేసుకోలేవు. ఉక్రేనియావాళ్ళు ఛణికోద్రేకులు. వాళ్ళను యిట్టేరెచ్చగొట్టవచ్చు. యిప్పుడునువ్వు ఏదోభాష గురించి మాట్లాడావే! అయితే ఒకప్రశ్న. ఉక్రేనియన్ అంటూ భాషొకటివుందా? అదొక భాషా? నే నొకసారి ఓ యుక్రేనియావాణ్ణి ఒకచిన్న రష్యన్‌మాటచెప్పి 'తర్జుమా చేయి భాయీ.' అన్నాను. పాపం చేశాడు. విందునుగదా. పిట్టలు కిచకిచమన్నట్టు, అదేం భాషా? అదీ ఒక భాషే నంటూ నువ్వు నాకు చెప్పొచ్చావు. అందులోనూ స్వతంత్రమైన భాషట. నా కంఠంలో ప్రాణ ముండగా యీ మాట నే నొప్పుకునేదిలేదు.'

పిగసోవ్‌తో వాదనకుదిగాలని బెసిస్టోవు కుతూహాల పడ్డాడు. కాని లాసున్‌స్కయా అడ్డువచ్చింది.

'అతనితో ఏమిటిలే. పిగసోవ్ యింకోలాగ మాట్లాడతాడని ఎవ రనుకుంటారుకనక?'

'పిగసోవ్ వెకిలిగా నవ్వాడు. యింతలో, నౌకరు లోపలకువచ్చి. 'పావ్‌లోవ్నా ఆమె అన్నగారు వస్తున్నట్లు'

తెలియజేశాడు. లాసున్‌స్కయా లేచి ఎదురువెళ్ళి వారిని లోపకి తీసుకవచ్చింది. 'యిద్దరూవచ్చారా? సంతోషం. కులాసాగా వున్నావమ్మా?' అంది. పావులోవిచ్, లాసున్ స్కయాతో కరస్పర్శచేసి, నటాలియా చెంతకు వెళ్ళాడు. పావులోవ్నాతో వెళుతున్న లాసున్‌స్కయావంక తిరిగి పిగసోవ్ అడిగాడు.

'అన్నట్టు ఎవరో ఆర్థికశాస్త్రవేత్త, పట్టణంనుంచి వస్తున్నాడన్నారే? యిప్పుడిక్కడికి వస్తాడా? అతనేగదా ప్రధాన అతిథి'

'అవును యిప్పుడే వస్తాడు.'

'అతనూ వేదాంతశాస్త్రంలో నిష్ణాతుడని యిక్కడ చిన్న పుకారు పుట్టిందే. హేగెల్‌నుకూడా తోసిరాజంటాడట.'

పిగసోవ్ ప్రశ్నకు సమాధాన మేమి యివ్వకుండా పావులోవ్నాను ఒక సోఫామీద ఆసీనురాల్ని చేసి లాసున్ స్కయా ఆమె ప్రక్కనే కూర్చుంది. పిగసోవ్ తన వేదాంత ధోరణిని సాగించుతూనే వున్నాడు.

'తత్వశాస్త్ర మనేది అతి ఉన్నత శిఖరాలనుంచి పరిశీలించదగ్గది. ఉన్నత శిఖరాలనుంచి చూసేవాళ్ళకు నేలనున్న వస్తువులు ఎలా కన్పిస్తాయి? మాటవరసకు ఒకడు ఒక గుర్రాన్ని కొనదలచుకున్నాడనుకుందాం. దాని గిట్టలు, మెడ, తోక అన్నీ చూస్తే తబ్బిళ్లు తెలుస్తాయిగాని పర్వతం మీదనుంచి చూస్తే ఏమైనా కనిపిస్తాయా?'

పావులోవ్నా లాసున్‌స్కయాను యిలా ప్రశ్నించింది.

'ఆయ నెవరో ఒక వ్యాసంవ్రాసి పట్టుకొస్తాడన్నారు?'

'అవునమ్మా. రష్యాలో వర్తక వాణిజ్యాలు పెంపొంద వేసే విధానాన్ని గురించి వ్యాసం రాశాడు. అయితే నువ్వేం గాభరాపడకు. ఆ వ్యాసం యిక్కడ చదవంలే.'

'అందుకుకాదు నిన్ను ఆహ్వానించింది. అతను గొప్ప పరిశోధకుడు. జ్ఞాని. రష్యన్ భాష కరతలామలకం '

"పిగసోవ్ హఠాత్తుగా అడ్డంవచ్చి 'అబ్బో. రష్యన్ భాష మాట్లాడ్డం నేర్చుకొన్నందుకు అతన్ని మనం ఫ్రెంచి భాషలో అభినందిద్దాం.'

లాసున్‌స్కయా పిగసోవ్ వంక తిరిగి 'కానియ్. నీ ఉప న్యాసం కానియ్ ... యింకా అతను ఎందుచేత రాలేదో?' అంటూ పోలుచుట్టూ పరికించింది. అతను వచ్చేలోపున అలా తోటలోకి వెళ్లివద్దాము రమ్మని అందర్నీ ఆహ్వానించింది. 'యింకో గంట ఎలానూ అవుతుంది. తోటలో చక్కని గాలి' అంటూ లేచింది. అతిథులంతా ఒక్కరొక్కరే తోటలోకి నడవసాగారు.

లాసున్‌స్కయా తోట చాలా పెద్దది. నది పొడవునా దట్టంగా పెరిగివుంది. నిమ్మచెట్లు, బత్తాయిలు, వరుసలుగా వున్నాయి. మధ్య నీలికుండీ; పూల మొక్కలు, లతాకుడ్యా లతో తోట తీర్చిదిద్దివుంది.

నటాలియా ముందర నడుస్తూవుంటే, ఆమె పక్కనే వాపులోవిచ్ అడుగులు వేస్తున్నాడు. దారికి కొంచెందూరంలో ఫ్రెంచివనిత నడుస్తున్నది. నటాలియా, పూలపొదలవద్దకు వచ్చి ఆగింది. వాపులోవిచ్ పెదవులను సవరించుకొని, 'యింత సేపూ ఒక్కత్తె వేవున్నావు. ఏమీ ఊసుపోలే దనుకుంటాను?'

'ఊసుపోకేం? యింతసేపూ పిగసోవ్ వుపన్యాసం విన్నాను. అంతకుముందు లేసు లల్లుకున్నాను. పొద్దున్న ఓ మహాగ్రంథ మొకటి పూర్తి చేశాను.'

'ఏమిటో ఆ మహాగ్రంథం?'

'మతయుద్ధాల చరిత్ర.'

పావులోవిచ్ ఆమెవంక క్రీగంటితో చూశాడు. నటాలియా చిరునవ్వు నవ్వింది. పూలగుత్తులను తెంపుకుని యిద్దరూ మరినా లగ్గడుగులు వేశారు.

'యిప్పు డెవరో అతిథివస్తున్నాడని మీ అమ్మ ఎదురు తెన్నులు చూస్తోంది. ఎవరతను?'

'చక్రవర్తిగారి ఆంతరంగికుడట. యింతకుముందు యీప్రాంతాల కెప్పుడూ రాలేదు. ఆయన చాలా గొప్ప వాడని అమ్మ చెపుతూవుంటుంది.'

'మీ అమ్మ యిట్టే బులావులలో పడిపోతుంది. ఎవరేం చెప్పినా నమ్ముతుంది.'

'అంటే దా నర్థం యింకా మా అమ్మ పసిపిల్ల నేకదూ!'

'అంతే మరి...అన్నట్లు మీరు పంపించిన గుర్రం పిల్ల మంచి ఒడుపైంది. దానికి స్వారీ నేర్పుతున్నాను. నాలు గయిదు రోజుల్లో మీ యింటికి పంపించేస్తాను.'

'దాన్ని చంపిమాత్రం పంపకు.'

భవంతిలోంచి గంట గణగణమని వినిపించింది. దూరం నుంచి ఫ్రెంచి వనిత 'భోజనానికి తైయారయింది, రండి' అని కేక వేసింది. తోటదాటి మెట్లెక్కుతున్నప్పుడు నటాలియా,

పావ్లోవిచ్‌లను హెచ్చరించింది. 'మెట్లు జాగ్రత్త. మాటల మధ్యలో జారిపడగలరు.'

విందుకు అనుకున్నట్టుగా చక్రవర్తి అంతరంగికుడు హాజరుకాలేదు. అరగంటసేపు అతిథులంతా అతనికోసం నిరీక్షించారు. విందు ఉత్సాహంగా లేదు. అందరూ మౌనంగా కూర్చున్నారు. పావ్లోవిచ్, నటాలియా ప్రక్కన కూర్చుని ఆమెవంక అప్పుడప్పుడు చూపులను సారిస్తున్నాడు. పాండలవిస్కీ పావ్లోవ్నా చెంతను చేరాడు. ఆమెను ఎలాగైనా మెప్పించాలని మాటలు కలిపేడుగాని, సంభాషణ అనుకున్నంత రంజుగా లేదు. అతడు మాట్లాడుతుంటే, ఆమె ఆవులించడం ఆరంభించింది. బెసిస్టోవ్ శూన్యంగా దిక్కులు చూస్తున్నాడు. కొసకు యింత మాటకారీ, పిగసోవ్ సైతం మూతి బిగించుకున్నాడు. అతన్ని మాటల్లోకి దింపాలని లాసున్‌స్కయా 'ఏమిటో యీ వేళ పిగసోవ్ ఖుషీగా లేడు' అంది.

'నేనా ? ఖుషీగా వుండడం నా అభిమతంగాదు. కాస్సేపు ఆగండి' అంటూ వెక్కిరింతగా, 'ఘనతవహించిన మన చక్రవర్తిగారి అంతరంగికుడూ, మహాతత్వవేత్త, ఆర్థిక శాస్త్ర నిష్ణాతుడూ యిక్కడికి రాకుండా బేఫికర్ అయిపోయాడే? బహుశా గుండె బేజారెత్తి ఉంటుంది.'

'అద్భుతం. అద్భుతంగా మాట్లాడుతున్నానని, అతనెవరో చూడకుండానే, కొంపమునిగిపోయినట్లుముందే నీ కీర్తన.'

పిగసోవ్ కనుబొమ్మలు చిట్లించి నిరుత్తరుడయ్యాడు. గోడనున్న గడియారం ఏడుగంటలు కొట్టింది. 'యింకతను

రాడనే అనుకుంటాను.' అంటూ నిస్పృహతో లాసున్ స్కీయా నిట్టూర్చింది. యింతలో భవంతిముందు గుర్రపుబగ్గీ ఆగిన చప్పుడు వినిపించింది. కొద్దినిముషాలుగడిచాక నౌకరు హాలులోనికివచ్చి లాసున్ స్కీయాకు ఒకచీటీ అందించాడు. చీటీ అందుకొని, చదువుకొని లాసున్ స్కీయా—

'ఈ ఉత్తరం తెచ్చినవారు ఎక్కడున్నారు ?'

'బండీలో వున్నారమ్మా. లోనికి రమ్మనమన్నా ?'

'రమ్మను.'

జమీందారిణి ఆజ్ఞవిని సేవకుడు అవతలికి వెళ్ళాడు. లాసున్ స్కీయా చీటీతెరచి మళ్లీచదువుకొని, 'ఎంతఅవమానం. అరెరే. వద్దామనుకున్నా, విందుకు రాలేకపోయానసీ, క్షమించమనీ ఉత్తరం పంపించారు. అర్జంటుగా పీటర్సుబర్గు వెళ్ళవలసిందని ఆర్డర్లువచ్చాయట. తాను వ్రాసిన వ్యాసం తన స్నేహితుడు రూడిన్ కిచ్చి పంపించాడు. తనే స్వయంగా వచ్చి రూడిన్ ను నాకు పరిచయం చేయా లనుకున్నాడట. రూడిన్ చాలా గొప్పవాడని ఉత్తరంలో వ్రాశారు...అబ్బ. అతనికోసం నిరీక్షించి, నిరీక్షించి కళ్లు కాయలుకాసి పోయాయి. యిక్కడికివచ్చి మనతోపాటు కొంతకాలం ఉంటా డనుకున్నా నే!' అతిథులంతా ఆమెవంక తదేక దీక్షతో చూస్తున్నారు. లాసున్ స్కీయా రూడిన్ కోసం నిరీక్షిస్తూ ద్వారంవంక చూస్తున్నది. తొందర తొందరగా నౌకరు హాలులోకివచ్చి 'డిమిట్రీ నిఖిలోవిచ్ రూడిన్ ! దయచేస్తున్నారమ్మా.'

# 3

రూడిన్ ఆగమనవార్తను నౌకరు తెలియజేసేలోపున హాలులోనికి అతనూ రానేవచ్చాడు. ముప్ఫై అయిదేళ్ళ మనిషి. పొడగరి. కొంచంవంగి నడుస్తున్నాడు. ఉంగరాల జుత్తు. జిగజిగ మెరిసే శరీరం. మొహంలో చురుకుతనం. నల్లనికళ్ళల్లో అవ్యక్తభావాలు. అందంగా తిరిగిన పెదవుల మీద చిరునవ్వు; కోటేరు వేసినట్లు ముక్కు; బట్టలు మాసి పోయి వున్నాయి. బిగుతుగావున్న బట్టల్లో శరీరం యిమడక దుస్తులు పెటపెటలాడుతున్నాయి. హాలులోనికి రాగానే తలవంచి నమస్కరిస్తూ చరచరా లాసున్‌స్కయా చెంతకు వెళ్ళాడు. ఆమెతో పరిచయం చేసుకోవాలని తాను చిరకాలం నుంచీ ఆశిస్తూ వచ్చాననీ, తన స్నేహితుడు తొందరపనుల వల్ల, స్వయంగావచ్చి ఆమెకు పరిచయంచేసే భాగ్యం తనకు కలగలేదనీ, అయినప్పటికీ యీ విధంగానైనా లాసున్‌స్కయా పరిచయం కలిగినందుకు, తానెంతో సంతోష పడుతున్నాననీ చెప్పాడు. రూడిన్ పరిచయం తనకు కలిగినందుకు తానెంతో గర్వపడుతున్నాననీ, యీవేళ పండుగలాగ ఉందనీ, లాసున్‌స్కయా ప్రత్యుత్తర మిచ్చి, సోఫా చూపిస్తూ, 'దయచేయండి' అంది. తరువాత అతిథులందరికీ అతన్ని పరిచయంచేసి అడిగింది. 'ఈ ప్రాంతాలకు రావడం యిదే మొదటిసారా?'

'కాదు. గుబెర్నియాలో నాకో జమీందుంది. ఈ ప్రాంతాల్లో కొంతకాల మున్నాను. ఇప్పుడు ఈగ్రామంలో పనుండి వచ్చాను. యిక్కడే వుంటున్నాను.

'ఎవరింట్లో వుంటున్నారు ?'

'డాక్టరుగారింట్లో, ఆయనా, నేనూ సహాధ్యాయులం.'

'ఓహో ! డాక్టరుగారా ? ఆయన చాలా మంచి వాడని యిక్కడివాళ్ళంతా చెప్తూవుంటారు. చాలా పేరు పొందిన డాక్టరేనట...అయితే చక్రవర్తిగారి అంతరంగికుడు మీ చిన్ననాటి స్నేహితుడా ?'

'కాదు. ఆయనకీ నాకు మొన్న శీతాకాలంలో స్నేహమైంది. మాస్కోలో యిద్దరం వారం పదిరోజులపాటు కులాసాగా గడిపాం.'

'చాలా తెలివైనవా డనుకుంటాను ?'

'అవును. గొప్ప మేధావి.' లాసున్స్కయా జేబు రుమాలు తీసుకొని వాసనచూసుకొంది.

'మీరు సివిల్ సర్వీసులో చేరారా ?'

'ఎవరు ? నేనా !'

'మీరే.'

'యిప్పుడు పని మానేశాను.'

కొంచంసేపు యిద్దరూ మౌనంగా కూర్చున్నారు. అతిథులు ఒకరితో ఒకరు సంభాషించుకోవడం ప్రారంభించారు. పిగసోవ్, రూడిన్‌వంక తిరిగి 'మిమ్మల్నొక ప్రశ్న అడగ వచ్చునా ?' అని ప్రశ్నించాడు. మోకాళ్ళమీద పెట్టుకున్న టోపీని వేళ్ళతో టకటకలాడిస్తూ 'తప్పకుండా అడగండి' అని అతను సమాధాన మిచ్చాడు.

'చక్రవర్తిగారి అంతరంగికుడు వ్రాసిన వ్యాసం గురించి మీకేమైనా తెలుసునా ?'

'తెలుసును.'

'అందులోని విషయాలనుగురించి తెలుసునా అని నా ప్రశ్న.'

'తెలుసునండీ' మనదేశంలో పరిశ్రమలకు, వర్తక వాణిజ్యాలకు గల సంబంధం గురించి బహుశ ఆ వ్యాసంలో చర్చించాడనుకుంటాను' అంటూ లాసున్‌స్కాయావంక తిరిగి పిగసోవ్ ! 'అంతేనా అండీ. మీరు కోరిందికూడా అదే నను కుంటాను.'

లాసున్‌స్కాయా నుదురు వేళ్ళతో మీటించుకుంటూ జ్ఞప్తికి తెచ్చుకొంది. 'అవును. చర్చించవలసిన విషయం అదే.'

'యిలాంటి విషయాల్లో పెద్దగా, నాకు తెలుసున్న దేదీ లేదనుకోండి. కాని నాకు తెలిసినంతవరకు దాచకుండా ఉన్న విషయం చెప్పాలి. దాన్ని మృదువుగా చెప్తున్నందుకు మీరేమి అనుకోకండి. వ్యాస శీర్షిక చాలా గందరగోళంగా వుంది. విషయం అయోమయం.'

వెంటనే రూడిన్ తన కనుబొమ్మలు పైకెత్తి పిగసోవ్ కేసి సూటిగా చూస్తూ 'అంత గందరగోళంగాను, అయో మయంగాను మీ కెందుకు కనిపిస్తోంది?'

పిగసోవ్ హేళనగా నవ్వి లాసున్‌స్కాయావంక అర్ధ వంతంగా చూశాడు. గుటనక్కలాగ రూడిన్‌వంక మెడసాచి ప్రశ్నించాడు. 'అయితే ఆ వ్యాసం అందులోని విషయం మీకు మంచిసిల్ల ప్రాయమన్నమాట.'

'అవును.'

'కావచ్చులెండి. దానికేం...చాలా విషయాలు మీకు తెలిసుండవచ్చు.' పిగసోవ్ మాటలు యింతసేపూ వాసిలోవ్నా వింటూనే వుంది. ఆమె లాసున్‌స్కయావంక తిరిగి 'మీకు తలనొప్పిగా లేదుగదా?' అని అడిగింది.

'తలనొప్పి లేదుగాని, కొంచెం...' అంటూ లాసున్‌స్కయా కణతలు పట్టుకుంది.

జిత్తులమారి పిగసోవ్ తన 'ముక్క మాటలను' మళ్ళీ ప్రారంభించాడు. 'రూడిన్‌గారూ! నాదో చిన్న ప్రశ్న. అన్యథా భావించరనే తలుస్తాను. ఆఁ...ఎవరూ? మీ స్నేహితుడు; ఆయ నేనండి చక్రవర్తి అంతరంగికుడు. ఆయన పేరేమిటండీ? మఫుల్ :మఫుల్ గాదూ?'

'అదేనండీ.'

'ఆయన రాజకీయ, అర్థికశాస్త్రాన్ని ఏదో తీరుబడి వున్నప్పుడు యథాలాపంగా చదివాడా? లేక తన ఆఫీసు పనులు, విందులు, అన్నీ అయిపోగా మిగిలిన ఆ కాస్తసైము లోనూదీక్షగా చదివాడా?'

రూడిన్ మొహం కందిపోయింది. పిగసోవ్‌వంక వెదుకుతున్నట్లు చూశాడు. 'ఈ శాస్త్రంలో ఆయన చాలా దిట్ట. ఆయనవ్యాసం నిర్దిష్టంగా వుంది. తనవ్యాసంలో అనేక సూచనలు చేశాడు.'

'అదింకా నేను చదవలేదుగనుక మీరు చెప్పిందాంతో నాకేం పేచీలేదు. కాని ధైర్యంచేసి ఒక ప్రశ్న అడుగుతాను యదార్థవిషయాలలోకి వెళ్ళకుండా, తన వ్యాసంలో మీ

స్నేహితుడు సాధారణ సిద్ధాంతాలనుగురించే ప్రాశా డనుకుంటాను ?'

'కాదు. అందులో యదార్థవిషయా లున్నాయి. యదార్థ విషయాలమీద ఆధారపడి నిర్ణయానికొచ్చిన సూత్రాలూ వున్నాయి.'

'అలాగా ? సూత్రాలుకూడా ఉన్నాయా ! నా అభిప్రాయ మేమిటో స్పష్టంగా, కుండ బద్దలుకొట్టినట్టు చెప్పనీయండి. ఈ విషయం అనేకసార్లు ఎంతోమందితో చెప్పాను. సాధారణసూత్రాలు, ప్రతిపాదనలు, ప్రణాళికలు యిలా అయితే అలా అవుతుందనే వూహాపోహాలు, యివన్నీ ఎందుకూ దమ్మిడీకి పనికిరానివి. సిద్ధాంతాలనీ, తత్వాలనీ చెప్పడమంటే ప్రజల్ని మోసగించడ మన్నమాట. కంటికి కనుపించే ఉన్నవిషయ మేమిటో స్పష్టంగా పేర్కొని అంతటితో ఊరుకోండి. అంతే గాని వాటిమీద మీ వూహాపోహాలతో సిద్ధాంతా లల్లకండి.'

'ఓహో ! అంతేనన్నమాట. యదార్థవిషయాలను ఆధారంచేసుకొని, సాధారణసూత్రాలు ఊహించుకో గూడ దన్నమాట.'

'సాధారణసూత్రాలు ! వాటిమూంపతెగ, చంపుకు తింటున్నాయి. ప్రతిపాదనలు, విచారణలు, జిజ్ఞాసలు, నిర్ణయాలు ! యివన్నీ నామమాత్రమైన నమ్మకాలమీద ఆధారపడ్డాయి. నానమ్మకమిది, అంటూ ప్రతివిషయంమీద అంతా మాట్లాడ్డమే. ప్రతివాడూ తన నమ్మకాలగురించి మాట్లాడుతుంటాడు. వాటేని మనం గౌరవించా లంటాడు. దేశమంతా ప్రచారంచేసి గడబిడచేస్తాడు...ఛఛా: దిక్కుమాలిననమ్మకాలు.'

'అయితే విశ్వాసాలంటూ ఉండవని మీరు వాదించబోతున్నారన్నమాట.'

'వాదించడ మేమిటి? అస లవి లేనేలేవు.'

'అదేనా మీ నమ్మకం?'

'నా నమ్మక మదే?'

'మీ నమ్మక మిదైనప్పుడు మరి దేశంలో విశ్వాసాలు లేవంటారే? మీకూ ఓ నమ్మకముంది. ఓ విశ్వాసముంది.'

హాలులోనివారంతా ఫక్కున నవ్వి ఒకరివైపింకొకరు చూసుకున్నారు. పిగసోవ్ గొంతు బొంగురుపోయింది. మొహం నల్లబడింది.

'అహా! నన్ను చెప్పనీయండి చెప్పనీయండి' అనేలోపున లాసున్స్కాయా చప్పట్లు చరుస్తూ, 'అద్భుతం. అద్భుతం. పిగసోవ్ వోడిపోయాడు' అని అరిచింది.

పిగసోవ్ తేరుకొని 'ఉండండి. ఉండండి. అప్పుడే అంత సంతోష మెందుకు? ఝిల్లలకగానే పండుగకాదు. ఏదో కేతిగాడిలా హాస్యంగా మాట్లాడితే సరా? ఉన్న విషయ మేమిటో తెలుసుకోవాలి. దాన్ని కాదనాలి. ఎందుకు కాదంటున్నాడో రుజువు చేసుకోవాలి...'

'ఉన్నవిషయం అత్యంత స్వల్పమైనది. సాధారణ సూత్రాలపట్లా, విశ్వాసాలపట్లా మీకు నమ్మకంలేదు. అంతేనా?'

'నేను నమ్మను. నాకు దేంట్లోనూ నమ్మకంలేదు.'

'అలాఅయితే మరీమంచిది. మీరు శూన్యవాదులన్నమాట.'

'అంత పెద్దమాట మీ రుపయోగించడానికి కారణం ఏమిటో నే నూహించుకోలేక పోతున్నాను.' వాదనపట్ల ఆసక్తి చూపిస్తూ లాసున్స్కయా వారివంక చూసింది. భంగు తిన్న పిగసోవునుచూసి పాండలవిస్కీ 'మంచిశాస్తి అయింది. పట్టుకి మాంబాగా దొరికాడు.' అనుకుని సంతోషిస్తున్నాడు. రూడిన్ తనవాదనను ప్రారంభించాడు. పిగసోవువంక తిరిగి 'ఆమాట ఎందు కనగూడదు? నా ఉద్దేశ మేమిటో ఆ పదం స్పష్టంగావ్యక్తపరుస్తోంది. మీ కది అర్ధమౌతూ నేవుంది, అలాం టప్పుడు దాన్ని ప్రయోగించడంలో తప్పేమిటో నా కర్ధం కావటంలేదు. నాకు దేంట్లోనూ నమ్మకంలేదని, మీకుమీరే ఒప్పుకున్నారు. అలాంటప్పుడు, యిందాక యదార్థవిషయాలు కావాలన్నారే! వాటిని నేను చెప్పినా మీ రెలా నమ్మ తారు? మీకు దేంట్లోనూ నమ్మకంలేదు, శూన్యవాదులాయె.'

'ఏమి టేమిటీ. నా కెందులోనూ నమ్మకంలేదూ? యదార్థా లనేవి ప్రతివాడూ నమ్ముతాడు. యదార్ధాలంటే ఏమిటో ప్రతివాడికీ తెలుసును....వాటిని నా అనుభవంతో నిజమో, కాదో తేల్చుకుంటాను. నా యింద్రియజ్ఞానం యదార్థాలసత్తువను తెలియపరుస్తుంది.'

'మీ యింద్రియాలు మిమ్మల్ని మోసగించవని ఎక్కడ రాసుంది? భూమిచుట్టూ సూర్యుడు తిరుగుతున్నాడని మీ యింద్రియజ్ఞానం చెబుతోందా? సూర్యుడుచుట్టూ భూమితిరుగుతూ వుందనిచెప్పే విజ్ఞానవేత్తతో, మీరు ఏకీభ వించ రనుకుంటాను?'

హాలులో మళ్ళీ కలకలధ్వని వినిపించింది. అతిథులంతా ఒక్కసారి నవ్వారు. రూడిన్ వంక గౌరవంతో చూశారు. పిగసోవు బిత్తరపోయాడు. నీ చమత్కారం బాగానేవుంది. అలా మాట్లాడినందుకు సంతోషమేగానీ, అది మనవాదనకు సంబంధించింది గాదు.'

'నేను చెప్పిందేమీ చమత్కారంగాదు. సూర్యుడి చుట్టూ భూమి తిరుగుతోందని అందరూ ఎరుగున్నదే. యీవిషయం నేను కనిపెట్టలేదు. అయితే మనం చర్చిస్తున్న విషయం యింకొకటి.'

'ఏమిటదీ ?'

'యదార్థాల్ని, సిద్ధాంతాల్ని, జ్ఞానాన్ని చదువుకున్న మీబోటివాడు కాదంటుంటే, నాకు విచారంగా వుంది.'

'వాళ్ళేగాదు నే నెదిరిస్తున్నది. . .'

'అవును. నాకు తెలుసును. సూత్రబద్ధమైన పద్ధతుల్ని సైతం మీరు కాదంటున్నారు.'

'కాదంటున్నాను. ముమ్మాటికీ కాదంటున్నాను.'

'ప్రతి పద్ధతీ కొన్ని ప్రధాన సూత్రాల ప్రాతిపదిక మీద ఆధారపడివుంది. ఇవి ప్రధాన జీవిత సూత్రాలు.'

'కాని వాటిని మనం పరిశోధించనూలేమూ, కనిపెట్టనూలేము.'

'ఇక్కడే కొంచం క్షమించండి నన్ను. అందరూ వాటిని కనిపెట్టలేనిమాట నిజమే. కాని ఈ ప్రధాన సూత్రాల్లో కొన్నింటిని న్యూటన్ కనిపెట్టాడనే సంగతి మీరు కాదనరనుకుంటాను. న్యూటన్ మహామేధావి. మహా

మేధావులు కనిపెట్టిన విషయాలు అందరి అందుబాటులోకి వచ్చినప్పుడు అవి మరీ శోభిస్తాయి. దృగ్గోచరమైన వస్తువుల స్వభావాదులను పరిశోధించి తెలుసుకోవాలని మానవ మేధస్సు ప్రయత్నిస్తూ వుంటుంది. యీ జిజ్ఞాస మానవ మేధస్సు కొక లక్షణం. . . . మానవుడు తన విద్యా పరిజ్ఞానంతో. . . .'

'ఓహో! అదా మీరు చెప్తున్నమాట? నాకు యీ రసాయనికశాస్త్రాలు, గ్రహాలు, భూప్రదక్షిణాలు వీటితో ఏమీ సంబంధంలేదు. నాకు ప్రపంచ వ్యవహారాలతోనే ప్రమేయం.'

'మరీ మంచిది. అంతటితో సంతోషించండి. కాని ఒక్క విషయం గుర్తుపెట్టుకోండి. కేవలం ప్రపంచ వ్యవహారాలతోనే ప్రమేయం పెట్టుకోవడంకూడా ఒక పద్ధతే. అదీ ఒక సూత్రమే.'

పిగసోవ్, రూడిన్ అన్నమాటల్ని గుర్తుకు తెచ్చుకుంటూ, 'యిందాక మీరేదో విద్యా పరిజ్ఞానమంటూ చెప్పబోయారే? . . . చెప్పడానికి మహా బాగానే వుంటుంది. విద్యట. విద్య. మీ విద్యకూ యీ డిగ్రీలకు చిల్లిదమ్మిడీ విలువలేదు.'

పిగసోవ్ మాటలకు లాసున్‌స్కాయా అదిరిపడింది. 'వాదించడమంటే తిట్టుకోవడంకాదు పిగసోవ్' అంటూ ఆమె రూడిన్‌వంక నిండు సంతృప్తితో చూసింది. రూడిన్ అంటే ఆమెకు అమితగౌరవభావం ఏర్పడింది.

పిగసోవ్ మాటలకు రూడిన్ ప్రత్యుత్తరమిస్తూ, 'నేను యీ విద్యావిధానాన్ని సమర్థించబోవడంలేదు. నా సమర్థింపుతో దానికి ప్రసక్తి లేనేలేదు. విద్యంటే మీకు పడదు. అదీ ఒక విద్యే. యిలాంటి వాదనలు అసలు విషయాన్ని తేల్చవు. ఒక్క విషయం మీకు చెప్పాలనుకుంటున్నాను. 'తన కోపమే తన శత్రువు' అని పెద్దల వచనం. విషయ పరిజ్ఞానం, యదార్థం — వీటిమీద ఆధారపడిన సాధారణ సూత్రాలు ఉండనే ఉన్నాయి. వీటన్నిటిమీదా అనవసరంగా దండెత్తడం, మనిషి అజ్ఞానాన్ని తెలియజేస్తుంది. అజ్ఞానంతో మానవుడు జగత్ సత్యాన్ని కాదంటాడు. జ్ఞానం అంటే ద్వేషిస్తాడు. శాస్త్రాన్ని తోసిపుచ్చుతాడు. అంతటితో గుడ్డినమ్మకం అతన్లో పెరుగుతుంది. మానవుడికి యదార్థ శాస్త్రవిషయాలమీద విశ్వాసం కుదరాలి. తన శక్తిని తాను తెలుసుకోవాలి. కేవలం స్వజ్ఞానంవల్లే మానవుడు అన్నీ తెలుసుకోలేడు. భావనాశక్తినీ, ఆలోచననూ చంపుకుంటే ఎక్కడి మానవుడు అక్కడే వుండిపోతాడు. "సంశయాత్మ వినశ్యతి."

'యివన్నీ వట్టి ఊకదంపుడు మాటలు.'

'కావచ్చును. ఊకదంపుడు మాటలు అని మనం అంటున్నామంటే, అంతకుమించి గట్టిమాట లేవో చెప్పబోతున్నామన్న మాట.'

'ఏం చెప్పబోతున్నాం?'

రూడిన్ పొంగుతున్న ఉద్రేకాన్ని నిలుపరించుకున్నాడు. 'నేను చెప్పింది మీకు అర్థమైనదనే అనుకుంటాను. కాకుంటే,

స్పష్టంగా చెప్తాను వినండి. మానవుడు ఏదైనా ఒకదాన్ని విశ్వసిస్తూవుంటే, అతని విశ్వాసానికి గట్టి ప్రాతిపదికంటూ ఒకటుండాలి. ప్రాతిపదిక లేని నమ్మకమూ లేదు. సూత్రంలేని పూలమాలా లేదు. తాను నుంచున్నది గట్టినేల అవునో కాదో ముందు చూసుకునే మనిషి నుంచోవాలి. సూత్రంలేని నమ్మకాలతో కాళ్లు మీదకూ, తల క్రిందికీ వేలవేసి మనిషి ఏం చేస్తాడు? త్రిశంకుడికథ మీకు తెలుసుకదా! తల క్రిందులుగా ఆలోచిస్తూ అంధవిశ్వాసాలతో కొట్టుకుంటున్న మానవుడు, తనకు ఏం కావాలో గుర్తించనూలేడు. ప్రజల అవసరాలను గుర్తించనూలేడు. వారి భవిష్యత్ కోసం కృషి చేయనూలేడు.'

ఈ మాటలతో 'పిగసోవ్' కుపితుడయాడు. 'ఆ కృషి ఏదో నువ్వే చేయి' అంటూ గిరుక్కున తిరిగి అక్కడినుంచి లేచి వెళ్లిపోయాడు. రూడిన్ అతన్నొకసారి పరిశీలించి నవ్వి వూరుకున్నాడు. లాసున్‌స్కయా తనమామూలు ధోరణిలో పిగసోవ్‌ను పరిహాసం చేసింది. 'పిగసోవ్ పాపం తోక ముడిచాడు.' హాలులో నిశ్శబ్దం తాండవిస్తూవుంది. లాసున్‌స్కయా రూడిన్‌వంక తిరిగి 'మరోలా అనుకోకండి అతని మాటల్ని మేం ఎవ్వరం పట్టించుకోం. మీతో వాదించలేక, తనకు వాదించడం యిష్టంలేనట్టు లేచి వెళ్ళిపోయాడు. సరే పోనికేం. మనం మాట్లాడుకుందాం' రూడిన్ తన సోఫాను దగ్గరకు లాక్కున్నాడు.

'ఇన్నాళ్లై మిమ్మల్ని కలుసుకోకపోవడం నాకుఆశ్చర్యంగానేవుంది.' అంటూ లాసున్‌స్కయా సంభాషణ కుపక్రమిం

చినప్పుడు రూడిన్ మొదట్లో కొంతసంశయించాడు. మాటలు తడబడ్డాయి. కాని సంభాషణమధ్యలో తేరుకున్నాడు. పావుగంట గడిచేసరికి హాలులో యింకెవరిమాటా వినిపించ లేదు. అతిథులంతా తమఆసనాలను రూడిన్ చుట్టూ లాక్కుని కూర్చున్నారు. పిగసోవుమాత్రం మూలనే వుండిపోయాడు.

రూడిన్ మాట్లాడుతుంటే అతిథులు అతనివంకేచూస్తూ ఆశ్చర్యపడుతున్నారు. ఆ కాస్సేపు సంభాషణల్లోనే అతనెంతో విద్యావంతుడనీ, అనుభవజ్ఞుడనీ, ప్రతిమాటనూ తూచితూచి మాట్లాడతాడనీ విదితమైంది. రూడిన్ వంటి మేధావి, విద్యావంతుడు సందర్భవశాత్తు ఆపల్లెకువచ్చి తమతో మాట్లాడటం చాలా అదృష్టమని అంతా భావించసాగారు. అందరికంటె లాసున్ స్కాయా మరీ ఆనందించింది. ఊళ్ళోని పెద్దకుటుంబీకు లందరితోనూ రూడిన్ కు పరిచయంకలగచేయాలని తలపోసింది. రూడిన్ సంభాషణల్లో వినవస్తున్న విషయాలనుగురించి వాసిలోవ్నాకు అంతగా తెలియకపోయినా అతని సంభాషణ ఆమెను విభ్రాంతురాల్ని చేసింది. ఆమెఅన్న పావ్లోవిచ్ కి సహితం రూడిన్ పట్ల గౌరవభావ మేర్పడింది. లాసున్ స్కాయా రూడిన్ పట్ల అమిత శ్రద్ధాసక్తులను ప్రదర్శించడం పాండలవిస్కీ గమనించి ఈర్ష్యపడుతున్నాడు. బెసిసోవ్ ఊపిరిబిగబట్టి, నోరు అప్పళించి రూడిన్ వంక కళ్ళజోడులోంచి చూస్తున్నాడు. నటాలియాబుగ్గలు ఎర్రబడ్డాయి. తదేకదీక్షతో రూడిన్ వంక జూస్తూ అప్పుడప్పుడు దీర్ఘనిశ్వాసం విడుస్తున్నది. పావ్లోవిచ్ ఆమె చెవిలో రహస్యంగా 'అతని కళ్లు ఎంత అందంగా వున్నాయి?' అన్నాడు.

'అవును. ఎంతో అందంగా ఉన్నాయి.'

'పాపం. అంత పొడుగ్గా చేతులు లేకపోతేనా, ఇంకెంతో బాగుండును.'

నటాలియా సమాధానమేమీ యివ్వలేదు.

అతిథులకు నౌకర్లు కప్పులతో తేనీరు అందిస్తున్నారు. మాట్లాడుకుంటున్న అతిథులు రూడిన్ స్వరం వినిపించినప్పుడల్లా మౌనంగా వుండిపోతున్నారు. పిగసోవ్‌ను ఉడికించాలనే కోరిక యింకా తీరలేదు కాబోలు! లాసున్‌స్కయా మెల్లగా అతని చెంతకు వెళ్ళి రహస్యం చెబుతున్నట్టు 'ప్రతి దానికి కోపంతప్ప, గట్టిగా వాదించవేం? రూడిన్ అంతు కనుక్కో.' కోడిపుంజులకు కత్తులుకట్టి దెబ్బలాడించడం ఆమెకు సరదా. కాని పిగసోవ్ బరిమీదకు దిగే ప్రయత్నంలో లేడు. లాసున్‌స్కయా అటనుండి రూడిన్ వద్దకు వెళ్ళింది. 'యింకో విశేషం చెప్తాను. పిగసోవ్‌కు ఆడవాళ్ళంటే పరమ అసహ్యం. ఆ స్త్రీద్వేషిని కాస్త బాగుచేద్దురు.' రూడిన్ తలపైకెత్తి బుజాలను కుంచించుకుని పిగసోవ్ వంక తీక్ష ణంగా చూశాడు. పిగసోవ్ కోడిపుంజులాగ మెడ ముందుకు చాచాడు. 'నేను స్త్రీలనుమాత్రమే ద్వేషిస్తానని ఆవిడ అనుకుంటోంది. మానవజాతంటేనే నాకు ఒళ్ళుమంట'

వాదన పెంచడానికి వీలుచిక్కిందని లాసున్‌స్కయా సంబరపడుతోంది రూడిన్ ప్రశ్నార్థకంగా పిగసోవ్ వంకతిరిగి 'మానవజాతిని' ద్వేషించాలనే తప్పభిప్రాయం మీ కెందుకు కలిగింది?'

'అందుకు నాహృదయమే సాక్షి. ప్రపంచంలో రోజుకు రోజు కశ్మలం పెరిగిపోతోందని నా హృదయం పదేపదే చెబుతోంది. అన్నింటినీ నా హృదయంతో నే చూస్తాను. మనుష్యులంతా మహాపాపులని భావించడం గౌరవం కాకపోవచ్చును. కాని ఆ మనుష్యు లందరికంటె మరీ చెడ్డవాణ్ణి నేను. దీనికి నే నేం చేయను ?'

'మిమ్మల్ని నే నర్థంచేసుకున్నాను. ఎవరిదోషాన్ని వాళ్లు గ్రహించడం మహత్తుమైన విషయమే. ఇందుకెంతో ఆత్మసంయమనం కావాలి. ఉదాత్తమైన ఆత్మకలవాళ్లుతప్ప, యితరులు యిలా పరిశోధించుకోవడం కష్టం.'

'నా ఆత్మను గురించి మీ రిచ్చిన కితాబుకుసంతోషం.'

'అయితే యీ ఆత్మపరిశోధన అంతటితో ఆగిపోదు. ఆత్మ ఎప్పుడూ ఒకే స్థితిలో వుండదు.'

'నేను, నా ఆత్మా ఒకే స్థితిలో వుంటాం. యీ స్థితి మారాలనికూడా నేను కోరను '

'అంటే దాని అర్థం మనిషి తనను తానే ప్రేమించుకోవడమన్నమాట. ప్రేమించుకుంటూ సత్యసమ్మతంగా జీవించాలని వాంఛించడం '

'సరిగ్గా చెప్పారు. తనకుతాను ప్రేమించుకోవడమనేది ఎలాంటిదో నాకూ తెలుసును. నీకు తెలుసునుకాని సత్యసమ్మతమంటే ఏమిటి ? సత్యమనే పదానికి అర్థమేమిటి ? అదెక్కడుంది ?'

లాసున్స్కయా పిగసోవ్ వంక తిరిగి 'సత్యం, సత్యం అని పదేపదే అన్నమాటనే చెప్తున్నావు.' అని ఎత్తిపొడిచింది.

పిగసోవ్ బుజాల్ని ఎగురవేసుకొని 'పదేపదే రెట్టిస్తే వచ్చిన యిబ్బంది ఏమిటి ? సత్యమనేది ఎక్కడుందని అడుగుతున్నాను. మహాజ్ఞానులకే దాని స్వరూపమేమిటో తెలియదు. 'కాంట్' ఒకదాన్ని పరమసత్యమని చెప్తాడు. కాదు. నీదంతా తప్పు. పరమసత్యమంటే యిదీ అంటూ హెగెల్ మరొకటి చెప్తాడు.'

రూడిన్ తన మామూలు ధోరణిలో ప్రశ్నించాడు.

'హెగెల్ దేనిని సత్యమని పేర్కొన్నాడో మీకు తెలుసునా ?'

పిగసోవ్ రెచ్చిపోయి గబగబా మాట్లాడుతూ 'మళ్ళీ మళ్ళీ చెప్తున్నాను. సత్యమనేది ఏమిటో నేను అర్థంచేసుకోలేను. అది ఎక్కడా లేదనే నా భావం. అంటే ప్రపంచం ఉంది. కాని ఏవస్తువూ దానంతట అది లేదు.'

లాసున్‌స్కయా అతన్ని అవహేళనచేస్తూ 'ఓరి పాపాత్ముడా ! ఎంతమాటన్నావు ? పరమసత్యమనేది లేదూ ? కేవల సత్యం అనేది లేకపోతే నువ్వూ నేనూ ఎలా బ్రతగలుగుతున్నాం ?'

'నామాటకేంగాని మీ వంటవాడున్నంతకాలం ఆ కేవలసత్యం లేకుండానే మీరు బతగ్గలరు. పరమసత్యం, పరమసత్యం అని మాట్లాడుతున్నారు. దాంతో మీరేమన్నా జిలేబీలు చేసుకోగలరా ?

'నవ్వులాటగా మాట్లాడ్డం చాదనా' చమత్కృతికాదు పిగసోవ్.'

'అలాఅయితే మీరు వేదాంతార్థంలో వాడుతున్న కేవలసత్య మంటే నాకేమీ తెలియదు. నేను ప్రపంచం మనిషిని.'

పిగసోవ్ గర్వంతో నవ్వాడు. రూడిన్ గర్వమనేది మనిషికి అవలక్షణమని పేర్కొంటూ యిలా అన్నాడు. 'అహంకారం ఉండదగ్గవాళ్ళల్లో వుంటే చెడుపేమీలేదు. అది వెర్రితలలువేస్తేనే ప్రమాదం. లేనిపోనిగర్వం, ఆత్మహత్యతో సమానమైనది. గర్వపోతు నశించక తప్పదు. 'నేను' అనే భావం ఉండతగ్గదే. అది లేకపోతే మానవుడు పరిపూర్ణతను చేరుకోలేడు. ఆత్మవిశ్వాసానికి, దోషభూయిష్టమైన గర్వానికి చాలా వ్యత్యాసముంది. 'నేను' అనే భావంలోఉన్న స్వార్థాన్ని చంపుకున్నప్పుడే మానవుడు తనఆత్మను సరియైన దారిలోకి మళ్ళించగలుగుతాడు. గర్వం గుర్రంవంటిది. మనిషి రౌతువంటివాడు. ఆ గుర్రాన్ని అదుపులో పెడితేనేఅందం.' రూడిన్ ఉపన్యాసధోరణికి పెడమొహంపెట్టి పిగసోవ్ బెసిస్ట్రోవు వంక తిరిగి 'ఒక్కసారి పెన్సిల్ ఉంటే యిద్దూ.' అని అడిగాడు. పిగసోవ్ పెన్సిల్ ఎందుకడుగుతున్నాడో బోధపడక బెసిస్ట్రోవ్ 'పెన్సి లెందుకు?' అని ప్రశ్నించాడు. 'రూడిన్ ఉపన్యాసం వ్రాసుకోవద్దూ మరీ? అందులోనూ అతను చెప్పిన ఆఖరిమాటలు,'

'ప్రతివిషయాన్ని వేళాకోళం చేయగూడదు. దేనికైనా వేళాపాళా ఉంది.' అంటూ బెసిస్ట్రోవ్ మొహం తిప్పుకు న్నాడు. ఈలోపున రూడిన్ నటాలియాచెంతకు వెళ్లాడు. ఆమె గభాలున తన కుర్చీనుంచి లేచి నించుంది. ఆమెప్రక్కనే

కూర్చున్న పావ్లోవిచ్ కూడా తనకు తెలియకుండానే నుంచుండిపోయాడు. రూడిన్ నెమ్మదిగా నటాలియావంక తిరిగి రాచకీవితో ప్రశ్నించాడు. 'ఇక్కడ ఎనుకుగా పియానో వుంది; నీకు సంగీతమొచ్చునా?'

'నాకంటే పాండలవిస్కీ చక్కగా వాయిస్తాడు' అని అతనివంక చూపించింది. పాండలవిస్కీ కుర్చీలోనుంచి ముందుకువంగి 'లేదు, లేదు. నాలాగే ఆమె పాడుతుంది.' 'అయితే ఆయనకు జానపదగీతాలు వచ్చా?' యీ ప్రశ్నవిని లాసున్స్కయా 'చక్కగా పాడతాడు. కూర్చుని వినండి. మీకు సంగీతమంటే ఇష్టమేనా?' అని రూడిన్ను అడిగింది. రూడిన్ సంగీతం వినాలనే కుతూహలం సూచిస్తూ, కొన గోళ్ళతో జుత్తు సవరించుకొని కుర్చీలో పొందికగా కూర్చొని పియానోవంక చూశాడు. పాండలవిస్కీ పియానో వాయిస్తు న్నాడు. కృతిలోని భావాలను ఉద్విగ్నుడై రూడిన్ ఆలో చనాపూర్వకంగా చూస్తున్నాడు. నటాలియా పియానో పక్క చతికిలబడి కృతి వింటున్నది. అర్థనిమీలితనేత్రాలతో రూడిన్ నటాలియాను పరిశీలిస్తున్నాడు. సంగీతం ఆగి పోయింది. వెల్లువవలె వస్తున్న భావాలకు, పరవశుడై రూడిన్ సోఫాలోంచిలేచి, కిటకీ చెంతకువెళ్ళి బయటకుచూస్తూ నిలబడ్డాడు. బయట అందమైన తోట, పూల పరిమళం' మిణుకుమిణుకుమనే నక్షత్రాల కాంతి, మెల్లగా వీచే గాలికి వూగే లతలు. రాత్రి ఎంతో ఆహ్లాదంగా వుంది చీకటిలో లీలగా కన్పిస్తున్న చెట్లవంక చూస్తూ రూడిన్ తన్మయు డౌతున్నాడు. ఒక్కసారి నిట్టూర్చి ఇవతలికి చూస్తూ, 'ఈ

సంగీతం ఈ రాత్రి ఎంతదివ్యంగా ఉన్నాయి. ఈవేళ నాకో పర్వదినం. వెనకటి ముచ్చట్లు జ్ఞాపకాని కొస్తున్నాయి. జర్మనీలో, నేను చదువుకుంటున్న రోజుల్లో సరిగ్గా యిలాగే ఆ సమావేశాలూ, విందులూ'.

లాసున్‌స్కయా 'మీరు జర్మనీకూడా వెళ్లారన్న మాట?' అని ప్రశ్నించింది.

'బెర్లిన్‌లో ఒక ఏడాదీ, హైడెల్‌బర్గులో యింకో ఏడాదీ ఉన్నాను.'

'అయితే అక్కడి విద్యార్థులు అదోలాగా దుస్తులు వేసుకుంటారని విన్నాను. నిజమేనా?'

'ఆ మాట హైడెల్‌బర్గులోమాత్రం నిజమే. బెర్లిన్ విద్యార్థులు అందరిలాగే దుస్తులు ధరిస్తారు.'

'జర్మనీలో ఎలా గడిపారో కొంచెం చెప్పండి.'

రూడిన్ తన అనుభవాలను చెప్పటం ఆరంభించాడు. కాని అతని ప్రసంగం మధురంగాలేదు. తన అనుభవాల్ని చెప్పిన తరవాత, విద్యావిధానం, శాస్త్రీయ విషయాల్ని గురించి మాట్లాడాడు. విదేశాలలోని విశ్వవిద్యాలయాల తీరును తెలియజెప్పాడు. సౌందర్యం ఉట్టిపడేటట్లు చెప్పాడు. సాధారణ విషయాలను అసాధారణంగా, అద్భుతంగా చెప్పడంలో అతని కతనే సాటి.

రూడిన్ ఉద్రేకం పట్టలేకపోతున్నాడు. మాటలకంటె ముందు అతని భావాలు లేడిపిల్లలవలె పరుగులెత్తుతున్నాయి. చెప్పే విషయాలను, మాటలతో చిత్రకారునివలే, కళ్లకు

కనుపించేటట్లు చిత్రిస్తున్నాడు. ఒక దృశ్యంవెంట యింకొక దృశ్యం ఉపమానాలతో అభివర్ణిస్తున్నాడు. మాటలు తెచ్చి పెట్టుకున్నట్లుకాక వాటంతటవే ధారాప్రవాహంగా పుట్టు కొస్తున్నాయి. అతనికున్న శబ్దశక్తి అలాంటిది. హృదయం లోంచి దూసుకవస్తూ ఎదుటివారి హృదయాలకు అతని మాటలు పూలగుత్తులవలె గిలిగింతలు పెడుతున్నాయి. ప్రతిమాట ఒక సంగీత కృతి.

భవిష్యత్‌ను ఎంతో ఆశాపూరితంగా వర్ణిస్తూ రూడిన్ చెప్పుకుపోతుంటే అతిథులు నిశ్చేష్టులై వింటున్నారు. అందరి లోనూ యావ్వనోద్రేకం పొంగులుపారుతోంది. కిటికీచెంత నుంచుని అప్పుడప్పుడు ప్రత్యేకంగా ఒకొక్క వ్యక్తిని చూస్తూ వీణ మీటినట్లు రూడిన్ మాట్లాడుతూవుంటే, హాలంతా నిశ్శబ్దంగా వింటోంది. అతిశ్రద్ధగా అతిథులు ముఖ్యంగా ఆ స్త్రీలు తన ఉపన్యాసం వింటున్నందుకు మరీ ఉత్సాహపూరితుడైనాడు. హాలులో అందమైన ఆడవాళ్లు, ఏదేకభక్తిశ్రద్ధలతో చూస్తున్న యువతులు, నిశ్శబ్దంగాఉన్న రాత్రి; రూడిన్ రసజగత్తును సందర్శిస్తున్నాడు. కవితా సౌందర్యాన్ని ఆరాధిస్తూ ప్రసంగిస్తున్నాడు. ప్రసంగం అనేక విషయాలపైకి మళ్ళింది. సంగీతం, పువ్వులు, మానవజీవితం, శాశ్వతసత్యం మొదలైనవాటిని గురించి చాలాసేపు చెప్పుకు వచ్చి, గంభీరంగా 'మానవజీవితం అశాశ్వితమైనది' అన్నాడు. రూడిన్ చెప్పబోతున్నదేమిటో వినాలనే కుతూహలంతో అతిథులంతా అతనివంక తిరిగారు. తన ఉపన్యాసాన్ని ముగిస్తూ రూడిన్ యిలా అన్నాడు.

'పూర్వం ఒక కథవుంది. ఒకరాజూ, కొంతమంది సైనికులు ఒక చీకటిగదిలో కూర్చున్నారట. రాత్రి చలిగా వుంది. గదిలో, నెగడిముందు అంతా కూర్చుని మనలాగే కబుర్లు చెప్పుకుంటున్నారు. గదితలుపులు తెరుచుకొని వున్నాయి. యింతలో ఒక చిన్నపిట్ట ఒకగుమ్మంలోంచి గదిలో కెగిరివచ్చి మరో గుమ్మంలోంచి బయటి కెగిరి పోయింది. ఆ గదిలో ఆ పిట్ట ఉన్నది ఆకాస్త సేపే. అయితే నేం? గది వెచ్చదనం, గదిలో కాంతీ అదీ అనుభవించింది. పిట్టనుచూసి రాజుతో ఒకసైనికుడు అన్నాడుగదా, 'రాజా! చీకటిలో పడ్డంతమాత్రంచేత పిట్ట ఎప్పుడూ అక్కడే వుండి పోదు. తనగూడు ఎక్కడుందో అక్కడికి చేరుతుంది.' రూడిన్ యీకథ చెప్పి 'మనంకూడా ఆ పిట్టలాంటివాళ్ళమే. చీకట్లో కొంతసేపుండి ఎవరిగూటికి వాళ్ళం చేరుకుంటాం. అతీతమైన శక్తి ఉన్నదనే జ్ఞానం మానవుని కవసరం. ఆ అతీత శక్తిచేతిలో మానవుడొక కీలుబొమ్మ. ఈ జ్ఞానమున్న మానవుడు యింద్రియ సుఖాలకోసం పాకులాడడు. మరణంలోకూడా అతను తన జీవితాన్ని దర్శించగలుగుతాడు.'

రూడిన్ ప్రసంగం ముగించి నవ్వుతూ శిరస్సువంచాడు. లాసున్‌స్కయా 'రూడిన్ మహాకవి. ఆయన చెప్పిందంతా యదార్థం' అంది. ఆమె చెప్పినదానితో అందరూ ఏకీభవిస్తున్నట్టు తలలూపారు. ఒక్క పిగసోవ్‌కుమాత్రం రూడిన్ ప్రసంగమేమీ రుచించలేదు. అతని ఉపన్యాసం యింక ముగుస్తుందనగానే పిగసోవ్ చటుక్కునలేచి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతున్నప్పుడు ద్వారందగ్గర కూర్చున్న పాండలవిస్కీ

వంక చూసి 'మహాజ్ఞానితో నాకేం పని? పోయి అజ్ఞానుల తోనే చేరుతాను' అన్నాడు.

వెళ్ళిపోతున్న పిగసోవ్‌ను ఉండమని ఎవ్వరూ కోర లేదు. అధమపక్షం అతను వెళ్ళిపోయినట్లుకూడా ఎవ్వరూ గమనించలేదు. విందు ముగిసిన తరువాత బల్లుఎక్కి ఎవరిళ్ళకు వాళ్లు వెళ్ళిపోసాగారు. రూడిన్‌ను ఆ రాత్రి ఉండిపొమ్మని లాసున్‌స్కయా బలవంతపెట్టింది. వాసిలోవ్నా, ఆమె అన్న పావ్‌లోవిచ్ హాలుదాటి బయటికి వచ్చారు. లాసున్ స్కయాతో వెళ్లివస్తామని చెప్పి, గుర్రపుబగ్గీ ఎక్కారు. దారిపొడుగునా వాసిలోవ్నా రూడిన్‌ను మెచ్చుకుంటూనే వుంది. అతని ప్రతిభకు ముగ్ధురాలైంది. చెల్లెలు ప్రశంసతో ఏకీభవించినా పావ్‌లోవిచ్ రూడిన్‌పట్ల అంత గౌరవాన్ని వ్యక్తపరచలేదు. రూడిన్ చెప్పిన మాటల్లో అసందిగ్ధత ఉన్నదనీ, స్పష్టత మృగ్యమనీ, పదాడంబరం అధికమని చెల్లెలితో చెప్పాడు. వాసిలోవ్నా రూడిన్‌ను మెచ్చు కుంటున్నప్పుడు అతని మోములో అయిష్టత గోచరించింది. మసకమసకగా కనిపించుతూవున్న దారివంక శూన్యంగా చూస్తున్నాడు. కళ్లల్లో విచారం పొడగట్టింది.

పాండలవిస్కీ తనగదిలోకిపోయి పరుపుమీద వాలాడు. రూడిన్ జ్ఞాపకంవచ్చి, 'మంచి తెగువవుంది ముండాకొడుక్కి' అని అటు యిటూ దొర్లాడు. గదిలోకినౌకరు కుర్రాడు వచ్చే సరికి, బయటికి పొమ్మని గద్దించాడు. బెసిస్టోవ్ సరేసరి. అతని కా రాత్రి నిద్రపట్టలేదు. దుస్తులు మార్చుకోకుండా నే

టెబిల్ మీద కూర్చుని మాస్కోలోని తన స్నేహితులకు ఉత్తరం వ్రాస్తూ, వ్రాసింది చింపుతూ కూర్చున్నాడు.

నటాలియా పరుపుమీద వాలినా నిద్ర ఎంతకీ వచ్చింది కాదు. కళ్ళుమూస్తూ, తెరుచుకుంటూ రాత్రంతా గడిపింది. ఎంతకీ నిద్రపట్టక మంచంమీదనుంచి లేచి కిటికీవద్దకు వెళ్ళి బయటికి చూస్తూ, చేతులు వెనక్కి పెట్టుకొని నిట్టూరుస్తూ నించుంది.

# 4

ఆ మర్నాటి ఉదయం రూడిన్ చాకింటి మడతలు వేసుకునేసరికి నౌకరు గదిలోకివచ్చి లాసున్స్కయా పిలుస్తున్నదని చెప్పాడు. తనగదిలో లాసున్స్కయా రూడిన్ కోసం టీ తాగకుండా కనిపెట్టుకుని కూర్చుంది. గదిలో యింకెవ్వరూ లేరు. రూడిన్ అడుగుపెట్టగానే గౌరవంతో లాసున్స్కయా అతన్ని కూర్చోమని కుర్చీ చూపించింది. దూరంగాఉన్న కుర్చీలో రూడిన్ చతికిలబడ్డాడు. లాసున్స్కయా తన కుర్చీని అతనిచేరువకు లాక్కుంటూ కుశల ప్రశ్నలు వేసింది. 'రాత్రి బాగా నిద్ర పట్టిందా?' అంటూ కప్పుతో టీ అందించింది. 'పంచదార సరిపోయిందా? యింత వరకు మిమ్మల్ని కలుసుకోకపోవడం విచిత్రంగానే వుంది.' లాసున్స్కయా అతని కొక సిగరెట్టు అందించి టీ తాగుతూ మధ్య మధ్య రూడిన్ పూర్తి భోగట్టాను తెలుసుకోసాగింది. అతని బంధువు లెవరో, వారి ఆస్తిపాస్తులు, మంచిచెడ్డలు, మున్ముందు అతను ఏం చేద్దామనుకుంటున్నాడో, అన్నీ ఆరా తీసింది. టీ తాగి సిగరెట్టు ముట్టించింది. సిగరెట్టుపొగవంక

చూస్తూ అప్పుడప్పుడు నోటితో పొగను వదులుతూ, వేళ్లతో పొడిని రాలుస్తున్న లాసున్‌స్కయాను చూసి రూడిన్ 'ఏమిదర్జా' అనుకున్నాడు. కొంచెం ఉబ్బిస్తే యీ మనిషి తన ఒళ్ళుకోసి యిచ్చేస్తుందని పసికట్టాడు. లాసున్‌స్కయా అతని భోగట్టా అడగడంమాని తన సొంతగొడవ చెప్ప సాగింది. రూడిన్ నోరు మెదపకుండా ఆమె చెప్పే విషయాలను శ్రద్ధగా చెవులప్పగించి వింటున్నాడు. తన చిన్ననాటి ముచ్చట్లు, జ్ఞానం వచ్చాక ఆమె పర్యటించిన ప్రదేశాలు, అనుభవాలు లాసున్‌స్కయా వర్ణిస్తూ తన్మయభావాన్ని పొందుతున్నది. రూడిన్ పురాణం వింటున్నట్టు వింటున్నాడు. ఫలానా ప్రభుత్వోద్యోగితత్వం అలాంటిదని, యింకో రాజ వంశీకుడి పోకడ యిలాంటిదని ఆమె చెప్పుకుంటూపోతున్నది. తనకు పరిచయమైన కవుల సంగతులు, వారి వర్ణనలు, వారి వ్యక్తిగత అభిరుచులు ఏకరువుపెట్టింది. ఆ రోజుల్లో తాను ఏదేశమేగినా, ఎక్కడ కాలుపెట్టినా, అనేకమంది స్నేహితులు గుమిగూడేవారట. లాసున్‌స్కయా ప్రసంగం విన్న తరవాత రూడిన్ యిలా అనుకున్నాడు: 'ఇంతమందిని గురించి చెప్పినా తన ప్రాధాన్యత ఏమాత్రం తగ్గించుకోలేదు. అందరి కంటే తానే గొప్పదాన్ననే భావం సర్వత్రా వెల్లడైంది. ఆమె బంగారపుటుంగరం, మనుష్యులంతా ఉంగరానికి పొదిగిన రాళ్లవంటివారు.

ఆవిడ చెపుతున్నంతసేపూ సిగరెట్టుమీద సిగరెట్టు కాలుస్తూ వింటున్నాడేతప్ప అతనేమీ వ్యాఖ్యానించలేదు. ఇతర్లు చెప్తున్నది శ్రద్ధగా వినడం రూడిన్ అలవాటు. అతను

ఉపన్యాసకుడుతప్ప సంభాషణా చతురుడుగాడు. వాదిస్తు న్నప్పుడు ప్రత్యర్థిని చెప్పవలసిందంతా చెప్పనిచ్చి అమాం తంగా అతనిపై విరుచుకుపడతాడు. తన తర్కంతో చిత్తు చేస్తాడు. లాసున్‌స్కయా మధ్యమధ్య సామెతల్ని చెప్తూ అంతశ్రద్ధగా వింటున్నందున తనధోరణిని మరీ హెచ్చిం చింది. ఆమెచెప్పే సామెతల్ని, మధ్యమధ్య వాడే పల్లెటూరి మాటల్ని రూడిన్ అతిశ్రద్ధగా గమనిస్తున్నాడు. అతను వింటున్నా విసుగుమాత్రం చివరకు ఆమెకే కలిగింది. ప్రసంగ మాపి తలను కుర్చీ కానించుకుని వూరుకుంది. రూడిన్ ఆమె కేసిచూస్తూ, 'ప్రతిఏడూ ఎండాకాలంలో మీా రిక్కడకు ఎందు కొస్తారో నా కర్థమైంది. ఆపాటి విశ్రాంతి ఎవరికైనా అవస రమే. పట్నంలో విసిగిపోయి, అలిసిపోయిన మీాలాంటివారికి యిక్కడి ప్రకృతి విలాసం కలిగిస్తుంది.'

లాసున్‌స్కయా అతన్ని క్రీగంటచూస్తూ, 'ప్రకృతి... అవును. చాలా ఆహ్లాదంగా వుంటుంది. దాన్ని నేను ఆరా ధిస్తాను. కాని రూడిన్, ఒక్క సంగతి. ఎంతసేపూ ప్రకృతిని చూస్తూనే కూర్చోలేం. ఇక్కడకూడా పిచ్చాపాటీ మాట్లాడు కునేందుకు స్నేహితులు కావలసివస్తుంది. అబ్బ! యిక్కడ ఎవరూ లేనేలేరు. ఉన్నవాళ్లల్లోకల్లా పిగసోవ్‌మాత్రమే తెలివైనవాడు.'

'ఎవరు? పిగసోవా? నిన్న చురచురలాడుతూ లేచి వెళ్ళినాయనేనా?'

'అతనే. ఈ పల్లెప్రాంతాల్లో అతనితో మాట్లాడితేనే కొంచెం సరదా అనిపిస్తుంటుంది. మనిషిలో హాస్యం ఉంది.'

'మీరనుకున్నట్లు అతనేమీ తెలివితక్కువవాడుగాదు. పెడదారిమాత్రం పట్టాడు. అదీ అతని లోపం. బహుశ మీరు నాతో ఏకీభవించకపోవచ్చు. ఒక్క సంగతి. ప్రతి దాన్నీ కాదనడం, పనికిరాదనడం, తిరస్కరించడం అర్థరహిత మైనది. మంచిని చూడకుండా, సృష్టిలోని ప్రతి వస్తువును తిరస్కరించడంవల్ల మనుష్యులు సులభంగా ఋషులుగావచ్చు. అడ్డదిడ్డంగా వాదించేవాళ్ల ధోరణి విని, అమాయకులు, అతను చాలా గొప్పవాడనుకోవచ్చు. తప్పు పట్టుకోవాలంటే, అన్నింటా దోషాన్నే చూడవచ్చు. కేవలం దోషాన్ని వెతికే వాళ్లు ఒకొక్కప్పుడు నిజం చెప్పినా దానికి విలువవుండదు. వాళ్లకు సృష్టి అంతా దోషభూయిష్టమైందే. అంతటితో ప్రతిదీ అసహ్యంగా కనిపిస్తుంది. ఆలోచన మందగిస్తుంది. మరి జీవితమంటే అది గాదుగా? సంకుచిత దృక్పథానికి అది లొంగదు. ఎవరైతే ప్రేమించగలరో వాళ్ళకే విమర్శించే హక్కువుంది.'

'మీరు మనుష్యుల ఆనుపానుల్ని యిట్టే గ్రహిస్తారే. కాని పిగసోవ్ మీతో ఏకీభవించలేకపోలేదు. ఒచ్చిన చిక్కల్లా తనమీాద తనకు ప్రేమ జాస్తీ.'

'మనం ఒకళ్లని నిందించేటప్పుడు, యితర్ల నిందలను కూడా సహించాలి!'

లాసున్స్కయా అవునన్నట్లు తలవూపి సిగరెట్టు పొడిని రాల్చింది. వేళ్ళు ఆడిస్తూ, మీ స్నేహితుడు ఎలాంటివాడూ?'

'చాలా మంచివాడు. బాగా చదువుకున్నవాడు. కాని దేన్నీ పట్టించుకోడు. ఉన్నచోటనే వుండిపోతాడు. చదువుకున్నాడుగాని అన్నివిషయాలు తెలుసుకోవాలనే కుతూహలంలేదు.'

'అతని వ్యాసం చదివి నేనూ యిలాగే అభిప్రాయపడ్డాను.' రూడిన్ సంభాషణ మార్చి, 'యిక్కడ మీకు యింకెవరైనా స్నేహితు లున్నారా?' అన్నాడు.

'ఇంకెవరూ లేరనే అనుకోండి. కాని వాసిలోవ్నా నాకో ఆత్మీయురాలు. నిన్న విందుకుకూడా వచ్చింది. చూసేవుంటారు. ఆమె అన్న పావ్‌లోవిచ్ ఎంతో మంచివాడు. వీరిద్దరూగాక 'ప్రిన్సుగారిన్' అని మరో స్నేహితుడు. ఇరుగుపొరుగువాళ్లు మరో యిద్దరు ముగ్గురున్నారుగాని వాళ్ళంత చెప్పుకోదగ్గవాళ్ళుగారు. మా పొరుగున యింకొకాయన ఉన్నాడు. విద్యావంతుడు. వివేకి. కాని ఆయన దదో వింతతరహా. అతనివెర్రి అతనిది. పావ్‌లోవ్నాకి ఆయనతో పరిచయం. ఆమెకు ఆయనంటే గౌరవం. పావ్‌లోవ్నా మంచిపిల్ల. సరైన సాంగత్యముంటే రాణిస్తుంది.'

'ఆమెకు లేనిపోని భేషజం లేనట్టేవుంది.'

'చాలా గుణవతి. యింకా అడ్డాలలో ఉన్నట్టే ప్రవర్తిస్తుంది. ఒట్టి పసిపిల్ల. పాపం, చిన్నతనంలోనే భర్త మరణించాడు. ... నేను మొగవాణ్ణి అయితేనా అలాంటి పిల్లను ప్రేమిద్దును.'

'నిజంగానా?'

'నిజంగా. అలాంటి పిల్లలు సుకుమారంగా వుంటారు. ఆ సౌకుమార్యం పోమ్మన్నా పోదు.'

'సౌకుమార్యం అంతటిదన్నమాట' అని అంటూ ఎప్పుడూ నవ్వని రూడిన్ నవ్వాడు. కళ్లు గిరగిరా తిరిగేయి. మొహం విప్పారింది.

'వాసిలోవ్నా కు ఆయ నెవరో అంటే గౌరవం అని చెప్పారుగదూ? ఆయ నేం చేస్తూవుంటారు?'

'ఆయన పేరు లెజ్జినోవ్. బాగా భూమీంపుట్రా ఉన్న వాడు.'

రూడిన్ ఆశ్చర్యంతో తలపైకెత్తి 'ఎవరూ, లెజ్జ నోవా? అతను మీ పొరుగు నే ఉన్నాడా?'

'అవును. ఆయన మీ కెలా తెలుసును?'

రూడిన్ కొంచెంసేపు మౌనంగా ఆలోచిస్తూ కూర్చు న్నాడు. 'నా కాయన తెలుసును. చాలాకాలం క్రిందట పరిచయమైంది. ఆయన భాగ్యవంతుడే ననుకుంటాను.'

'భాగ్యవంతుడే. కాని అతన్ని చూసినవాళ్ళు అలా అను కోరు. వేషంబట్టి నౌకరేమో ననుకుంటారు. నిన్న యిక్కడికి రప్పించాలని కబురుపెట్టాను. అతనితో నాకు పనికూడావుంది. మరి యీ ఎస్టేటుగొడవలు... అంతా నామీదేపడిందని మీకు తెలుసుగదా?'

తెలుసునన్నట్లు రూడిన్ తలవూపాడు. లాసున్స్కయా సాలోచనగా 'బస్తీలో ఉన్నానన్నమాటేగాని, నా ఆచారా లేవో నావి. విదేశీయ సాంప్రదాయాల్ని, యీ పల్లెటూళ్లో

ప్రవేశపెట్టలేను. యిక్కడ మనఆచారాలు మనవి. అలాంటి భాషను పల్లెటూరివాళ్ళకు మప్పకపోవడం మంచిదేగదూ!'

'చాలామంచిది. ఎంతచెప్పినా ఆడవాళ్ళాడవాళ్ళే. ఇలాంటివిషయాల్లో మగవాళ్ళెందుకూ పనికిరారు'. రూడిన్ తనను అభినందించినందుకు కృతజ్ఞత తెల్పుతూ-'ఆ. అన్నట్టు ఏదోచెప్తూ మధ్యలో ఆగిపోయాను...అవు నవును. అదా సంగతి. లెజ్‌నోవ్, లెజ్‌నోవ్! నా కతనితో పనుందనిగాదూ చెప్పాను. మా యిద్దరికీ భూమితగువు ఒకటుంది. సరిహద్దు కొలతలగురించి తేల్చుకుందాం రమ్మనమని అనేకసార్లు కబురు చేశాను. ఎంతకీరాడు. ఇప్పుడుకూడా వస్తాడనే చూస్తున్నాను. వస్తాడో రాడో దేవుడికే తెలియాలి.'

ఈ మాటలు అంటూండగానే గదితలుపు తెరచుకొని నౌకరు లోనికివచ్చి లెజ్జినోవ్ బయట నిరీక్షిస్తున్నట్లు తెలియజేశాడు. లాసున్‌స్కయా లోనికి అతన్ని తోడ్కొని రమ్మని నౌకర్ని ఆదేశించింది. నౌకరువెళ్ళగానే విసుక్కుంటూ రూడిన్‌వంకతిరిగి 'చూడు, అతనివెర్రి పానకంలో పుడకలాగ ఎలాంటప్పుడు వచ్చాడో.'

రూడిన్ యిక అక్కడవుండడం భావ్యంకాదనుకొని లేచి వెళ్ళిపోబోతున్నాడు. అతన్ని వారించి 'మీరు వెళ్ళిపో నవసరంలేదు. మీరు వినగూడని రహస్యాలు ఏమీలేవు. ఎందుకైనా మీ రుండటమే మంచిది. మీరుంటే నిన్న పిగసోవ్ తగ్గినట్లు యితనూ తగుతాడు' అంది. వెళ్ళిపోబోతున్న రూడిన్ తనకుర్చీలో మళ్ళీ కూర్చున్నాడు. లెజ్జినోవ్ గదిలోనికివచ్చి లాసున్‌స్కయాకు నమస్కరించి నుంచున్నాడు.

పాట్లి కోటు. వారంరోజులై విప్పలేదు. కోటుమీద బురద. లాసున్‌స్కాయా అతనికి కుర్చీ చూపుతూ 'ఎలాగైతేనేం, దర్శనభాగ్యం కలిగింది... అన్నట్టు మర్చిపోయాను. ఈయన్ని మీ రెరుగుదురనుకుంటాను.' అని రూడిన్‌ను చూపించింది.

'లెజ్జినోవ్ రూడిన్‌వంక తేరిపారజూసి నవ్వుతూ, తెలుసును.'

రూడిన్ నేలవంకజూస్తూ మెల్లగా 'ఆయన యూనివర్సిటీలో చదువుకుంటున్నప్పుడు ఓసారికలుసుకున్నాం'అన్నాడు.

'ఒకసారేం. తర్వాతకూడా కలుసుకున్నాం.'

లాసున్‌స్కాయా తత్తరపాటుతో యిద్దరివంకాచూసింది. లెజ్జినోవ్ కుర్చీలో కూర్చుంటూ, 'ఏదో మాట్లాడాలని కబురుచేశారుగదూ? మన సరిహద్దులను గురించి అనుకుంటాను.'

'అవును. కాని దాని మాటకేం. మనం మనం బంధువులం గదా. నిన్న విందుకు వస్తావని మేమంతా ఎదురు చూశాం.'

'పిల్చినందుకు సంతోషం. రాలేకపోయాను. క్షమించండి...మనపొలం తగువంతా తీరిపోయినట్లే. మీ గుమాస్తా చెప్పినట్టు పరిష్కారమైంది.'

'నా కా సంగతి తెలుసును.'

'అతను చెప్పిందంతా నేనొప్పుకున్నా, మిమ్మల్ని కలుసుకోండే, కాగితంమీద సంతకం పెట్టనన్నాడు.'

'అది నా రూలు. అన్నట్టు మీ భూములన్నీ రైతుల అధీనంలోనే వున్నాయా?'

'అవును. మగతా కిచ్చాను.'

'రైతుల అధీనంలోనున్నా, మన తగవును సవ్యంగా పరిష్కరించినందుకు సంతోషం.'

'ఇంక నే వెళ్ళిపోయేదా?'

లాసున్స్కయా వెడవెడ నవ్వుతూ, 'మమ్మల్ని చూడ్డమే నీ కంత కష్టంగా ఉందన్నమాట.'

'నేను తరచు ఎవరిళ్ళకూ వెళ్ళను.'

'ఎవరింటికీ వెళ్ళవా? పావ్లోవ్నా యింటికో?'

'ఆమె అన్న నాకు చిన్ననాటి స్నేహితుడు.'

'చిన్ననాటి స్నేహితుడా? ... అంత యిబ్బందిగా వుంటే ఉండమని నిర్బంధించననుకోండి. కాని లెజ్నోవ్! ఒక్క మాటంటాను. కోప్పడకు. నీకన్నా నేను పెద్దదాన్ని. పెద్దవాళ్లు చిన్నవాళ్లను మందలించవచ్చు...ముక్కు మూసుకొని ఋషిలా ఎప్పుడూ యింట్లో కూర్చునేందుకు ఏమంత కొంప మునిగిపోయిందనీ. ఎన్నిసారు పిల్చినా మా యింటికి రా వెందుచేత? మేమంటే నీకు పడదా? మా యిల్లు బాగుండదా?'

'మీ యిల్లెందుకు బాగుండదూ. మహల్‌లావుంటుంది. మీరంటే నాకు ద్వేష మెందుకు? మీతో పరిచయం తక్కువ. చీటికిమాటికివస్తే మీకే చికాకు. మీరు గొప్ప వాళ్ళు. మీతో కలిసిమెలసి తిరగడమంటే కష్టంగదా?'

'బంధుత్వం దగ్గర [redacted]దా చిన్నా ఏముంది? చదువుకున్నవాడివి నువ్వే అలా అంటే ఎలాగ?'

'బంధుత్వం, చదువు, వీటో ఏముందీ?'

'అదిగాదు లెజ్‌నోవ్? ఎవరి వాళ్ళతో వాళ్ళు తిరగాలి. మనమంతా ఒకటే. 'కూపస్థమండూకంలా' ఉంటే ఎలాగు చెప్పు.'

'నీళ్ళల్లోవుంటేనే చేప బ్రతుకుతుంది. ఇంతకీ నూతిలో కప్పలా నే నున్నానని మీ రెలా అనుకుంటున్నారు? లాసున్‌స్కీయా తనపొరపాటుకు నాలుక కరుచుకుంది. 'సరే సరే. దానిమాటకేం లే...అందరిలాగ నీతో కాస్సేపు హాయిగా గడిపేభాగ్యం మాకు లేదుగదా?' రూడిన్ ఆమె మాటల కడ్డువచ్చి 'చేపలూ, కప్పలూ ఉపమానాలు చెప్పి లెజ్‌నోవ్ మానవ స్వాతంత్ర్యహక్కులను వివరించదలిచా డనుకుంటాను' అన్నాడు.

అతనిమాటలు విని లెజ్‌నోవ్ రూడిన్‌వంక ఒకసారి చూశాడేకప్ప ఏమీ మాటాడలేదు. కొంతసేపు నిశ్శబ్దంగా గడిచింది. కుర్చీలోంచి లేస్తూ లెజ్‌నోవ్ 'సరే. మన సరిహద్దులతగాదా ముగిసింది. రేపు మీ గుమాస్తాచేత కాగితాలు పంపించేస్తా రనుకుంటాను.'

'నువ్వు అలా కోరుతున్నప్పుడు తప్పక పంపిస్తాను.

'నా కోర్కె ఏముందీ? సరిహద్దు మీాపరంగానే పరిష్కారమైంది.'

లాసున్‌స్కీయా యిక అంతటితో ఆ ప్రసంగ కట్టిపెట్టి 'తొందరేముందీ, భోజనంచేసి వెళ్ళవచ్చు' అంది.

'క్షమించండి. ఇంటిదగ్గర అర్జంటు పనివుంది,' అంటూ లెజ్‌నోవ్ బయటకు వెళ్ళిపోయాడు.

లాసున్‌స్కయా రూడిన్ వంక తిరిగి 'అతని వెర్రి అతనిది. ఏ వెర్రికైనా హద్దు అంటూ వుండాలికదా?' అంది.

'ఇతనికీ పిగసోవ్‌కు పట్టుకున్న వెర్రి ఒక్కటే. ఒకళ్ళు చెప్పింది వినరు. బుద్ధికి ఎంతతోస్తే అంత. పిగసోవ్ గొప్ప వేదాంతి ననుకుంటాడు. యితను విషాదజీవి. యిద్దరికీ అహంకారముంది. ఇద్దరి దృక్పథాలలోనూ కొంత సత్యం, కొంత ప్రేమ, మించిన అతిశయం కన్పిస్తోంది. నిర్లక్ష్యంగా, దేన్నీ ఖాతరుచేయనట్టు నటించాలనే ముసుగు యిద్దరికీవుంది. అలా నటిస్తే తా మెంతో ప్రతిభావంతులని అంతా అనుకుంటారని వాళ్ళఆశ. కాని ఇలాంటిమనుష్యులు ధరించిన ముసుగు తొలగించిచూస్తే, వాళ్ళెంతబోళామనుషులో తెలిసిపోతుంది.'

'అబ్బ. మనుష్యుల్ని చూసీచూడగానే ఎంత చక్కగా నిర్వచిస్తావు? నీ నిర్వచనాల్ని కాదనలేం.'

'హేళనగా మాట్లాడం నాకు చేతగాదు. మానవుణ్ణి నేను ప్రేమిస్తాను. ప్రతి మానవుడు నాకు స్నేహితుడనే అనుకుంటాను. లెజ్‌నోవ్‌ను అలానే ప్రేమించాను. జీవిత సర్వస్వంగా భావించాను. కాని కొన్నాళ్లకు అనేక మనస్పర్ధలవల్ల —'

'దెబ్బలాడుకున్నారా?'

'దెబ్బలాడుకోవడం కాదుగాని, ఒకళ్లకొకళ్లం దూరమైనాం.'

'అందుకా అతను వచ్చినప్పుడు మీరు మామూలుగా లేరు... ఈపూట బాగుందిగదూ. సరే, పనుంది. మా సెక్ర

టరీ మీకు తెలుసుగదూ? నాకోసం ఎదురుచూస్తూ వుంటాడు. మీకేం కావాలో అతన్నడగండి... వెళ్లొస్తాను.'

రూడిన్ పరిచయం ఈవిధంగా కలిగించినందుకు చక్రవర్తిగారి అంతరంగికునికి ధన్యవాదాలర్పిస్తూ, లాసున్ స్కీయా నవ్వుతూ, రూడిన్‌తో కరస్పర్శచేసింది. రూడిన్ తన గదిలోనికివెళ్ళి కొంచెంసేపు అయ్యాక మేడమీదికి వెళ్లాడు. మేడపైగదిలో నటాలియా కూర్చునిఉంది.

# 5

నటాలియా ప్రథమ వీక్షణంలో అంత అందగత్తెగా స్ఫురించకపోవచ్చును. కాని ఆ పిల్ల అందగత్తె. సన్నని మనిషి. లేతగులాబీరంగు శరీరం. విల్లువలె వంగిన కనుబొమలమీద చక్కని నుదురు; నల్లనికళ్లు. వయస్సు పదిహేడేళ్లు. తీర్చిదిద్దిన కనుబొమ్మలను ఎత్తి నల్లనికళ్లతో చూస్తున్నప్పుడు మరీ ఆకర్షణీయంగా, రమణీయంగా కనిపిస్తుంది. ఎవరైనా మాట్లాడుతున్నప్పుడు సన్నని పెదవులను బిగించుకొని, మౌనంగా వింటూ కూర్చుంటుంది. చెప్పే ప్రతి మాటను తూస్తున్నట్టు వింటూ ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ గదిలో అటూ ఇటూ పచారుచేస్తూ వుంటుంది. కిటికీచెంత నిలబడి వెనక్కి చేతులు పెట్టుకొని నీలిఆకాశంవంక చూస్తూ ఏమి ఆలోచిస్తూ వుంటుందోగాని తనలోతాను చిరునవ్వు నవ్వుకుంటుంది. పంతులమ్మ తరుచు హెచ్చరిస్తోన్నా నటాలియాకంతా పరధ్యానమే! పంతులమ్మ పేరు 'బోన్‌కోర్టు. ఆమె ఫ్రెంచి వనిత. ముసలిది. నటా

లియావంక తిరిగి పంతులమ్మ 'ఆడపిల్లలకి అంత పరధ్యానం ఉండకూడదమ్మ తల్లీ. చిన్నపిల్లవి. అప్పుడే అంత మతిమరుపు తనమైతే ఎలాగా?' అని అంటూ వుంటుంది. పంతులమ్మ అనుకున్నట్టు నటాలియా మతిమరుపు మనిషి కాదు ఏపుస్తకం చదివినా, ఎంతో శ్రద్ధగా చదువుతుంది. ఏ పని చేసినా, మనసంతా అందులోనే పెడుతుంది. ఆమె హృదయం అగాధమైనది. భావాలు గంభీరమైనవి. తన భావాలను, అనుభూతులను హృదయంలోనే గుప్తపర్చుకుని మనసులో పుట్టిన ఉద్రేకాన్ని మనసులోనే అదిమిపెట్టుకుంటుంది. మనస్సు వికలమైనప్పుడు, మొహంమాత్రం కొద్దిగా వివర్ణమౌతుంది. పసికందుగా ఉన్నప్పుడుకూడా ఆ పిల్ల గుక్కపెట్టి ఏడవలేదట. ఎన్నడూ మారాంచేసి ఎరగదట. 'మా పెద్దది చిన్నప్పటినుంచీ బుద్ధిమంతురాలే. తన ఆటేమో, తన పాటేమో. ఒకరిజోలీ, శొంఠీ దానికక్కరలేదు' అంటూ లాసున్స్కయా తనకూతురు చిన్ననాటి ముచ్చట్లను తలుచుకుంటూ 'లేనిపోని ఆశలు, బెంగలూ నాలాగ పెట్టుకోదు. మంచి మొగుణ్ణిచూసి, ఆమూడుముళ్ళూ వేయిస్తే హాయిగా సుఖపడుతుంది పిల్ల' అంటూ ఉబ్బిపోతుంది.

లోకంలో కొందరుతల్లులకు తమబిడ్డలసంగతి సరిగా తెలియదు. అందులో లాసున్స్కయా ఒకతె. తల్లి అంటే ప్రేమ, భక్తీ ఉన్నప్పటికీ నటాలియా తన హృదయాన్ని ఎప్పుడూ తల్లి ఎదుట బహిర్గతం చేయలేదు. తల్లి దగ్గరనైతం దాపరికమే.

'నాదగ్గర సిగ్గెందుకే వెర్రికిల్లా! మనసులో ఏముందో నాకు కాకపోతే యింకెవరికి చెప్తావు?' అని తల్లి నటాలియాను నిగ్గదీసింది. నటాలియా ఆలోచిస్తూ కూర్చుండిపోయిందేతప్ప సమాధానమేమీ చెప్పలేదు. 'తల్లికన్నా పిల్లలికి లోకంలో యింకెవరుంటారు చెప్పు? నీమనసును బట్టే నడుచుకుంటాను. నీ ఉద్దేశమేమిటో ముందు తెలియాలిగదా నాకు?'

'ఇప్పుడు చెప్పకపోతే కొంపేం మునిగిపోయింది?' అంటూ నటాలియా తప్పించుకుంది.

ఈవేళ రూడిన్ మేడమీదకు వెళ్లేసరికి గదిలో పంతులమ్మ, నటాలియా కూర్చున్నారు. పంతులమ్మ పాఠం చెప్పడం అయిపోయింది. నటాలియా పుస్తకంమడిచి గదిలోనికి వెళ్తూవుంది. పంతులమ్మ చిన్నప్పటినుంచీ నటాలియాను విద్యాగరపుతూ నేవుంది. ఇప్పుడు నటాలియా చిన్నపిల్లగాదు. ప్రౌఢ. ఎంతచనువున్నా ఆమెను పంతులమ్మ యిప్పుడు మర్యాదగా సంభావిస్తోంది. నటాలియా ప్రొద్దున్నే పంతులమ్మ ఎదుట చారిత్రక గ్రంథాలు, వీరులకథలు, విదేశయానచరిత్రలు చదువుతూవుంటుంది. పురాణగ్రంథాలు, భౌగోళిక శాస్త్రాధ్యయనం పూర్తి అయిపోయింది. నటాలియా ఏ పుస్తకాలు చదవాలో, ఏవి చదవకూడదో తల్లి నిర్దేశిస్తుంది. ఒస్టీనుంచి ప్రచురణాలయం పంపించే పుస్తకాలను లాసున్స్కా-యా ముందు పరిశీలించి శృంగారకావ్యాలను తనకోసం అట్టేపెట్టుకుని, మిగిలినవి నటాలియాకు చదవమని యిస్తుంది. చరిత్ర గ్రంథాలను బోధించడమంటే పంతులమ్మకు తలనొప్పి. నెపోలియన్, లూయీ మొదలైన చక్రవర్తుల జీవితాలుతప్ప

చరిత్రలో చెప్పుకోతగ్గ దేమీ లేదని ఆమె భావం. నటాలియా శాస్త్రగ్రంథాల నేగాక కవులగీతాలను అధ్యయనంచేసింది. పుష్కిన్ కావ్యాలు ఆమెకు కంఠోపాఠం.

టోపీ గదిలో పెట్టి బయటికి వస్తున్న నటాలియాకు రూడిన్ ఎదురుపడ్డాడు. రూడిన్ నుచూసి నటాలియా పక్కకు ఒత్తిగిలింది.

'చదువు అయిపోయినట్టుంది. షికారుకు బయలు దేరారు కాబోలు ?'

'అవును. తోటలోకి వెళ్లుదామనుకుంటున్నాం.'

'మీతో నేనూ రావచ్చునా ?' రూడిన్ మనతో రావచ్చునా అన్నట్టు నటాలియా పంతులమ్మకేసి ప్రశ్నార్థకంగా చూసింది.

'రండి. ముగ్గురం వెళ్ళుదాం' అంది పంతులమ్మ. రూడిన్ వారివెంట బయలుదేరాడు. తోటలో పూలపొదల మధ్యగా నటాలియా ముందు వెళుతోంది. ఆమెను రూడిన్ వెంబడించాడు. యిరుకైన దారి వచ్చేసరికి రూడిన్ తప్పని సరి అన్నట్టు ఆమెకు మరీ దగ్గరపడి శరీరాన్ని తాకాడు. నటాలియా కళవళపడింది. హృదయంలోని భావాలను అణచి పెట్టుకొంది. దారిలో రూడిన్ కుశలప్రశ్నలు వేస్తూనే వున్నాడు. 'చదువు బాగా సాగుతోందా ? పల్లెటూళ్లో కాలక్షేపం అవుతుందా ? బస్తీలు బాగుంటాయా ? పల్లెలు బాగుంటాయా ?' యిత్యాది ప్రశ్నలతో ఆమెను తికమక పెడుతున్నాడు. సిగ్గుతో మనస్సులోని చికాకును వ్యక్తం చేయకుండా నటాలియా సమాధానం చెబుతోంది.

'పట్నవాసానికి అలవాటుపడ్డవాళ్లు మీరు యిక్కడ ఎలా వుండగలుగుతున్నారు?' అంటూ రూడిన్ ఆమెవంక పక్కచూపులు చూశాడు. తన జీవితంలో ఏ యువకుడూ యింతవరకు తనవంక అలా చూడలేదని నటాలియా తబ్బిబ్బు పడింది.

'పల్లెటూళ్ళో బాగానే వుంటుంది. నాకు మరీ బాగుంది. ఎంతో ఆనందంగా వుంది.'

'ఆనందం!... అది నిజంగా గొప్పసంగతి. అలా వుండడం మీకు సహజమే. మీరు యవ్వనవతులూ మరి.'

యవ్వనవతులు అనేమాటను నొక్కి పలుకుతూ గూఢార్థాన్ని వ్యక్తంచేస్తూ 'ఆహా! యవ్వనం! జీవితంలోని యవ్వన మాధుర్యాన్ని అనుభవింపజేయడమే విజ్ఞానశాస్త్ర పరమావధి' అన్నాడు.

నటాలియాకు అతని మాటలలోని అర్థమేమో అవగతం కాలేదు. విచిత్రదృక్కులతో ఆమె నిలబడింది. రూడిన్ సంభాషణమార్చి 'యింతసేపూ మీ అమ్మగారితోటే కూర్చుండిపోయాను. పిచ్చా, పాటీ చెప్పుకుంటూవుంటే పొద్దే తెలిసిందిగాదు. ఆహా! అమ్మాజీ, ఘరానా మనిషి. కవులుగూడా ఆవిడ సలహాలకు ఎందుకంత విలువ యిస్తూ వుండేవారో యిప్పుడు నాకు అర్థమైంది మీకు కవిత్వమంటే ఇష్టమేనా?'

బడిపిల్లలను పంతులు పరీక్షిస్తున్నట్లు, తనను రూడిన్ ప్రశ్నిస్తున్నాడని నటాలియా బిత్తరపోయింది.

'కవిత్వమంటే నాకిష్టమే.'

'కవిత్వమంటే అది దేవతలభాష. గేయ కవిత్వమంటే నాకు మరీ ఇష్టం. కాని కవిత్వమనేది కేవలం గణ, యతి ప్రాసలతో కూడిన పద్యాలను, లయబద్ధమైన గీతాలను మాత్రమే ఆశ్రయించివుండదు. మనచుట్టూ ఎటు తిరిగితే అటు కవిత్వం గోచరిస్తూవుంటుంది ... అదిగో! తోటలో ఆ చెట్లు, పూలగుత్తులూ, ఎర్రసిపళ్లు చూడండీ. నీలిఆకాశం వంక చూడండి. ప్రతిదీ సౌందర్యమయమే. ఎక్కడ సౌందర్యం, నవజీవనం ఉట్టిపడుతూ ఉంటుందో అక్కడల్లా కవిత్వం తొణకిసలాడుతూ వుంటుంది.' నటాలియా మంత్రముగ్ధవలె అతని కవితాధోరణిని వినసాగింది. తోటలో లతాకుడ్యము చెంత ఉన్న శిలావేదికను చూపిస్తూ రూడిన్ 'ఇక్కడ కాస్సేపు కూర్చుందాం...' అంటూ నవ్వుతున్న తనకళ్లతో ఆమెమోములోనికి తొంగిచూసి, 'నా మాటలు మొదట మీకు ఆశ్చర్యం కలిగించొచ్చు. కాని యదార్థం మీకే తెలుస్తుంది. తెలుసుకున్న తరవాత మనం స్నేహితులమౌతాం. అంతేగదూ?' అన్నాడు.

నటాలియా మరీ విస్మయంతో, రూడిన్ తన నొక ఆటబొమ్మగా భావిస్తున్నాడని అనుకుంది. అతనితో ఏం మాట్లాడాలో తోచలేదు. 'యింకా యీ ప్రాంతాల్లో మీరు ఎన్నాళ్లుంటారు?' అనేమాట ఆమె పెదవులనుండి అనుకోకుండా పైకి దొర్లింది.

'ఈ వేసవికాలమల్లా వుంటాను. ఉహుఁ, కాదు. శీతాకాలంకూడా యిక్కడే వుంటాను. నేనేం డబ్బున్నవాణ్ణి కాదు. వ్యవహారాలన్నీ చిక్కుల్లో ఉన్నాయి. అదిగాక

అటు యిటూ తిరగడనుంటే విసుగు. ఎక్కడో ఓ చోట కాస్త విశ్రాంతి తీసుకోవాలనిపిస్తోంది' అన్నాడు రూడిన్.

'విశ్రాంతి తీసుకోవడమా? అది ముసలివాళ్లు చెప్పే మాట.'

కూర్చునివున్న రూడిన్ ఆమె కభిముఖంగా తిరిగి 'మీ అభిప్రాయ మేమిటో నాకు బోధపడ లేదు.'

'అభిప్రాయాని కేముంది? ఇతరులైతే విశ్రాంతి తీసుకోవచ్చును. కాని మీలాంటివాళ్ళు ... లోకం మేలు కోసం ఏదో పనిచేస్తూ నేవుండాలి ... మీరు కాకపోతే యింకెవరు చేస్తారు?'

'నామీద మీ కంత సద్భావం వున్నందుకు సంతోషం. లోకం మేలుకోసం పనిచేయడం! ... ఈ మాటనడం అతి సులభం.' రూడిన్ ఆలోచనా నిమగ్నుడై వేళ్లతో తన నుదురును మీటుకుంటూ కళ్ళు పెద్దవిచేసి 'లోకోపకారం కోసం పాటుపడగలననే ఆత్మవిశ్వాసం నాకున్నమాట నిజమే.... అంత ఆత్మవిశ్వాసమున్నా నన్ను అర్థం చేసుకునే మానవులు ఉండొద్దూ? అంత సానుభూతి ఎవరిలో వుంటుంది?' నిరాశాభావాన్ని వ్యక్తపరుస్తూవున్న అతని మాటలను విని, గతరాత్రి అతను చెప్పిన ఆశాపూరిత ఉపన్యాసం నటాలియా గుర్తుకు తెచ్చుకుంది. 'నిన్నరాత్రి అంత కులాసాగామాట్లాడి, యిప్పుడింత విచారంగా ఉండడానికి కారణ మేమి'టని అతన్ని అడగాలనుకుంటోంది. ఆమె మనస్సులోని భావాన్ని రూడిన్ ఇట్టే గ్రహించినట్లు మళ్లీ ప్రారంభించాడు. 'అదేంమాట లెండి. ఛ ఛా! నిరాశకు తావులేదు. మీరన్నమాట సత్యం.

నాలో ఆత్మవిశ్వాసాన్ని మీ మాటలు చిగురింపజేస్తున్నాయి. అందుకు నేనెంతో ధన్యుణ్ణి. ఒకమాట మీ పెదవులవెంట వచ్చిందో లేదో, వెంటనే నా జీవితలక్ష్యమేమిటో మళ్ళీ జ్ఞప్తికి వచ్చింది. నా విధ్యుక్తధర్మం నాకు తెలిసింది. అవును నా ధర్మాన్ని నేను నెరవేర్చాలి. మనిషికి తెలివితేటలూ, సామర్థ్యం ఉండి ప్రయోజనంలేదు. వాటిని కార్యరూపంలో పెడితేనే బంగారానికి తావి. బద్ధకంగా, ఒళ్లువిరుచుకుంటూ, ఆవులిస్తూ ఏ పనీ చేయకుండా చిటికెలువేస్తూ కాలంగడిపే మాటలపోగులంటే నా కసహ్యం.'

రూడిన్ ధారాప్రవాహంగా ఉపన్యాసధోరణి ప్రారంభించాడు. పిరికితనం, బద్ధకం జీవితానికి వేరుపురుగుల వంటివని, యీ దుర్గుణా లున్నమనుష్యులు యిక ఎత్తిరిల్లరనీ చెప్పాడు. పనిచేసేవాడికి ఫలితంతో ప్రమేయం లేదన్నాడు. ఈ సంగతి తెలుసుండి, జీవితంపట్ల యింతకాలం తానెందుకింత మూకీభావం వహించాడో, తనకే విడ్డూరంగా ఉందన్నాడు. 'యీవేళ చేయవలసినపని రేపుచేస్తా ననుకోవడము కార్యవాదిలక్షణంకాదు. గతించినరోజు తిరిగిరమ్మన్నా రాదు. అవకాశాలు జీవితంలో మనల్ని వెతుక్కుంటూ రావు. మనమే వాటిని వెతుక్కుంటూ పోవాలి. ఈ అన్వేషణలో ఉదాత్తభావాలు తోడునీడలు. ఉదాత్తభావాలను అర్థంచేసుకునేవాళ్లు లోకంలో కొద్దిమందైనా వుంటారు. ఈవేళ కాకపోతే రేపు ప్రపంచంలో ఈ మహత్తర భావాలు దిగ్విజయం పొందుతాయి. వాటిని ఎవరైనా అర్థం చేసుకోలేకపోతున్నారంటే, వాళ్లనివాళ్లే అర్థం చేసుకోవడంలేదన్నమాట.'

రూడిన్ మాఘుపాళి వానవలె ఆగిపోయాడు. జడి వాన కురిసి వెలిసింది. నటాలియా అతని ప్రవాహధోరణికి చకితురాలైంది. రూడిన్ ఉపన్యాసం ముగించి ఆమె చేతిని పట్టుకొని ఊపుతూ 'మీలో కవిత్వముంది. సౌందర్య మున్న చోట కవిత్వముంటుంది. ఉదాత్తత ఉంటుంది.'

రూడిన్ నటాలియాతో అంతచనువుగా ప్రసంగించడం పంతులమ్మను హఠాత్తుగా పిడుగు మీదపడ్డట్టనిపించింది. ఆమె నలభై ఏళ్ల వయస్సులో వుంటున్నా రూడిన్ వంటి వ్యక్తిని ఎన్నడూ చూడలేదు. తనమాటల చమత్కారంతో, పదాడంబరంతో రూడిన్ ఉపన్యసిస్తూవుంటే, అతనిపోకడను పంతులమ్మ మొదట్నుంచీ జాగ్రత్తగా గమనిస్తూనేవుంది. రూడిన్ నాటకాలలో పాత్రాభినయం చేయగల సామర్థ్యం గలవాడని, అది నాటకరంగంమీదైతే రక్తికడుతుందితప్ప, జీవితరంగంలో నిష్ప్రయోజనమని పంతులమ్మ అనుకోసాగింది. ఇలాంటి మాటలపోగులవల్ల లోకానికి జరిగేదేమీ లేదని, మర్యాద, మప్పితం, ఉచితానుచితజ్ఞానం లేకుండా రూడిన్ నటాలియాతో మాట్లాడుతున్నాడని ఆమె కంటగించుకొని, కూర్చున్నమనిషి దిగ్గునలేచింది. దుస్తులు దులుపుకుంటూ నటాలియావంక తిరిగి 'భోజనానికి వేళైందికదూ? పావ్లోవిచ్ కూడా వస్తానన్నాడు' అంది.

నటాలియా 'ఔను, వెళ్ళిపోదాం' అనేలోపున పావ్లోవిచ్ దూరంగా తోటలో కనిపించాడు. పంతులమ్మ 'మాటలోనే వచ్చాడు నూరేళ్ళాయుష్షు' అంటూ పావ్లోవిచ్ వంక చూసింది. పావ్లోవిచ్, ఎదురుగావస్తూ దగ్గరపడేసరికి

సందేహంగా అడుగులు వేయజొచ్చాడు. నటాలియావంక బాధపడుతున్నట్లు చూస్తూ 'ఒహో! షికారుకు వచ్చారు కాబోసు 'అన్నాడు.

'వెళ్ళిపోదామని లేచేసరికి నువ్వేవచ్చావు.'

'సరే అయితే, వెళ్ళిపోదామా?'

అంతా తోటదాటి భవంతిలోకి వెళ్ళిపోయారు. గదిలో ప్రవేశించగానే రూడిన్, పావ్‌లోవిచ్ వంక తిరిగి ప్రేమ ఉట్టిపడుతున్నట్లు 'మీ చెల్లెలు క్షేమమే గదా' అని కుశల మడిగాడు.

'కులాసాగా నేవుంది. ఈవేళ యిక్కడికి రావచ్చును. ఇందాకా మధ్యలో నేనొచ్చి మీ సంభాషణ కేమీ అంత రాయం కలిగించలేదుగదా ?'

'లేదు లేదు. నటాలియాతో మాట్లాడుతుంటే నాకు జ్ఞానోదయమైనట్లు అనిపించింది. ఆమె చెప్పిన ఒకమాట నా హృదయాన్ని మేల్కొలిపింది.'

నటాలియా ఏమి మాట్లాడిందో, ఏమాట అతనిని మేల్కొలిపిందో పావ్‌లోవిచ్ తెలుసుకోదలచలేదు. ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

భోజనాని కింకా వేళవుంది. హాలులో అతిథులు గుమి గూడారు. విందుకు పిగసోవ్ మాత్రం రాలేదు. రూడిన్ ఎప్పట్లాలేడు. ఏమీతోచక పాండలవిస్కీని పాట పాడమని అడిగాడు. నేలవంకచూస్తూ పావ్‌లోవిచ్ మౌనంగా కూర్చు న్నాడు. నటాలియా కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతోంది. చివరకు వూలు, దారం తెచ్చుకొని లేసు అల్లు

కుంటూ తల్లిప్రక్కనే చతికిలబడింది. రూడిన్ ఏ అపురూపమైన సూక్తులను పలుకుతాడో విందామనే జిజ్ఞాసతో బెసిస్టోవ్ తదేకదృష్టితో ఎదురుచూస్తున్నాడు. మూడుగంటల కాలం గడిచింది. వాసిలోవ్నా అప్పటికికూడా వినుకురాలేదు. విందు అయిపోయినవెంటనే చడీచప్పుడు లేకుండా, వాసిలోవిచ్ లేచి వెళ్ళిపోయాడు. రెండురోజుల్నుంచి అతని మనస్సు ప్రశాంతంగా లేదు. కారణం తెలియదు. ఏదో ఆవేదన, ఆరాటం ప్రారంభమైంది. విచారవదనంతో, విషణ్ణహృదయంతో, తడబడుతున్న అడుగులతో నడుస్తూ పరిపరివిధాల ఆలోచిస్తున్నాడు. నటాలియా అందాలరాసి ఆమెను తాను ప్రేమించాడు. ఇన్నిరోజులూ ఆమె తనదనే కలలు గంటూ వచ్చాడు. కాని యిప్పుడు ఆమె తనదిగాదు. నటాలియా సౌందర్యం, బుల్‌బుల్‌పిట్టల కిలకిలలవంటి పలుకులు! ఇక ఆమె తనవస్తువుకాదనే భావం భయంకరరూపం దాల్చి ఆందోళనపరుస్తోంది. నటాలియా ఎప్పట్లాగే అతనితో యీవేళా మాట్లాడింది. మామూల్లాగే పలకరిస్తూ నవ్వింది. 'ఆ పిల్లలో మార్పేమీ లేదే! నేనెందు కింత కలవరపడుతున్నాను?' అని ఒకసారి తననుతానే ప్రశ్నించుకున్నాడు. 'కాదు! ఏదో మార్పు కన్పిస్తోంది. ఎడంకన్ను అదురుతోంది' అనుకుంటూ దీర్ఘాలోచనా నిమగ్నుడైనాడు. మనస్సు పరిపరి విధాల పోతున్నది. వాసిలోవిచ్ నటాలియాను ప్రేమించి, పెళ్ళిచేసుకుందామని కలలుగంటున్నా, తన పెళ్ళి విషయం నటాలియాతో ఎన్నడూ ప్రస్తావించి ఎరుగడు. మాటలతో మురిపించే నేర్పరితనం అతనికిలేదు. ఆ పిల్లలో ఉద్రేకాలను

కలిగించే చాకచక్యమూ లేదు. ఆమెకు సన్నిహితంగా ప్రేమతో మెలగుతూవుంటే చాలును. ఆ పిల్ల ప్రేమతో తనపట్ల మెలగుతూవుంటుంది. కొంతకాలం గడిస్తే, ప్రేమాను రాగాభివృద్ధి చెంది ఇద్దరూ వివాహం చేసుకోవచ్చునని అనుకుంటూ నిత్యం నటాలియాను అంటిపెట్టుకొని తిరుగుతున్నాడు.

ఈపూట, నటాలియా తన చేతులలోంచి జారిపోయిందనే భావం కలగడానికి కారణం ఏమిటో ఊహించలేక పోతున్నాడు. ఇంటికి వెళ్ళగానే గదిలో పావ్లోవ్నా కూర్చునివుంది. ఆమెచెంతనే లెజ్నోవ్ కూర్చునిఉన్నాడు. అన్నను చూడగానే ఆతృతగా 'ఇంత తొందరగా తిరిగి వచ్చావేం?' అంది.

'అక్కడ తలనొప్పి.'

'రూడిన్ అక్కడ వున్నాడా?'

'మహారాజులాగ'

పావ్లోవిచ్ మరో కుర్చీలో చతికిలబడ్డాడు.

పావ్లోవ్నా అతనివంక తిరిగి 'లెజ్నోవ్ ఏమంటున్నాడో తెలుసునా? రూడిన్ తలతిక్క మనిషట. అతను తెలివైనవాడుకాదూ? మంచి వక్త. విద్యావేత్త. మేధావి. ఆ విషయం లెజ్నోవ్‌కి కాస్త చెప్పుదూ' అంది.

లెజ్నోవ్ కుర్చీని కొంచెం ముందుకు జరుపుకొని 'అతని వక్తృత్వాన్ని, తెలివితేటల్ని నేను కాదనడంలేదు. అతనంటే నాకిష్టంలేదు. అంతే నే నంటున్నది' అన్నాడు.

'నీవతన్ని చూశావా?' అని పావ్లోవిచ్ ప్రశ్నించాడు.

‘ఈవేళ ఉదయం లాసున్‌స్కాయా యింట్లో చూశాను. అక్కడ ఇప్పుడతను ఆడి-ది ఆట, పాడి-ది పాట. ఆవిడ మహారాణీ. ఈయన మహామంత్రి. నాకు తెలుసును. ఎప్పుడో ఒకప్పుడు వ్యవహారం యిద్దరికీ బెడుస్తుంది. ప్రొద్దున్న ఏమందనుకున్నావ్? అతను, ఆమె కూర్చున్నారు. నా కావిడ కబురుపెట్టింది. నన్ను వింతజంతువనుకుందో ఏమో, అతనికి చూపిస్తూ, మహాదర్జాగా అభినయించింది. ఆ చూపులు, ఆ మాటలు, ఆ అతిశయం ఏమని చెప్పను? నాకు అసహ్యామనిపించి యివతలికి వచ్చేశాను.’

‘నువ్వసలు అక్కడి కెందు కెళ్లావు?’

‘ఉందికదూ, పొలం తగువు. తాగేది దమ్మిడీకల్లు, ఇల్లల్లా చెడఉమ్మాడట. అలావుంది యీ తగువు. తగాదా అంతకుముందే వాళ్ల పరంగా పరిష్కారమైపోయింది. అయినా జమీందారిణీగారు నాకు కబురుపెట్టింది. బహుశః నేను మొహం వేలవేసిఉంటానని గాబోలు ఆవిడ ఉద్దేశం? నెరజాణ కదూ మరీ!’

పావ్‌లోవ్నా తమాషాగా నవ్వుతూ ‘నాకు తెలుసును, నీ కెందుకంత అసహ్యమోను. రూడిన్ గొప్పవాడని నీ బాధ. అతనిముందు నిలబడలేక యివతలకి వచ్చేశావు. కాని రూడిన్ నీ వనుకుంటున్నట్లు చెడ్డవాడు కాదు. అతనిమనస్సూ మంచిదే, బుద్ధీ మంచిదే. ఆ కళ్ళవంక చూస్తే నే...’

లెజ్‌నోవ్ ఆమె తనమాటను పూర్తిగా అనకుండానే మధ్యలో అడ్డువచ్చి ‘అవు నవును. అతనికళ్ళనిండా గొప్ప గొప్ప భావాలే. చెప్పేవన్నీ నీతులు...’ అన్నాడు.

'మొహంచాటున ఒకమనిషిని నిష్కారణంగా నిందించ కూడదు. అనవసరంగా అతన్ని నిందించకు. విందుకు నేనూ వెళదా మనుకున్నాను. నువ్వు వచ్చావని ఆగిపోయాను. ఆగిపోయినందుకు మంచిశాస్తే. అసలు అతనంటే నీకెందు కంత కోపం? నువ్వూ అతనూ స్నేహితులేగదా?'

'ఇదివరకు స్నేహితులమే. అతని సంగతంతా నాకు తెలుసును. మేం చదువుకుంటున్న రోజుల్లో...'

'ఏమైందీ?'

పావ్‌లోవ్నా రూడిన్ విద్యార్థి దశ ఎలా గడిచిందో చెప్పమని కోరింది. లెజ్‌నోవ్ కుర్చీలోంచి లేచి 'సరే చెప్తాను' అంటూ గదిలో పచారుచేస్తున్నాడు. అతను చెప్పేది పావ్‌లోవ్నాయేగాక, పావ్‌లోవిచ్ కూడా ఆసక్తితో వింటున్నాడు.

'మేం చదువుకుంటున్న రోజుల్లో అతని కథా, కమామిషు అంతా నాకు తెలుసును. అతను పుట్టిన వూరు ఒక పల్లె. తల్లిదండ్రులు ధనవంతులుగారు. కొద్దిగా భూమి మాత్రం ఉంది. తండ్రి చిన్నప్పుడే పోయాడు. ఇక తల్లే అతనికి దిక్కు. ఆవిడ చాలా యోగ్యురాలు. కొడుకంటే పంచప్రాణాలూను. చదువుకొని, పెద్దవాడై ఒకయింటివాడై, ఉద్యోగాలు వెలగబెట్టి తన నేదో ఉద్ధరిస్తాడని ఆమె పొంగి పోతూవుండేది. ఒకపూట తిని, రెండోపూట పస్తుపడుకొని యితనికి చదువు చెప్పించింది. కొడుకు చదువుకి ఒంటినున్న బంగారమంతా కరిగించివేసింది. మాస్కోలో చదివిద్దామ నేసరికి ఆమె దగ్గిర చిల్లిగవ్వ లేకపోయింది. ఎవరో దూరపు బంధువు ఆమెను ఆదుకున్నాడు. పెద్దవాడయాక రూడిన్

ఒక జమీందారిణి ప్రాపు సంపాదించాడు ... కాదు. కాదు జమిందారిణియే యితని ప్రాపు సంపాదించింది. మాస్కో యూనివర్సిటీలో చేరాడు. అక్కడే మా యిద్దరికీ పరిచయమైంది. అక్కడ మేము ఎలా గడిపేవాళ్ళమో ఇప్పుడు కాదు, మరోసారి చెప్తాను'

లెజ్‌నోవ్ రూడిన్ జీవితకథ చెప్తూ యింకా పచారు చేస్తూనేవున్నాడు. అతను ఎటు వెడితే, అటు తిరిగి చూస్తూ పావ్‌లోవ్నా కుతూహలంగా వింటున్నది.

'రూడిన్ యిల్లు వదిలిన తరువాత తల్లికి ఎప్పుడోకాని ఉత్తరాలు వ్రాసేవాడుగాదు. ఒకటి రెండుసార్లుమాత్రం యింటికి వెళ్లొచ్చాడు. ఇంతలో తల్లికి జబ్బుచేసింది. ఇక ఆమె బ్రతకదని కబురు వచ్చింది. తనకొడుకు చేతులమీదుగా చనిపోవాలని ఆమె ఆఖరికోర్కె. అదికూడా నెరవేరిందికాదు. గోడనున్న కొడుకుఫొటోను చూస్తూ ఆమె కళ్లుమూసింది.'

'ఆవిడ నీకు తెలుసునా?'

'తెలియడమేమిటి? రెండుమూడుసార్లు వాళ్ల వూరు వెళ్లాను. ఆమె చాలా మంచిది. ఎంతో గౌరవం. యింటికెవరొచ్చినా ఆదరించేది. కొడుకుని గురించి గొప్పగా చెప్పుకుంటూవుండేది.'

'చదువు అయిపోయిన తరువాత రూడిన్ ఏమీ వుద్యోగం చెయ్యలేదా?'

'కొన్నాళ్ళకుగాని తిరిగి మేం కలుసుకోలేదు. రూడిన్ రాష్ట్రం వదిలిపెట్టి వెళ్ళాడు. అక్కడ ఒకావిడపొందు కుదిరింది. యితనంటే పడిచచ్చేది. వయస్సులో చాలా పెద్దదే. యితను

కుర్రవాడు. గంగు వెలిసిపోయిన గుడ్డపీలికలా వుండేది. కొన్నాళ్ళు ఆవిడతో కులాసాగా గడిపి ఆమె నొదిలిపెట్టి వేశాడు. క్షమించు. ఆవిడే యితన్నొదిలిపెట్టింది. తరువాత అతను నన్ను కలుసుకోలేదు. నేను అతన్ని కలుసుకోలేదు.'

లెజ్‌నోవ్ జుత్తు కొనగోళ్ళతో సవరించుకొని, అలిసి పోయినట్లు కుర్చీలో మౌనంగా జేరగిలబడ్డాడు.

'నువ్వు చెప్పిందంతా నిజమే. నువ్వు కల్పించిం దేమీ లేదు. నే నమ్ముతాను. కాని రూడిన్ అంటే నీ కెంతకోపం? ఎంత అసహ్యం? చెప్పిందంతా ఎగతాళిగానే చెప్పావు. అతని జీవితమంతా పరమదరిద్రమైందని, అతనొక నికృష్టజీవియనీ వర్ణించావు. నీకెక్కడా దయాదాక్షిణ్యాలు మచ్చుకైనా లేవే? పిగసోవే అనుకుంటే అతనికన్న ఏడాకు లెక్కువ చదివావు. ఏమినింద! ఎంత పరిహాసం!

లెజ్‌నోవ్ కుర్చీమీదనుంచిలేచి మళ్ళీపచార్లు ప్రారంభించాడు: 'ఒకళ్ళనునిందించే స్వభావంకాదు నాది. రూడిన్‌ని నేనేమీ అనేలేదు...నువ్వు చెప్పిందాంట్లోనూ నిజముండ వచ్చు. దాన్ని కాదనను. నే నలా మాట్లాడేనేమో?

'ఇప్పటికైనా గ్రహించావు. అదేచాలు...ఎప్పట్లా అతనితో స్నేహంగా వుంటానని మాటఇయ్యి. మరికొంత కాలంతాళి అతనంటే నీకున్న అభిప్రాయం మళ్ళీచెప్పు'

'అలాగేలే...పావ్‌లోవిచ్ ! యింతసేపూ వింటూ వూరుకున్నావేతప్ప, ఒక్కమాటైనా మాట్లాడలేదే?'

నిద్రలో ఉలిక్కిపడ్డట్టు పావ్‌లోవిచ్ 'చెప్పడాని కేముందీ? అతనెవరో నాకు తెలియనూ తెలియదు. ఇప్పుడు

నాకు ఒంట్లో బాగానూలేదు.' అన్నాడు.

పావ్‌లోవ్నా తన అన్నగారివంక తేరిపారజూసింది.

'ఈవేళ అదోలా వున్నావేం?'

'తల నొప్పిగావుంది.' అంటూ పావ్‌లోవిచ్ గదిలో నుంచి బయటికి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతున్న అతనివంక యిద్దరూ దృష్టులునిగిడించి అతని హృదయంలో రేగినతుపాను ఏమిటో తమకర్థమైనట్లు ఒకళ్ళ నొకళ్ళు చూసుకున్నారు.

# 6

కనురెప్పపాటులో, రెండుమూడు నెలలకాలం గడిచి పోయింది. రూడిన్ యింతకాలం బయటకు రాలేదు. లాసున్‌స్కయా భవంతిలోనే పొద్దుపుచ్చుతున్నాడు. అతను చెంత లేనిదే ఆమెకు ఏమీ తోచకపోవడమేగాక చెయ్యివిరుచు కున్నట్లు వుంటున్నది. పొద్దస్తమానం దగ్గర కూర్చోబెట్టు కొని తన ముచ్చట్లు చెప్పడం అలవాటైపోయింది. ఈ అల వాటు ఒక వ్యసనంగాకూడా మారింది. రూడిన్ ఒకటిరెండు సార్లు తనవూరు వెళ్ళిపోవాలని ప్రయత్నించకపోలేదు. తెచ్చు కున్న డబ్బు ఖర్చయిపోయిందనీ, యింటికి వెళ్లాలనీ చెప్పాడు. లాసున్‌స్కయా అతనికి అయిదారువందల రూబుల్సుయిచ్చింది. ఇదిగాక పావ్‌లోవిచ్ నడిగికూడా రెండువందలు పుచ్చు కున్నాడు.

మునుపటిలాగ లాసున్‌స్కయా యింటికి పిగసోవ్ రావడంలేదు. అప్పుడైతే కాలుకాలిన పిల్లిలా తిరిగేవాడు. ఇప్పుడు తుపాకిదెబ్బకూడా వినిపించడంలేదు. రూడిన్

జమీందారిణి యింట్లో తిష్ట వేశాడు. అతను మర్రి చెట్టువంటివాడు. మర్రిచెట్టు తననీడను ఏ మొక్కనీ పెరగనీయదు. తను పోట్లపాదువంటివాడు. ఇంకోపాదు ప్రక్కన పెట్టిన పోట్లపాదు కాయదు.

తననీడను పెరగనివ్వక పోవడం అటుంచి గానుగలో చెరుకుగడను తిప్పినట్లు రూడిన్ పిగసోవ్ జలుబునీళ్ళను పిండివేశాడు. రూడినంటే పిగసోవ్ ఎగిరిపడుతున్నాడు. 'వాడో మాయసన్యాసి. నవలల్లో రాస్తారే మనకవులు; అన్నీ తెచ్చిపెట్టుకున్న మాటలేగదా! అంతానటన. తమాషా. ఎం తహంకారం! మాటిమాటికీ 'నేను, నేను;' 'నేను' లేని మాటలేదు' కొండవీటి చేంతాళ్లా ఎంతకీ తెమలవే, ఆ మాటలు! చెప్పేవాడు అతను. వినేది మనం. మనల్ని మాట్లాడనిస్తేగా; కంఠోపాఠం చేసినట్టు గడగడ ఏమిటా ఉపన్యాసం; మనల్ని పొగుడుతున్నప్పుడుకూడా తద్దినం మంత్రాలు చదువుతోన్నట్టుంటుందయ్యా! ఉండుండి తనను తాను తిట్టుకుంటాడు. పైవాళ్లని గుయ్యబడతాడు. ఇట్టే నిరాశ. అట్టే సంతోషం. ఈ క్షణంలోనే ఆత్మహత్య చేసుకుంటానన్నట్టు మొహంపెడతాడు. ఆ మరుక్షణంలోనే ఖుషీరాయుళ్లా నవ్వుతాడు. తప్పతాగినట్టు మాట్లాడతాడేం?' రూడిన్ అంటే భయం పిగసోవ్‌కుమాత్రమేగాక పాండలవిస్కీనికూడా పట్టుకొంది. కాని పిగసోవ్ భయం వేరు. యితని భయం వేరు. గర్భగుడిలో దేవుడిచెంత భక్తుడు నిలబడ్డట్టు పాండలవిస్కీ రూడిన్‌కు జోహారు చేస్తాడు. ఎప్పటికైనా - రూడిన్ తనను కనికరిస్తాడని అతని ఆశ.

ఇక పావ్‌లోవిచ్ ధోరణి యిందుకు పూర్తిగా విభిన్న మైనది. రూడిన్, పావ్‌లోవిచ్‌ల సంబంధం వింతైనది. పావ్‌లోవిచ్ ఎదుటపడితే రూడిన్ అతన్ని ఉబ్బిస్తూవుంటాడు. పావ్‌లోవిచ్ రూడిన్ కనిపించేసరికి అతన్ని చూడనట్లు నటి స్తాడు. రూడిన్ పొగడ్తలంటే అతనికి చికాకు. పొగుడుతూ ఎక్కడ తనను రూడిన్ గోతిలోదింపుతాడో అనేభయం అత నికి లేకపోలేదు. పావ్‌లోవిచ్ బుద్ధికి బృహస్పతివంటివాడని, అతనిచేతికి ఎముకలేదని రూడిన్ పావ్‌లోవిచ్ స్నేహితుల దగ్గర అంటూనేవున్నాడు. అయినా పావ్‌లోవిచ్ మాత్రం, అతనికి దూరదూరంగా, ఎడం, ఎడంగా వుంటున్నాడు. దీనికి కారణం లేకపోలేదు. రూడిన్ రాకమునుపు నటాలియా వేరు. వచ్చాక నటాలియా వేరు. తనపట్ల ఆమె పూర్తిగా మారిపో యింది. తనతో ఎన్నడూ లేనిది ఎరుసెరుసుగా మాట్లాడు తోంది. దీనికిమూలం రూడినేనని అతని అనుమానం. పావ్‌లో విచ్‌పట్ల రూడిన్ అభిప్రాయం చిత్రమైనది. తనకు ఆప్తుడుగా, స్నేహితుడుగా అతన్ని రూడిన్ ఎన్నడూ భావించలేదు. ఒకరికొకరు ఎడమొహం పెడమొహంగావున్నా రోడ్డుమీద తారసపడితే ఒకళ్ళనొకళ్ళు పలకరించుకుంటూరు. మిత్రుల వలెనే ప్రవర్తిస్తారు. ఇది లోకమర్యాద.

బెసిస్టోవ్‌కు రూడిన్ గురుతుల్యుడు. రూడిన్ ద్రోణుడు. తను ఏకలవ్యుడు. అతని పెదవులనుంచి జారిపడ్డ ఏ మాటైనా తనకొక సుభాషితం. కాని బెసిస్టోవ్ అంటే రూడిన్‌కి శిష్య భావంలేకపోగా ఒకవిధమైన నిర్లక్ష్యం. కనిపిస్తే, మాట్లాడా లనివుంటే ఒకసారి పలకరిస్తాడు, లేకపోతే అదీలేదు. ఒకసారి

మాత్రం అతని కెందుకో వాత్సల్యభావం ఉదయించి పక్కన కూచోబెట్టుకొని హితోపదేశం చేశాడు. ప్రపంచం, లోకపు నడక, జీవితం వీటినిగురించి ధారాళంగా ఉపన్యసించి ఉత్సాహాన్ని రేకెత్తించాడు.

లాసున్‌స్కయా యింటికి లెజ్‌నోవ్ అప్పుడప్పుడూ వస్తూ పోతూ వుండేవాడు. అతను వచ్చినప్పుడు, కారణం తెలియదుగాని, రూడిన్ తాబేలులా ముడుచుకుపోయేవాడు.

లెజ్‌నోవ్ రూడిన్ అంటే ఏమీ పట్టించుకునేవాడు కాదు. అతనంటే తనకున్న అభిప్రాయ మేమిటో చెప్పమని పదేపదే కోరినా అతను మౌనంతో ఊరుకున్నాడు. వాసిలోవ్నాకు రూడిన్ అంటే మెప్పు హెచ్చు. లెజ్‌నోవ్ మీద అమితమైన విశ్వాసం.

ఆ మాటకువస్తే లాసున్‌స్కయా యింటిలో రూడిన్‌ను మెచ్చుకోనివాళ్లెవరూలేరు. అతను చెప్పింది వేదం. అతని పలుకు బంగారం. లోపలఉన్న కోరిక ఏమిటో అతను చెప్పకుండానే నౌకర్లు గ్రహించి అన్నీ అమర్చిపెట్టేవారు. అమ్మగారితో చెప్పి ఏం చేయించుతాడోనని భయపడుతూ అడుగులకు మడుగులొత్తేవారు. రోజూ ఏం చేయాలో, రూడిన్ నిర్దేశించేవాడు. విందు చేయాలంటే ముందతని అభిమతం అవసరం. అతనులేని పండుగలేదు. కర్ణుడులేని భారతం, రూడిన్‌లేని ముచ్చట్లు. చిన్నపిల్లలు ఆడుకుంటూవుంటే, ముసలివాళ్లు ముచ్చటగా చూస్తున్నట్లు, విందుల్లో రూడిన్ పాల్గొనేవాడు. చిన్నపిల్లల్ని ఆడించినట్లు వాళ్ళందర్ని ఆడించే

వాడు. ఇంటి వ్యవహారాలేగాక, జమీా వ్యవహారాలుకూడా అతని కనుసన్నలమీాద జరుగాలని తాపత్రయపడేవాడు.

ఏ రైతుమీాద ఏ దావా వెయ్యాలో, భూముల్లోంచి ఏ రైతును తొలగించాలో, డిక్రీలు ఎలా అమలుజరుపాలో సలహాలు యిస్తూ నేవున్నాడు. అతని కుశాగ్రబుద్ధికి లాసున్స్కీయా అబ్బురపడేదేతప్ప, పరిస్థితి చేయిజారిపోనిచ్చేదిగాదు. రూడిన్ చెప్పేది వింటూ మాటలతో మాత్రమే అతన్ని బుజ్జగించేది. వ్యవహారాల దరిదాపులకు అతన్ని రానిచ్చేదేకాదు. దివాణంలోని ముసలిగుమస్తా ఎప్పట్లాగే జమీా వ్యవహారాలు చూసుకుంటూవుండేవాడు. 'మా గుమస్తా అపరచాణుక్యుడు. ఏ వ్యవహారమైనా అతనికి పేలపిండి' అనేది లాసున్స్కీయా.

గంటల తరబడి రూడిన్ లాసున్స్కీయాతోనూ, నటాలియాతోనూతప్ప యింకెవరితోనూ సంభాషించేవాడే గాదు. నటాలియాకు పుస్తకాలు యిస్తూ తన ఆశయాలు ఏమిటో చెప్పేవాడు. తాను వ్రాయబోయే వ్యాసాలు, గ్రంథాలను గురించి వర్ణించేవాడు. రెండుమూడు పేజీలు చదివి వినిపించేవాడు. నటాలియా వినేదేగాని ఆమెకు ఏమీా బోధపడేదేగాదు. బోధపడకపోయినా రూడిన్ చదవడం మానేవాడుగాదు. నటాలియాతో రూడిన్ అంత చనువుగా వుండడం, లాసున్స్కీయాకు ఒక్కొక్కప్పుడు అయిష్టంగానే ఉండేది. కాని మనస్సుని సంబాళించుకునేది. 'పల్లెటూరు పిల్ల దానికేం తోస్తుంది? ఎలాగోలాగ కాలక్షేపం గానియ్. యిందులో ప్రమాద మేముందీ? బస్తీలో అయితే వేరు.'

కాని తనకూతురు విషయంలో లాసున్స్కయా పొర పడిందనే చెప్పాలి. రూడిన్‌తో నటాలియా ఊసుపోక మాట్లాడడంలేదు. అతనుచెప్పే ప్రతిమాటకూ, అర్థాలను వెతుకుతూ ఆమె వింటున్నది. ఇదమిద్ధమని అతనుచేసే నిర్ణయాలు ఆమెభావాలను కలవరపరుస్తూనే వున్నాయి. మధ్య మధ్య ప్రశ్నలు వేస్తూ, సందేహనివృత్తి చేసుకుంటూనేవుంది. తోటలో పూలపందిరిచెంత కూర్చొని అతను మహాకవుల కావ్యాలను గానంచేస్తూ క్లిష్టమైన పద్యాలను సుబోధకం చేస్తూవుంటే, ఆక్షణం మరి తిరిగిరాదనిపించేది. జర్మనుకవుల కవితాశక్తి, శృంగారపోషణాశక్తి, తాత్వికదృక్పథం రూడిన్ బోధిస్తూవుంటే, నటాలియాకు దేవనగరిలో పాదంపెడుతున్న ట్లనిపించేది. అద్భుత సౌందర్యమయ జగత్తులో తానుఉంటున్న ట్లనిపించేది. చేతిలో పుస్తకంపట్టుకొని రూడిన్ పద్యాలను చదువుతూవుంటే, అవి రెక్కలువిప్పి ఆమె మనోవీధిలో విహరించేవి. ఏదో అవ్యక్తానుభూతి, ఆనందం మహోద్రేకం హృదయంలో సెలఏరువలె ప్రవహిస్తూవుండేది.

ఒకసారి నటాలియా, రూడిన్ మేడమీది గదిలో కూర్చున్నారు. దూరంగా బెసిస్ట్రోవ్ పరధ్యానంగా చదువు కుంటున్నాడు. కిటికీలోంచి చూస్తూ నటాలియా రూడిన్‌ను 'ఈ శీతాకాలంలో మీరు పీటర్సుబర్గులోనే వుంటారను కుంటాను. అంతేనా?' అని ప్రశ్నించింది.

మోకాళ్ళమీద తెరచివున్న పుస్తకాన్ని ముడుస్తూ, రూడిన్ 'ఇప్పుడప్పుడే ఎలా చెప్తాను? అవకాశముంటే అక్కడే గడుపుతాను.'

'అవకాశం ఉంటుందనే అనుకుంటాను.'

'మీ కలా అనిపించడం సహజం.'

నటాలియా ఏదో అనాలనుకుని తనను తాను తమా యించుకుంది. రూడిన్ కిటికీలోంచి చూస్తూ తోటలో విరగ కాసి వంగిపోయిఉన్న యాపిల్ చెట్టును చూపించాడు.

'అటు ఒక్కసారి చూడండి. ఎలా విరగ్గాసిందో! తాను పూసి, కాసిన కాయల బరువుకే అది వంగిపోయింది. లోకంలో మహామేధావుల లక్షణమే అది.'

'అది వంగిపోయిందంటే కారణం, దానికి దాపేమీ లేకపోవడమే. కిందను రాటపెడితే సరిపోతుంది.'

'నిజమే నటాలియా! మీరు చెప్పింది నిజమే. కాని మనిషికి జీవితంలో తోడు దొరకటం అనుకున్నంత సులభం కాదుగదా? చెట్టుకు రాటైతే యిట్టే తెచ్చిపెడతాం.'

'ఇతరుల సానుభూతి నాకెలా అనిపిస్తుందంటే – ఏమై నప్పటికీ మనిషికి 'నా' అనే తోడునీడ లేకపోవడం...'

నటాలియామాటలు గొంతులోనే ఆగిపోయాయి. తాననే మాటేదో పూర్తిచేయకుండానే మధ్యలోఆపి వేసింది. ఆపివేసి యిలా ప్రశ్నించింది. 'వచ్చే శీతాకాలంకూడా పల్లె టూళ్ళోవుండి మీ రేమిచేస్తారు?'

'చెయ్యడానికి చాలా పనులున్నాయి. నేను రాస్తున్న వ్యాసం మీకు తెలుసుగదా. సగంలో ఆగిపోయింది. అది పూర్తిచేస్తాను. రానేవ్యాసం చాలా గొప్పదే. జీవితంలోనూ, కళలలోనూ ఉన్న విషాదఛాయల గురించి నావ్యాసంలో

చర్చించబోతున్నాను. ఎలాఎలా రాస్తున్నానో, నిన్న మీకు చెప్పానుగదూ? పూర్తి అవగానే చదివి వినిపిస్తాను.'

'దాన్ని అచ్చువేయిస్తారా?'

'ఊహూ!'

'అయితే, దాన్ని ఎందుకు రాసినట్టు?'

'మీరుచదివితే చాలదూ? అదే నాసంతృప్తి.'

నటాలియా కనురెప్పలను దించుకుంది. 'అంతటితో సంతోషించమంటే గొప్ప త్యాగమన్నమాటే!'

రూడిన్ ఏదో వ్యాసం వ్రాశాడనేమాట వినబడి బెసిస్టొవ్ అటు తలతిప్పి 'దేనిమీద వ్రాశారండి ఆ వ్యాసం? పేరు?' అని ప్రశ్నించాడు.

'జీవిత కళాంతర్గత విషాదఛాయలు, అదీవ్యాసంపేరు' అంటూ రూడిన్ బెసిస్టొవ్‌కు వినిపించేటట్టు నటాలియాతో యిలా చెప్పాడు. 'వ్యాసాన్ని, బెసిస్టొవ్‌కూడా చదువుతాడు. కాని యింకా రాయబోయేవిషయం పట్టుబడిందిగాదు. ప్రధాన సూత్రం తికమకలు పెడుతోంది. ప్రేమలోఉన్న విషాదం యొక్క ప్రత్యేకత ఏమిటి? అనేచోట, గడ్డుగావుంది. ఈవిషయం తేలక, తికమకలు పడుతున్నాను.' ప్రేమ! అనే మాటవిని, యింతసేపూ మరోగదిలోఉన్న పంతులమ్మ యివతలికి వచ్చింది. గొడుగంటే బెదిరిపోయే గొడ్డులా, ప్రేమఅనే మాటవిని పంతులమ్మ బెదిరిపోయింది. పెదాలను కొరుక్కుంటూ గాభరాగా అటూ యిటూ తిరుగుతోంది.

రూడిన్ తనప్రసంగాన్ని కొనసాగిస్తూ ఆలోచనగా యిలా అన్నాడు. 'రాయబోయేవిషయం జటిలమైంది.

ప్రేమలో దాగిఉన్న విషాదం అంటే ఏమిటి? యీ ప్రశ్నను వ్యాసంలో ఎలా ఎదుర్కోవాలి? అదే యిప్పుడు నన్ను పట్టుకొని వేధిస్తున్న సమస్య.'

'నాకు తెలిసినంతవరకూ ప్రతిఫలశూన్యమైన ప్రేమ విషాదాంతమౌతుంది.'

'కాదు. కాదు. అదెన్నటికీ కాదు. ఈ సమస్యని యింకొక దృక్కోణంలోంచి చూడాలి. ఈ విషయాన్ని మనం లోతుగా పరిశీలించాలి. ప్రేమ!...ప్రేమనేది మొదటినుంచీ తుదిదాకా నిగూఢమైంది. అవ్యక్తమైంది. అది దురవగాహం. అది ఎలా పుడుతుంది? ఎలా వ్యక్తమౌతుంది? ఎలా పెరుగుతుంది. ఎలా మాయమౌతుంది? యిదంతా చిత్ర విచిత్రమైనదే. ఉన్నట్టుండి వసంతకాలంలా ఒక్కసారి హృదయంలో ప్రేమ ఉదయిస్తుంది. అప్పుడు కలిగే ఆత్మానందానికి అంతువుండదు. యిలా పుట్టిన ప్రేమ కొంతకాలం హృదయంలో నివురుగప్పిన నిప్పులా అణిగివుంటుంది. కొంచెం ఊదేసరికి, కణకణమండే అగ్నిలా ప్రజ్వరిల్లుతుంది. నాగుపాములా బుసలుగొడుతుంది. ఉన్నట్టుండి హృదయంలోంచి అదృశ్యమౌతుంది. ఇది చాలా క్లిష్టమైన సమస్య. ఈ రోజుల్లో ప్రేమించడానికి ఎవరు సాహసిస్తారు?'

రూడిన్ కలలో నడిచివెడుతున్నట్టు మాట్లాడుతున్నాడు. నటాలియా ఏమీ సమాధానం యివ్వలేదు. ఉన్నట్టుండి రూడిన్ 'చాలా విచిత్రంగా వుందే? పావ్‌లోవిచ్ కనుపించడమే మానేశాడు' అన్నాడు. నటాలియా మోము ఎర్రబడింది. కిటికీ ఊచలగుండా తల ఆనించుకుంది.

ఎందుకు రావడంలేదో కారణం తెలియడంలేదు.'

రూడిన్ కుర్చీలోంచి లేస్తూ 'చాలా గొప్పమనిషి. ఇంతమందిని చూచానుగాని అతనిలాంటివాడిని చూడలేదు.'

పంతులమ్మ అతనివంక విసురుగా చూసింది. రూడిన్ గదిలో అటూ యిటూ తిరుగుతూ 'మీరెప్పుడైనా చూశారా?' అంటూ తోటలోనిమర్రిచెట్టువంక చూపించాడు. 'అది మహావృక్షమేమరి. కొమ్మలు, వూడలు, కొమ్మలనిండా ఆకులు. అయితేనేం? ఆకులన్నీ వసంతకాలం వచ్చేముందు జలజలా నేలమీద రాలి పడిపోతాయి. చెట్టు చిగిర్చేకాలానికి, యిదివరకున్న ఆకులన్నీ రాలిపోవలసిందే. చెట్టు పాత ఆకును విడుస్తుంది; కొత్త ఆకును చిగురుస్తుంది.'

'ఆకులు రాలిపోవడం, చెట్టు చిగిర్చడం చాలాసార్లు చూశాను.'

'అంతే. ప్రేమకూడా అంతే. కొత్తగా చిగుర్చిన ప్రేమ పాతప్రేమను పోగొడుతుంది. పాతప్రేమ నశించిపోయినా దాని ఛాయలుమాత్రం హృదయంలో వుంటూనే వుంటాయి. కొత్తప్రేమ చిగిర్చి పల్లవించేసరికిగాని, దాని ఛాయలు పూర్తిగా పోవు.'

నటాలియా అతని మాటల్లోని ధ్వనిని గ్రహించుకొని నిరుత్తరఅయింది. 'యిలా మాట్లాడంలో అతని వుద్దేశమేమిటి' అని ప్రశ్నించుకుంది. రూడిన్ కొంచెంసేపు నిలబడి ఆమె ముఖలక్షణాలను గమనించాడు. ముందుపడుతున్న జుత్తును వెనక్కు దువ్వుకుంటూ బయటికి వెళ్ళిపోయాడు

నటాలియా తన గదిలోనికి వెళ్ళి పరుపుమీద కూల బడింది. 'పాతప్రేమను కొత్తప్రేమ తుడిచిపెడుతుంది' అనే రూడిన్ మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి. గుండెలను బరువెక్కిస్తున్నాయి. పరుపుమీద వాలింది. మళ్ళీ లేచింది; కూర్చుంది. కణతలు పట్టుకొంది. నిట్టూర్చింది. దుఃఖం పొంగుకువచ్చింది. కళ్ళమ్మట నీళ్లుకారి బుగ్గలమీద పడుతూ చారలుకడుతున్నాయి. కళ్ళను తుడుచుకొని, దుఃఖాన్ని ఆపుకునేందుకు ప్రయత్నించింది. ప్రయత్నిస్తున్న కొద్దీ దుఃఖం పొంగుకువస్తోంది.

♦ ♦ ♦

అదేరోజున వాసిలోవ్నా లెజ్నోవ్‌తో మళ్ళీ రూడిన్ ప్రస్తావన తీసుకువచ్చింది. రూడిన్ విషయం మాట్లాడటం అతని కిష్టంలేదు. అయినా తప్పిందిగాదు. 'నాకు తెలుసును. నీకింకా పూర్వంలాగే రూడిన్‌మీద ద్వేషం. అందుకే యిన్నాళ్లూ అతనిమాట నీ దగ్గర ఎత్తలేదు. అతనంటే, నీకెందు కింత అసహ్యమో తెలుసుకోవాలనుంది నాకు' అంటూ పావ్‌లోవ్నా అతన్ని వొత్తిడి పెట్టింది. 'సరే నీయిష్ట మొచ్చినట్టే కానియ్యి. అలాగే కానియ్యి. కాని కోపంమాత్రం తెచ్చుకోకు.'

'కోపం తెచ్చుకోను. చెప్పే దేదో చెప్పు'

లెజ్నోవ్ సోఫామీద సర్దుకుని కూర్చున్నాడు.

'మొదటి సంగతి. అతనంటే సుతరామూ నాకు యిష్టంలేదు. ఈ సంగతి నీకు ముందు స్పష్టంచేయాలి ... రూడిన్ చాలా తెలివైనవాడే. సందేహంలేదు.'

'నేనూ అలాగే అనుకుంటున్నాను.'

'తెలివితేటలంటే అలాంటి, యిలాంటి తెలివితేటలు గాదు. కాని విద్యాపరిజ్ఞానం శూన్యం. ఉట్టి డొల్లుపుచ్చకాయి. మేడిపండు.'

'ఏవన్నీ కవిత్వంలోమాటలు.'

'విద్యాగంధం మనిషికి లేకపోతే అందులో అపకార మేమీలేదు. ఆమాటకొస్తే మనంమాత్రం జ్ఞానులమా? రూడిన్ తన నిరంకుశభావాలను హృదయంలోనే కప్పిపుచ్చు కుంటాడు. పనిపాటలంటే వంటికి పడదు. మీరంతా అనుకుం టున్నట్టు గొప్ప శాస్త్రాలు, తత్వాలు చదువుకున్నవాడు గాదు. అందు కతన్ని నేను ఏమీ తప్పుపట్టటంలేదు.'

పావ్లోవ్నా హఠాత్తుగా ప్రశ్నించింది. 'రూడిన్! బాగా చదువుకున్నవాడు గాదూ?'

'ఏమీకాదు. వట్టి యిచ్చకాలరాయుడు. మనిషి ఎదట ఒకమాట, వెనకాల యింకొకమాట. బులిబుచ్చకాయ లాడి మనుష్యుల్ని చదరంగంపావులుగా ఆటాడడం అతనికి సరదా. ఈ జూదంలో అతనికి పోయేదేమీలేదు. పోయేదల్లా కొన్ని జీవితాలు మాత్రమే...'

'ఏమి టంటున్నావు? ఎవరిజీవితంతో అతను జూద మాడుతున్నాడు?'

'ఆడితే ఆడనియ్యి...ఈ జూదంలోకూడా అంతా మోసమే. మనిషనేవాడికి, తను మాట్లాడుతున్న దేమిటో తెలిసుండాలి. అందులోనూ తెలివితేటలున్న రూడిన్‌లాంటి వాడికి. మంచి వక్తే. నేను కాదనడంలేదు. కాని అలాంటి

మాటలు, ఎవరో చిన్నపిల్లాడు మాట్లాడితే అందంగా వుంటాయి. అన్నేళ్ళొచ్చి, అలా మాట్లాడుతూ, తనమాటలను తానే ముగ్ధుడౌతూ రూడిన్ ఏదో ఒగగబెడుతున్నాననుకుంటున్నాడు. ఎందుకంత మిడిసిపాటు; దేన్ని చూసుకొని?'

'వినేవాళ్ళతత్వాంబట్టిఅతనిమాటలలాఅనిపిస్తాయేమో?'

'క్షమించు పావ్‌లోన్నా. వినేవాళ్ళ తత్వాంగాదు. చెప్పేవాళ్ళనుబట్టి ఉంటుంది. ఒకమనిషి ఒకమాట నాతో అన్నాడనుకుందాం. ఆమాట విని నే నెక్కడలేని ఉద్రేకం, ఉత్సాహం తెచ్చుకోవచ్చు. అదేమాట మరోమనిషి మాట్లాడితే నాకే ఉత్సాహం కలుగకపోవచ్చు. కొందరు మాట్లాడుతూవుంటే మనం అసలు వినడానికే కుతూహలపడం. ఈ వ్యత్యాసం ఎందుకొచ్చిందంటావు.?'

'అది నీ అనుభవం కాబోలు.'

'అవును. కొందరు మాట్లాడుతుంటే వినిపించుకోమన్నా వినిపించుకోను. చెప్పొచ్చే దేమంటే, రూడిన్ మాట్లాడేదంతా వట్టి ఊక. అతనిమాటలు వేరు, చేతలు వేరు. మాట్లాడినట్టు ఎప్పుడూ చేయడు. అయితేనేం? అతనిమాటలు చిన్నపిల్లల్ని ఉత్సాహపరుస్తాయి. చెడపనూ చెడుపుతాయి.'

'అతనిమాటలు ఎవరిని చెడుపుతున్నాయి?'

'స్పష్టంగా చెప్పితేనేగాని గ్రహించలేవులాగుంది. నటాలియాతప్ప చెడిపోయేవాళ్ళు మరెవరున్నారు?'

పావ్‌లోన్నా విస్మయంతోచూసి మౌనంగా కొంత సేపు ఊరుకొని, చిరునవ్వు నవ్వుతూ యిలా అంది. 'ఇదా, ఆఖరికి నువ్వు చెప్పొచ్చినమాట? ఎప్పుడూ నీ విలాంటి

ఆలోచనలే. నటాలియా చెడిపోతుందని ఎలా అనుకున్నావు? ఆమెచూస్తే చిన్నపిల్ల. అదీగాక అన్నింటికీ రక్ష రేసులా తల్లి ఉండనేవుంది.'

'ఆ భావమే లాసున్‌స్కీయాకీ ఉంది. భావమేగాదు. అహంకారంకూడా. అరునూరైనా, నూరుఆరైనా తనపిల్లలు చెడిపోగని ఆమె భావం. అంతకట్టుదిట్టంగా వుంచుతున్నానని అహంకారం. ఇలా కళ్లెత్తి చూస్తే పిల్లలు గజగజ లాడిపోతారని, కట్టుఖాయదాల్లో ఉంటారని ఆమె అనుకుంటుంది. ఎప్పుడో ఒకప్పుడు కొంప ఎలాగా మునుగుతుంది. నటాలియా యింకా చిన్నపిల్లేనని నువ్వూ అనుకుంటున్నావా? ఆమెకూ అనుభూతులంటూ వున్నాయి. అవి నీకూ, నాకు ఉన్న అనుభూతుల్లాంటివే. అలాంటి పిల్ల, అభంశుభం ఎరగనిపిల్ల ఒక పోకిల్లా ఎదుటపడితే ఇక అడిగేవా? అతనితో సాయిలా ఫాయిలాగా తిరగనిస్తే ఆడపిల్ల లేవగా తారు?'

'పోకిల్లా! రూడిన్ పోకిల్లా పురుషుడా?'

'అవుననే అంటున్నాను. మరి కాకపోతే లాసున్‌స్కీయా యింట్లో అతనేమిటి ఒరగబెడుతున్నట్టు? ఆ ఇంట్లో అతను దేవుడు. వేరే దేవతార్చన అక్కర్లేదు. అతను కలగజేసుకోని వ్యవహారమంటూ లేదు. సంసారవిషయాల్లో కూడా అతనే. అది తగుమనిషి లక్షణమే నంటావా?'

'ఈవేళ ఎందుకంత ఉద్రేకపడుతున్నావ్ లెజ్‌నోవ్? అతనంటే తోకతొక్కిన తాచులా ఎగిరిపడుతున్నావు? ఏదో తగిన కారణం ఉండి వుండాలి.'

'నిజమాడితే నిష్ఠూరమే లే. ఆడవాళ్ళతో మరీని. ఎంత యుక్తంగా మాట్లాడినా, అలా ఎందుకు మాట్లాడాలనీ, యింకోలా ఎందుకు మాట్లాడగూడదనీ ఆడవాళ్లు కారణాలు వెతుకుతూనే వుంటారు.'

స్త్రీ జాతిమీద లెజ్‌నోవ్ విసిరిన విసురుకు పాన్ లోవ్నా కొంచెం మండిపడింది.

'ఆహా! ఎంత చక్కగా మాట్లాడుతున్నావు లెజ్ నోవ్! ఆడవాళ్ళను ద్వేషించటం, పిగసోవ్ దగ్గర నేర్చు కుంటున్నావు కాబోలు. సరే. నీ యిష్టం. దానికేం లే. కాని మనిషిని చూసీచూడగానే, అతని తత్వం అంత త్వరగా గ్రహించడం కష్టం. నువ్వు అలా గ్రహిస్తావన్నా నేను నమ్మేదిలేదు. రూడిన్ నువ్వు అన్నట్టు దుర్మార్గుడు కాదన కుంటాను. మంచిమనిషిలాగే కనిపిస్తాడు' అంది.

'అతన్ని నేనేమన్నా నీ మనస్సుకు నొప్పి కలుగు తోంది గామోసు. నేను నిజం మాట్లాడుతున్నాను. రూడిన్ అంటే అంత కఠినంగా మాట్లాడేహక్కు నాకుంది. ఇందుకు తగిన మూల్యం యిదివరకే చెల్లించాను. అతని అట్టుగుట్టు అనవాళ్లన్నీ నాకు తెలుసును. మేమిద్దరం ఒకేచోట చాలా కాలం ఉన్నాం. ఇదివరకోసారి చెప్పాను నీకు. మాస్కోలో మేం ఎలా గడిపిందీ చెపుతానన్నాను గుర్తుందా?'

'అన్నావు, కాని చెప్పలేదు'

'ఇప్పుడు చెప్పనా?'

'చెప్పు, వింటాను'

లెజ్నోవ్ సోఫాలోంచి లేచి గదిలో పచార్లుచేస్తూ మధ్యమధ్య ఆగుతూ పావెల్‌లోవ్నావంకచూస్తూ మాస్కో విశేషాలు చెప్తున్నాడు.

ఈసంగతి నీకు తెలుసనుకుంటాను. నా చిన్నతనం లోనే మాఅమ్మా. నాన్నా పోయారు. మాస్కోలో మా మేనత్తఉండేది. అవిడ నన్ను పెంచింది. పదిహేడే ళ్ళొచ్చేసరికి, ప్రపంచమంటే నాకో వింత. అంతా నాదే. నేను చేయలేని దేమిటీ? అనేభావం కలిగేదశ అది. మాట్లాడట మన్నా, ప్రగల్భాలు చెప్పుకోవడమన్నా సరదాగా వుండేది. ంబు, దర్పం ఎక్కువగా వుండేవి. ఆ వయస్సులో యూనివ ర్సిటీలో ప్రవేశించాను. నిజానికి ప్రపంచమేమిటో తెలియని రోజులు. తెల్లనివన్నీ పాలనీ నల్లనివన్నీ నీళ్ళనీ అనుకునే వాడిని. అలాఅనుకునే అప్పుడో చిక్కులోపడ్డాను. అదేమిటో యిప్పుడుగాదు, తర్వాతచెప్తాను. తప్పించుకుందుకు ఆడగూ డని అబద్ధమాడేశాను...కాని నా నేరమేమిటో రుజువైంది. పదిమందిలోనూ వీధినిపడ్డాను. అంతా ఎగతాళిచేశారు. అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకుందామనుకున్నాను. తోటివిద్యార్థులమధ్య అంత అవమానాన్ని ఎలాభరించడం? కాని ఎవరూనన్ను ఓదార్చలేదు. ధైర్యంచెప్పలేదు. ఒక్కడు... దీపం పెట్టాక అతనిపేరు తెలుచుకోవాలి. అబద్ధమాడినందుకు కోపగించినా, తరువాత నన్ను బుజ్జగించాడు. ఓదార్చాడు. తన గదిలోకి తీసుకువెళ్ళాడు.'

'అతను రూడినేనా?'

'కాదు. రూడిన్ గాదు. అతను మరో మనిషి... పాపం చనిపోయాడు. చాలా నెమ్మదైనవాడు. దయార్ద్రహృదయుడు. పేరు పొకోర్స్కి. అతన్నిగురించి చెప్పాలంటే మాటలు చాలవు. అతని పేరెత్తి, యింకో విషయం మాట్లాడలేను. వెన్నలాంటిమనస్సు. ఇట్టే కరిగిపోతుంది తెలివితేటలు చెప్పలేం. ఒక పాడుపడిన యింట్లో, మూలగదిలో వుంటూవుండేవాడు. నిరుపేద. నాఅన్న వాళ్ళెవరూ లేరు. వారాలుచేసుకొని, ప్రయివేటు చెప్పుకొని కష్టపడి చదువుకున్నాడు. కాఫీకూడా తాగేవాడు కాడు. అతనిగదిలో ఎప్పుడూ విద్యార్థులే. అతనంటే అందరికీ ప్రేమ. అన్నదమ్ముడులా వుండేవాడు. బూజుపట్టి గదిఎంత చికాకుగావున్నా అతనిముందు అక్కడ కూచోడమంటే ఎంత హాయిగా వుండే దనుకున్నావు? ఆ గదిలో రూడిన్‌ను నేను మొదటిసారి కలుసుకున్నాను.

'అంతమంది అక్కడ చేరడానికి ఏమిటి కారణం? పొకోర్స్కి అంటే అందరికీ ఎందుకంత ప్రేమ?'

'అతన్లో విశేష మేమిటో మాటల్లో వర్ణించలేం. ప్రతివిషయాన్ని అతను చిత్తశుద్ధిలో చూసేవాడు. కవిలా భావించేవాడు. అతని స్వభావం సూదంటురాయిలా మనల్ని ఆకర్షించేది. అఖండమైన ప్రజ్ఞ, ప్రజ్ఞనుమించిన ప్రవర్తన. మాట్లాడుతున్నప్పుడు అచ్చంగా చంటిపిల్లవాడే. ఆమాటలు, ఆ నవ్వూ, యిప్పటికీ నాకు వినిపిస్తూ నేవున్నట్టుంది. మర్చిపోదామన్నా మర్చిపోలేను.'

'అతను మాట్లాడితే ఎలా వుండేది?'

'మనస్సులో కులాసాగా ఉన్నప్పుడు బాగానే మాట్లాడేవాడు. కాని అద్భుతం అని చెప్పలేం. అప్పటికే మా అందరిలోకి రూడిన్ గొప్ప ఉపన్యాసకుడు. పొకోర్స్కీ కంటే పదిరెట్లు ధాటీగా మాట్లాడేవాడు.'

'ఇద్దరికీ ఉన్న పోలిక లేమిటీ?'

పచార్లు చేస్తున్న లెజ్‌నోవ్ ఆగిపోయి రెండు చేతులను గుండెలకు ఆనించుకొని 'ఇద్దరికి పోలికలేమీ లేవు. రూడిన్ మాట్లాడుతుంటే తళుక్కుమని మెరిసినట్లుండేది. పిడుగులు, ఉరుములు ఉపన్యాసంలో జాస్తి. వానమాత్రం పడదు. మాటల్లో ఉత్సాహం హెచ్చు. పొకోర్స్కీకంటే అతనే తెలివైనవాడని అనిపించేది. కాని సరిపోల్చిచూస్తే అతని ముందు రూడిన్ దిష్టిబొమ్మ. ఒక అభిప్రాయాన్ని పెంచి పెద్దచేసి చెప్పడంలో రూడిన్ దిట్ట. వాదించడంలో చతురుడు. కాని అభిప్రాయాలుమాత్రం తనవికావు. రూడిన్ గుడ్డ, కొలతలు యిస్తే ఆదిప్రకారం కుట్టే దర్జీవంటివాడు. ఇతరుల అభిప్రాయాల్ని తన స్వంతమే నన్నట్లు దబాయించేవాడు. ముఖ్యంగా పొకోర్స్కీ అభిప్రాయాల్ని తన స్వంతం చేసుకునేవాడు. పొకోర్స్కీ తరహా వేరు. మిన్ను విరిగి మీదపడ్డా చలించేవాడుగాదు. నిశ్చలంగా ఉండేవాడు. మనిషి మెత్తన. అయితే ఆడవాళ్ళంటే వెర్రివ్యామోహం. సందడిగా కోలాహలంగా ఉండటమంటే ప్రీతి. ఎవరేమన్నా చలించేవాడుగాదు. రూడిన్ నిప్పులాగ ప్రజ్వరిల్లేవాడు. ధైర్యం, ఉత్సాహం, నవజీవనం ఉట్టిపడుతూ మాట్లాడేవాడు. పైకి అతను ఉష్ణప్రవాహం. లోపల శీతలప్రవాహం. అంతా మేక

పోతు గాంభీర్యం. తన ఆత్మాభిమానానికి గాయం తగిలితే విపరీతంగా బాధపడేవాడు. కొట్టవస్తున్నట్లు మీదపడేవాడు. మనుష్యుల్ని తనగుప్పిట్లో పెట్టుకొని ఆడించాలని తాపత్రయం. అస్పష్టమైన కవిత్వంలాంటి ఉపన్యాసాలతో సమ్మోహ పర్చేవాడు. అతనంటే అందరికీ ఆకర్షణ. కాని ఎవరికీ ప్రేమ లేదు. నేనొక్కణ్ణే ఆ రోజుల్లో అతనికి ఆప్తుణ్ణి. ఒక్కొక్క ప్పుడు అతనంటే విద్యార్థులు విసుక్కునేవారుకూడా. పొకో స్కీ అంటేమాత్రం ప్రాణం పెట్టేవారు. రూడిన్ అందరి తోనూ మాట్లాడేవాడు. వాదించేవాడు. పెద్ద చదువుకున్న వాడు కాదు. కాని పొకోర్స్కీకంటే, మాకంటే చదువులో నయం. ఆలోచించనిదే ఏ పని చేసేవాడుగాదు. ఆలోచనంతా క్రమబద్ధం. జ్ఞాపకశక్తి అపరిమితం. పదేళ్ళక్రిందట తీర్థంలో చూచిన మనిషినికూడా ఇట్టే ఆనవాలుపట్టేవాడు. అతని తెలివితేటలకి, జ్ఞాపకశక్తికి యువకులు అచ్చెరువుపొందేవారు. అతనిచుట్టూ చేరేవారు. సలహాలు అడిగేవారు. ప్రపంచ విషయాలమీదకూడా రూడిన్ అభిప్రాయాలేమిటో, సిద్ధాంతాలేమిటో తెలుసుకోగోరేవారు. రూడిన్ చెప్పిన తీర్పులూ, నిర్ణయాలు తప్పులతడకలైనాసరే, అతనంటే వాళ్లకో వెర్రి. ఒక విషయం నాకు పూర్తిగా తెలియదని, మనం యువకులతో అంటే అది సత్యమని తెలిసికూడా మనల్ని వాళ్లు హర్షించరు. అన్నీ మనకు తెలిసినట్లు నటిస్తేనే ఆకర్షణ. ఆకర్షణకోసం మనం ఒకళ్లని మోసం చేయలేం. రూడిన్ మాత్రం అలాగాదు. తనకు తెలియని విషయమైనా పెద్ద తీర్పరిలాగ అందులో జొరబడతాడు. అందుకే అతని

కంత ప్రభావం. ఆ రోజుల్లో రూడిన్ తత్వశాస్త్ర గ్రంథాలను విపరీతంగా చదివేవాడు. ఒక్కసారి పుస్తకాన్ని చూస్తే అందులోని నిగూఢ రహస్యాలన్నీ తనకు అవగతమౌతాయని అతనికో అహంకారం. ఇకేముంది? ఆ విషయంమీద తర్జన భర్జనలు చేస్తూ, కొత్తకొత్త, లేనిపోని తత్వాలను చెప్తూ కూర్చునేవాడు. మేమంతా పైలాపచ్చీసు కుర్రవాళ్ళం. తెలుసున్నది తక్కువ. రూడిన్ చెప్పేది మాకు వేదం. తత్వశాస్త్రం, విజ్ఞానం, కళ, జీవితం, ఈ మాటలు వింటూంటే మాకు ఏమిటోగా వుండేవి. వాటి తత్వమేమిటో మాకు తెలిసేదిగాదు. ప్రపంచాన్ని నడుపుతున్న మూలశక్తి ఏది? కళలకు, తత్వశాస్త్రాలకు సంబంధమేమిటి? ఏ సిద్ధాంతాల మీద ఆధారపడ్డాయి? యిత్యాది ప్రశ్నలన్నీ మమ్మల్ని వేధించేవి. గంటలతరబడి చర్చించినా మాకేమీ బోధపడేదిగాదు. వెంటనే రూడిన్ దగ్గరకు వెళ్ళేవాళ్ళం. రూడిన్ విపులంగా యీ విషయాలన్నింటిని చర్చిస్తూ, చెప్పేవాడు. ఇంత జటిలమైన సమస్యలూ అవలీలగా అవగాహన అవుతున్నట్లు మాకనిపించేది. ప్రకృతి రహస్యాలన్నీ అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్లు, రూడిన్ బోధించేవాడు. ఇంతకు ముందు అవన్నీ విరజిమ్మిన పూసలు. ఇప్పుడు చక్కగా గుచ్చిన దండ. ప్రకృతిలో దృగ్గోచరమౌతున్న విషయాల పరస్పర సంబంధం, సౌందర్యతత్వం, కార్యకారణ సంబంధం, కేవల భావం; యివన్నీ మాకు కొట్టినపిండే. కేవల సత్యమంటే ఏమిటో, ఈ ప్రపంచంలో మానవుడు ఎందుకు జన్మిస్తాడో, మానవలక్ష్య మేమిటో రూడిన్ మాకు చెప్పేవాడు...ఇన్ని

విషయాలు అంత చిన్నవయసులోనే మేం గ్రహించామని చెప్తూవుంటే నీ కిప్పుడు నవ్వుతాలుగా లేదూ?'

'పరిహాసం దేనికి?'

'అదంతా చిన్నప్పటిసంగతి. ఆకతాయితనం. ఇప్పుడవన్నీ తలుచుకుంటే నాకే నవ్వొస్తోంది. ఆ రోజుల్లో రూడిన్ మాకు వశిష్ఠుడు. ఇందుకు మేం చాలా రుణపడి ఉన్నాం. పోకోర్స్కి-ది దివ్యమైనఆత్మ. మాలో ఆత్మవిశ్వాసము, దీక్ష, ధైర్యం అతని సాంగత్యంవల్లనే కలిగేయి. కాని ఒకొక్కప్పుడు మౌనంగా మహర్షిలా కూర్చునేవాడు. వంట్లో చెప్పుకోదగ్గ శక్తిలేదు. నీరసంగా ఉండేవాడు. కాని ఎక్కడలేనిశక్తిని తెచ్చుకొని అప్పుడప్పుడూ ప్రపంచవిషయాలు మాట్లాడుతూవుంటే... ఏమనిచెప్పను? రెక్కలు విప్పి ఎగురుతున్న విహంగమే అతను. తెలియని నీలిఆకాశాల్లో అంతరిక్షంలో ఎగిరేవాడు. కాని, రూడిన్ మాత్రం అన్నివిషయాల్లోనూ వేలుపెట్టేవాడు. జన్మతః తనొక రాజకీయవేత్త ననిపించేవాడు. ప్రతిదానికీ నిర్వచనం, సిద్ధాంత ప్రతిపాదన, వివరణ. ఇది అప్పటి రూడిన్‌మాట. ఊహు, ఇప్పుడుకూడ అలాగేవున్నాడు. ముప్పైఏళ్ళొచ్చినా అవే ఆదర్శాలు. మార్పేమీ లేదు.'

లెజ్‌నోవ్ గదిలో పచార్లుచేస్తూంటే నవ్వుతూ పావ్లోవ్నా 'నువ్వు పచార్లుచేస్తూవుంటే నాకు కాళ్ళునొప్పి పెడుతున్నట్టుంది. ఈ కుర్చీలో కూచోరాదూ?' అంది.

లెజ్‌నోవ్ కుర్చీలో కూర్చుంటూ మళ్ళీ ప్రసంగం ప్రారంభించాడు.

'పొకోర్స్కీ సాంగత్యంవల్ల నే నేనెంతో మారిపోయాను. మళ్ళీ జన్మఎత్తాననిపించింది. మర్యాద, వినయం అలవర్చుకున్నాను. జిజ్ఞాస అధికమైంది. పఠనాశక్తి హెచ్చింది. ఏదో పవిత్రకార్యం చేస్తున్నప్పుడుకలిగే అనుభూతిని పొందుతున్నట్టు భావించేవాణ్ణి. ఆ రోజుల్లో మాసమావేశాలు తలుచుకుంటే యిప్పటికికూడా ఆనంద మనిపిస్తోంది. దీపంముందు, గదిలో చుట్టూ పది పదిహేనుమంది యువకులుకూర్చుని టీ తాగుతూ, కులాసాగా మాట్లాడుకోవడం ఎలావుంటుం దంటావు పావ్లోవ్నా? ఆ ఆనందం ఆ కబుర్లు మళ్ళీ రమ్మన్నా రావు. నువ్వు చూడవలసిందే. ప్రతివాడి కళ్ళల్లోనూ ఏదో తేజస్సు వెలుగుతూ వుండేది. బుగ్గలు ఎర్రబడేవి. కవిత్వం, కవితా సౌందర్యం, సత్యం, మానవభవిష్యత్తు, దేవుడు, పాపంపుణ్యం, స్వర్గంనరకం, వీటిని గురించి మాటాడుకుంటూంటే హృదయం ఉప్పొంగిపోయేది. నెత్తురు వేడెక్కేది. పొకోర్స్కీ కాళ్ళుముడుచుకొని, చేతులమీద గడ్డంఆనించుకొని చూస్తూ వుంటే అతనికళ్ళు తళతళా మెరిసిపోతూవుండేవి. రూడిన్ గదిమధ్య నిలబడి చేతులు అటూ ఇటూ ఊపుతూ మాట్లాడుతూంటే సముద్రం ఘోషిస్తున్నట్టుండేది. మా కింకొక స్నేహితు డుండేవాడు. అతను కవి. పేరు సుబోటిన్. మా ప్రసంగమంతా వింటూ నిద్రలో కలవరించినట్టు మధ్య మధ్య ఏదో అంటూండేవాడు. షెల్లర్ అనే మరోస్నేహితుడు ఎప్పుడూ నవ్వుతూండేవాడు. ఏమీమాట్లాడేవాడు కాదు. అతన్ని మేమంతా మునీశ్వరు డనేవాళ్ళం. సిటోవ్ అనే ఇంకోమిత్రుడు. అతనికి రెండు మూడు గొంతుకలు. బహు

తమాషాగా వుండేది. అంతా కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ వుంటే రాత్రి యిట్టే గడచిపోయేది. భళ్లున తెల్లవారేసరికి మాకే ఆశ్చర్యంవేసేది. ఎవరిదారినవాళ్లు వెళ్ళిపోయేవాళ్ళం. ఆరోజంతా హాయిగా గడచిపోయేది. పొద్దున్నే వీథుల్లో, ఆకాశంవంక చూస్తూ వెడుతూవుంటే ఆకాశం, సూర్యుడూ, భూమీ, వీటి పుట్టుపూర్వోత్తరాలన్నీ నాకు తెలుసు ననిపించేది. అవన్నీ దగ్గరపడుతున్నట్లు, నక్షత్రాలతో నేను మాట్లాడుతున్నట్లు అనిపించేది. ఆరోజులు మరి రావు. ఆ స్నేహితుల్ని మళ్ళీ కలుసుకున్నానుగాని ఆ ఆనందం మరి కలగలేదు. ఒకమనిషి కొన్నాళ్ళకు మృగప్రాయుడు కావచ్చును. మృగప్రాయుడైన మనుషులచెంత పోకోర్స్కీ పేరెత్తితే చాలు, వాళ్లు మళ్ళీ మానవులౌతారు.'

లెజ్నోవ్ మోము ఎర్రబడింది. పావ్లోవ్నా అతని వంక చూస్తూ 'అయితే మరి రూడిన్‌కూ, నీకూ తగువెందుకు వచ్చిందీ? ఎప్పుడూ?'

'నే నతనితో దెబ్బలాడలేదు. మాస్కో విడిచిపెట్టిం తరువాత అతని నిజస్వరూపం తెలిసింది. మాస్కోలో ఉన్నప్పుడుకూడా అతనలాగే ప్రవర్తించాడు. నామీద పన్నాగాలు పన్నేడు. కాని నేను దెబ్బలాడలేదు.'

'ఏం పన్నాగాలు పన్నేడు?'

'అదేమిటో నా నోటివెంట ఎలా చెప్పను? చెప్పడానికి నాకే సిగ్గువేస్తోంది... నేనప్పుడో పిల్లను ప్రేమించాను.'

'నువ్వా?'

'అవును. నీకు వింతగావుందిగదూ? ఆ పిల్ల చాలా అందమైంది...ఏం, నాకేసి అలా విచిత్రంగా చూస్తున్నావేం? పిల్లను ప్రేమించానంటేనే అంత తుళుక్కుపడుతున్నావు. ఇంకో విషయం చెపితే ఏమైపోతావో మరి? అది నాకే నవ్వుతాలగా వుంది.'

'నేనంత గాభరాపడే వింత విషయ మేముందీ?'

ఆ పిల్లను ప్రేమించక మునుపు, నా హృదయంలో ఏదో ఆవేదన. చెప్పలేనంత ఉద్రేకం. తోటలో సంపెంగ చెట్టు దగ్గరకువెళ్ళి ఆకుల్ని, రెమ్మల్ని ఆడపిల్ల తలను నిమిరినట్లు నిమిరేవాడిని. చుబుకం పట్టుకొని దీనంగా ప్రార్థించేవాణ్ణి. పూవుల్ని పలకరించేవాడిని. అప్పుడు ప్రకృతి నంతా కౌగలించుకుంటూన్నట్లు ఆనందపడేవాణ్ణి. నా కౌగ లిలో ప్రకృతిఅంతా చిక్కుకొని నన్ను ముద్దుపెట్టుకుంటో దనుకునేవాడిని. ఇక అంతటితో అయిపోయిందా? ఎన్నో ప్రేమగీతాలు రాశాను. విరహగీతాలు పాడేను. నాకు కవిత్వం రాయుడం రాదనుకున్నావా? ఆ రోజుల్లో ఒక నాటకంకూడా రాశాను. అందులో ఒక పాత్ర యిప్పటికీ నాకు జ్ఞాపకమే. గుండెలమీద రక్తంతో ఆ పాత్ర ప్రవే శిస్తుంది. ఆ రక్తం తనదికాదు మానవజాతి కార్చిన నెత్తురును అది తన గుండెలకు పులుముకొంది ... ఆశ్చర్యపడకు...నా ప్రేమకథను చెపుతూ మధ్యలో ఆపివేశాను ... ఎంతవరకు చెప్పాను? ఆఁ; అవును. ఆ పిల్లను ప్రేమించాను. ప్రేమించి పరిచయం సంపాదించాను....'

'అప్పటికి సంపంగితో విరహం మానేశావా?'

'మానేశాను....ఆ పిల్ల అతిసుకుమారమైంది. చేప కన్నుల్లా ఆమె కళ్లు మిలమిలా మెరిసిపోయేవి. కిన్నెరకంఠం.'

పావ్‌లోవ్నా వెటకారంగా నవ్వుతూ, 'ఆడపిల్లల్ని వర్ణించడంలో కవివి అనిపించుకుంటున్నావు' అని ఎత్తిపొడిచింది.

'కవుల్ని దుయ్యబట్టును నే విమర్శకురాలవైపోతున్నావే' అంటూ లెజ్‌నోవ్ తన ప్రేమకథను ప్రారంభించాడు.

'ఆ అమ్మాయికి తల్లి లేదు. తండ్రి ముసలివాడు. ఇంతకన్నా ఎక్కువేమి చెప్పను? ఆమె చాలా దయాత్మురాలని చెప్తే చాలు. మా యిద్దరికీ పరిచయమైన తరువాత మూడోనాడు ఈ సంగతి రూడిన్‌కు చెబుదామనుకున్నాను. కాని మరి నాలుగయిదు రోజులవరకూ చెప్పలేదు. మనస్సులో ప్రేమను యితరులకు చెప్పకుండా దాచుకోవడం కష్టంగదూ? నా మనస్సులో ఏమున్నా రూడిన్‌కు చెప్పేవాడిని. అప్పట్లో అతనంటే నాకు దేవుడు. ఇందువల్ల నేను చెడిపోయినది ఏమీ లేదు. పైగా బాగుపడ్డాను. రూడిన్ నన్ను బెదరగొట్టేవాడు కాదు. ప్రోత్సహించేవాడు. పొకోర్స్కీ అంటే నా కంత చనువులేదు. పైపెచ్చు అతనంటే భయంకూడాను. ప్రేమ విషయం చెప్తే, మండిపడతాడేమోనని నాభయం. నాప్రేమ కథవిని రూడిన్ ఎగిరిగంతేశాడు. నన్ను మెచ్చుకున్నాడు. కౌగలించుకున్నాడు. ఆ పిల్లతో ఎలా మెలగాలో బోధించాడు. ఇది మామూలువిషయం కాదు. ఇదొక కొత్తపదవి అంటూ నన్ను జాగ్రత్తపడమన్నాడు. అతను చెప్పిందంతా విన్నాను. నీకు తెలుసుగదా అతనెలా మాటాడుతాడో?

ఆనాటినుంచీ నేను జాగ్రత్తగా మెలుగుతూవచ్చాను. కొంచెం మౌనంగా వుండటం, అట్టే మాట్లాడకపోవడం, మాట్లాడిం దేదో గంభీరంగా మధురంగా మాట్లాడడం, నేర్చుకున్నాను. ఆ పిల్ల నన్ను వరించినందుకు తన్మయుడనయాను. ప్రపంచంలో ఆ పిల్లతప్ప నాకింకేమీ లేదు. ఇలా వుంటూండగా రూడిన్ ఒకసారి ఆ పిల్లను చూస్తానన్నాడు... నాకు నేనే ఆ పిల్లతో పరిచయం చేస్తానన్నాను...' లెజ్‌నోవ్ మాటలకు పావ్‌లోవ్నా అడ్డువచ్చి 'సరే, యింక నువ్వు చెప్పడ మెందుకు? మీ యిద్దరికీ యుద్ధ మెందుకు వచ్చిందో నాకే తెలిసిపోయింది. రూడిన్ ఆ పిల్లను మాయజేశాడు. ఆ పిల్ల నీకు దక్కకుండా పోయింది... అవును. అంతే జరిగింది పందెం వేస్తాను.'

'నీ పందెం నీ దగ్గరే వుంచుకో. పందెం కాస్తే ఓడిపోతావు. రూడిన్ ఆ పిల్లను కాజేయలేదు. ఆ వుద్దేశం అతనికి లేనూలేదు. కాని నా ప్రేమకు విఘాతం కలిగించాడు. అందుకిప్పుడు సంతోషిస్తున్నాను. కాని అప్పుడుమాత్రం పిచ్చివాడినై పోయాను. రూడిన్‌కి, నా కపకారం చేసే వుద్దేశం లేదు. ఉపకారం చేద్దామనే కొంపముంచాడు. ప్రతివిషయంలోనూ జోక్యం కలుగజేసుకోవడం అతనికో వ్యసనం గదూ? తన విషయంలోనూ అంతే. యితరుల విషయంలోనూ అంతే. పిల్లవాళ్లు సీతాకోకచిలుకను పట్టుకొని సూదులుగుచ్చి ఆడుకుంటున్నట్లు, రూడిన్, మాటలతో హృదయాలను గాయపరుస్తాడు. ఆ పిల్లకూ, నాకూ సంబంధాలు ఎలా వుండాలో మే మిద్దరం ఎలా మెలగాలో మా యిద్దరికీ చెప్పేవాడు. మా అభిప్రాయాల్ని, అనుభూతుల్ని ఎక్కడికక్కడ విడదీసి,

విద్యార్థి శోధననాళికలో ద్రావకాన్ని చూసినట్లు పరీక్షించే వాడు. ఒక్కొక్కప్పుడు పొగడేవాడు, విమర్శించేవాడు. మాస్కువిడిచి దూరంగా ఉన్నప్పుడుకూడా మమ్మల్ని విడిచే వాడుగాదు. సలహాలిస్తూ జాబులు వ్రాస్తూవుండేవాడు. ఆరి వాడి దుంపతెగ! అంతా తలక్రిందులు చేసేవాడు. ఆ పిల్లతో పెళ్ళిమాటకేం ? నాల్గురోజులుకూడా హాయిగా గడిచిందిగాదు. అదేం చిత్రమోగాని, నేనూ ఆపిల్ల కలుసుకు న్నప్పుడు అంతా తారుమారైంది. ఏదో అనుమానం, భ్రాంతి ఆ పిల్లకు కలిగింది. నాకూ అంతే. అబ్బ! అదేమని చెప్పను? ఇలా తారుమారు కావడానికి కారణం రూడినే. ఓనాడు పొద్దున్నే లేచి గబగబా నా దగ్గరకు వచ్చాడు. ఈ విషయం ఆ పిల్లతండ్రితో చెప్పడం తన విద్యుక్తధర్మమని చెప్పాడు. స్నేహితుణ్ణి యిలాగ ఒదిలిపెట్టడం తన కభిమతం గాదన్నాడు. దాగుడుమూతలు పనికిరావన్నాడు. వాళ్ళ నాన్నతో చెప్పి వ్యవహారం చక్కబరుస్తానన్నాడు. ఏముందీ ? అనుకున్నంతా చేశాడు. వెళ్ళి వాళ్ళ నాన్నతో చెప్పాడు.

'అంతపనీ చేశాడా?'

'చేశాడంటే, నాయిష్టంలేకుండా చేశాడూ? నేను బాగానే వుందన్నాను. అలాచెప్పి ఒప్పించాడు. అదీ వింత! అప్పుడు నామన స్సెలావుందో నువ్వూ ఊహించుకోలేవు. భూమి గిరగిరాతిరిగినట్లు తల తిరిగిపోయేది. ప్రపంచమంతా అదోలా అనిపించేది. తెల్లనివస్తువులు నల్లనివిగానూ, నల్లనివి తెల్లనివిగానూ, అబద్ధం నిజంగాను, నిజం అబద్ధంగానూ కన్పించేవి. అదంతా ఒక కల. అది తలుచుకుంటే యిప్పటికీ

నాకు బుర్ర తిరుగుతోంది. నేను ఇంతచిక్కుల్లో పడ్డా, రూడిన్ యథాప్రకారంగానే వున్నాడు. చెక్కుచెదరలేదు. పైగా తప్పుకునేందుకు దారి కూడా దొరకలేదు. అపాయాల్లోంచి అవలీలగా దాటుకు పోవడం అతనికి తెలుసును.'

పావ్‌లోవ్నా తలను ఒక పక్కనుంచి కనుబొమలు ఎత్తి అతన్ని చూసింది.

'అంతటితో నీకూ ఆ పిల్లకూ టంగు తెగిపోయిం దన్న మాట.'

'ఇద్దరం ఒకళ్ళ కొకళ్ళం దూరమైపోయాం. నన్ను చూసి ఆమె వెక్కి వెక్కి ఏడ్చింది. నేనుకూడా దుఃఖం ఆపుకో లేకపోయాను. నోటివెంట మాటరాలేదు. ఏం మాట్లాడుకు న్నామో, మాకే తెలియదు. అబ్బ! ఎంత బాధ! అయితే నేం. ఎడబాటు తప్పలేదు... అదీ ఒకందుకు మంచిదే అయింది. ఆ పిల్ల యిప్పుడు సుఖంగావుంది. తగినవాణ్ణి పెళ్ళాడింది.'

'ఎప్పుడో జరిగిందానికి, రూడిన్ మీద యిప్పటికూడా నీకు కక్షగా వుందన్న మాట.'

'నాకేం కక్ష లేదు. మాస్కో వదిలి, అతను వెళ్ళిపోతు న్నప్పుడు, చంటిపిల్లవాడిలా ఏడ్చాను. కాని నాటినుంచీ నా కదోలా వుంది. తరవాత అతన్ని కలుసుకున్నప్పుడు... అప్పట్లా నేను కుర్రవాడిని కాదుగా?...రూడిన్ నిజస్వరూపం తెలిసింది.'

'ఏమిటా నిజస్వరూపం?'

'గంటక్రిందట చెప్పానే, అదేఅది. పోన్లే; అతనివిషయం మనకెందుకు? అన్నీ అవే కుదుటబడతాయి. అతనంటే నాకు

పడదన్నావుకనుక యిదంతా చెప్పుకొచ్చాను. ఇక నటా లియాను గురించా? ఎవరెలాపోతే నాకేంలే. కాని పాపం, మీ అన్నను కొంచెం జాగ్రత్తగా కనిపెట్టుకొనివుండు.

'ఆం! మాఅన్న కేం?'

'ఏమూ? అతన్ని చూడలేదూ? చూచికూడా ఏమీ గ్రహించలేదన్నమాట.'

పావ్‌లోవ్నా పైకెత్తినతలను దించుకొని నేలవంక వెదుకుతూ చూస్తున్నది.

'అవును...ఈమధ్య అదోలా వుంటున్నాడు. అయితే నీఉద్దేశం...'

ఆమె అంటున్న మాటలకు లెజ్‌నోవ్ అంతరాయం కలిగించి 'పాన్‌గోవిచ్ వస్తున్నట్టుంది...నటాలియా యింకా చిన్నపిల్లేనని అనుకుంటున్నావా? అనుభవమైతే లేదనుకో... ఎప్పుడో ఒకప్పుడు మనందరికీ ఆశ్చర్యం కలిగిస్తుంది.'

'ఏమిటి చేస్తుందీ?'

'అలాంటి ఆడపిల్లలు వాళ్ళను వాళ్ళేముంచుకుంటారు. ఏ నూతిలోనో, గోతిలోనో పడతారు. విషంతాగి చచ్చిపోతారు. ఆపిల్లదంతా రహస్యం. మనస్సులో ఏముందో ఎవ్వరికీ తెలియనియదు.'

'నీదంతా కవిత్వంలెద్దూ. ప్రళయం రేపే ముంచుకొస్తుందంటావ్!'

'ఇంతటితో చాలించావు నయం. నాగుణం మంచిది గాదన్నావు కాదు. అదే పదివేలు.'

పావ్లోవిచ్ గదిలోకివచ్చి యిద్దర్నీ అనుమానంగా చూస్తూ నిలబడిపోయాడు. మనిషి కుచించుకుపోయాడు. కళ్ళు లోతుకు పోయాయి. చెల్లెలు పలకరించినా పరధ్యానంగా నవ్వి మారుపలకలేదు. దెబ్బతిన్న లేడిపలె బెదిరిపోతున్నాడు. నటాలియా తనకు దూరమౌతున్నదనే వ్యథ రోజుకు రోజూ తీవ్రమౌతోంది. తనజీవితంలో ఆమెఎడబాటు తప్పదు. ఆమె ప్రేమకు తాను నోచుకోలేదు. ఆమె చూపులూ, మాటలూ స్నిగ్ధసౌందర్యం....! తనకాళ్ళక్రింద భూమి కృంగిపోతున్నది.

# 7

పోయినరాత్రి నటాలియాకు కంటిమీద కునుకులేదు. ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. పాన్పుమీద పడుకొని అటు యిటూ దొర్లుతూ రాత్రల్లా గడిపింది. కళ్లుమూయడం, తెరుచుకోవడం, దీర్ఘనిశ్వాసం. వాటంతటికవే బొటబొట కన్నీళ్లు! చెక్కిళ్ళు తడిసిపోయాయి. తెల్లవారుఝామున మాగన్నుపట్టింది. పొద్దున్న లేచి చూసేసరికి చాలా పొద్దెక్కింది. ఆవేళ ఆదివారం. ఇంట్లో, ఎవరి ముస్తాబుల్లో వాళ్లున్నారు. రాత్రి కారణం తెలియకుండా, ఎందుకు దుఃఖం వచ్చిందో ఆమెకే అవగాహన కాలేదు. తలుచుకొని సిగ్గుపడింది. ఏమీతోచక పియానోచెంత కూర్చుని మెల్లగా మెట్లు సవరించుతోంది. గట్టిగా వాయిస్తే పంతులమ్మ లేస్తుంది. పియానో వాయించడం కట్టిపెట్టి పియానోమీద తల ఆనించి ఆలోచిస్తూ అలాగే వుండిపోయింది. ఆలోచన

లను అంతూపొంతూ లేదు. తోటల్లో, రూడిన్ తనతో చెప్పిన మాటలు గుండెలు దూసుకుపోతున్నాయి. పదేపదే ఆమాటలను తలుచుకొంటూ ఆలోచిస్తూవుంటే, మధ్య మధ్య ఆమె స్మృతిపథంలో పావ్‌లోవిచ్ మెరుపులా మెరియజొచ్చాడు. తనను అతను ప్రేమించేడని నటాలియాకు తెలుసును. మనసులో కనిపించిన పావ్‌లోవిచ్‌ని మర్చిపోవడానికి తన ఆలోచనల్ని మళ్ళించింది. ఈ భావం కలగడంతోనే మూర్ఛ వచ్చినట్లు జోగిపోయింది.

గబగబా లేచి దుస్తులు మార్చుకొని చరచరా మేడ మెట్లు దిగింది. హాలులో కూర్చున్న తల్లిని మామూలుగా పలుకరించి గిరుక్కున తిరిగి ఒంటరిగా తోటలోనికి మళ్ళింది. ఆకాశంలో మబ్బుతునకలు ఎడం ఎడంగా వున్నాయి. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. చిన్నచిన్న జల్లులు పన్నీరు చిలికినట్లు అప్పుడప్పుడు పడుతున్నాయి. ఉండివుండి జల్లులు పెద్దవౌతున్నాయి. వానచినుకులు పడిన నేల కస్తూరి పరిమళాన్ని వెదజల్లుతోంది. ఉండివుండి వర్ష బిందువులు ముత్యాలలాగ చెట్ల ఆకులమీదపడి వింతధ్వనులు చేస్తున్నాయి. సూర్యకాంతి తడిసిన ఆకులమీదపడి ఇంద్రధనుస్సు అక్కడే వెలిసినట్లుంది. చెట్లమీద గూళ్ళలో పిట్టలు కూర్చుని వానను చూసి జిలిబిలి స్వరాలతో కిలకిలమంటున్నాయి. దూరంగా బాటమీద పొగలాగ రేగిన దుమ్ము వానజల్లులకు అణగారిపోతోంది. ఆకాశంలో మబ్బులు పెద్దవై పరుగిడుతున్నాయి. నేలమీద గరిక వూగులాడుతోంది. దగ్గరదగ్గరగా ముడుచుకున్న ఆకుల సందులలో పూలగుత్తుల గుసగుసలు, రెమ్మల

సందులలో తళతళ మెరుస్తున్న ఎండపొడ. పూలవాసనలను పంచిపెడుతున్న నీటిగాలి. నటాలియా తోటలోనికి వెళ్ళే సరికి వాన వెలిసింది. తుంపరలు కూడా పడ్డంలేదు. తోటంతా కొత్తగా అప్పుడే పూసినట్టుంది. ప్రశాంతమైన ఏకాంత స్థల అంతా నిశ్శబ్దం. నిర్మానుష్యం. చెప్పలేని ఆనందం. ఆశ్రమ వాటికలా తోటలో పూసిన ప్రతి పూవులోనూ పవిత్రత వెల్లి విరుస్తోంది. నటాలియా నెమ్మదిగా అడుగులు వేస్తూ పూల గుత్తులను చూస్తూ నీలకుండీ చెంత నిలబడింది. తన హృదయం లోని రహస్యాలను పూలతో చెప్పుకోవాలనుకుంది. చుట్టూ జాజిలతలు అల్లుకొనివున్నాయి. జాజిపువ్వును కోసి వాసన చూస్తూ నీలకుండీలోకి తొంగిచూచింది. నీళ్ళలోని తన ప్రతిబింబం అలలకు కదిలిపోయింది. మోముపై కెత్తి ప్రక్కకు తిరిగేసరికి జాజిపొదల అవతల రూడిన్ నించొని వున్నాడు. ఆమె గతుక్కుమంది. రూడిన్ ఆమె మోములోనికి తొంగి చూచాడు.

'మీరొక్కరే వచ్చారా?'

'వచ్చి చాలాసేపయింది. ఇక వెళ్ళిపోతాను'

'పదండి. నేనూ వస్తున్నాను'

కొంతదూరం నడిచేసరికి రూడిన్ ఆగి, ఆమెవైపుకు తిరిగి ప్రశ్నించాడు.

'మీరీవేళ అదోలావున్నారే!'

'ఎలా వున్నాను?'

'కొంచెం విచారంగా'

'విచారంగా వున్నానా? మీరెందుకు విచారంగా వున్నారని నేనే అడుగుదామనుకుంటూంటే ...'

'నేను విచారంగావున్నా ఫరవాలేదు.... విచారంగాక మరేమిటి? నాలాంటివాళ్లు అలావున్నా ఆశ్చర్యంలేదు. కాని మీలాంటివాళ్లు...'

'అంటే; మాలాంటివాళ్ల విచారాలకి కారణాలే వుండ వనుకుంటున్నారా?'

'వయసులోవున్నపిల్లలకి ఆనందంగాక, విచారందేనికి? జీవితాన్ని అనుభవించే వయస్సు యిదేనాయె.'

నటాలియా మౌనంగా రెండు మూడడుగులు వేసి, ఏమనుకుందోగాని వెనక్కితిరిగి 'రూడిన్!' అనిపిలిచింది.

'ఏం?'

'నిన్న మీరన్నమాట జ్ఞాపకముందా? మర్రిచెట్టు సామ్యం గుర్తుందా?'

'గుర్తుంది. ఉపమానంలో తప్పేమన్నా వుందా?'

'ఆ ఉపమానం చెప్పడంలో మీ ఉద్దేశ మేమిటో?'

రూడిన్ తలవంచుకొని దూరంగా చూశాడు. నటాలియా అతన్ని క్రీగంట చూస్తున్నది. హృదయంలో ఎంతో భారం మోస్తున్నట్లు, రూడిన్, అర్థవంతంగా ఆలోచిస్తూ 'నటాలియా!' అని పిలిచాడు. నెమ్మదిగా వానజల్లులాగ మాటల్ని చెప్పటం ప్రారంభించాడు.

'నాజీవితం ఎలాగడిచిందో సాధారణంగా నే నెవరికీ చెప్పలేదు. గతజీవితంగురించి నేను మాట్లాడకపోవడం మీరు గమనించేవుంటారు. అవన్నీ పింతఅనుభవాలు. తీగలాగితే

హొంకంతాకదుల్తుంది. అందుకే ఆవిషయాలు ఎప్పుడూఎత్తను. అవి హృదయంలో అజ్ఞాతంగావుండడమే మంచిది. నాహృదయం అగ్నిపర్వతంలాంటిది. ఎన్నిఅనుభవాలు, ఎంతక్షోభ! అవన్నీ చెప్పడమంటే నాకే చిరాకు. ఈపూట ఇక మీతోచెప్పకుండా దాచుకోలేను. హృదయంవిప్పి మాట్లాడతాను. మీవల్ల నా ఆత్మవిశ్వాసం మళ్ళీ చిగిర్చింది. ఒకప్పుడు నేనూ అందరిలాగే ప్రేమించాను. బాధపడ్డాను. ఎలాపడితేనేం, ఎప్పుడుపడితేనేం; అవన్నీ యిప్పుడెందుకు? చెప్పుకుని ప్రయోజన మేమిటి? కాని ఆనందమనేది ఏమిటో నాహృదయానికి తెలుసును. విషాదమంటే ఏమిటో నేనూ అనుభవించాను.'

రూడిన్ కంఠం గాద్గదికమైంది.

'అన్నట్లు నిన్న నేనేమన్నాను?... ఆ ఉపమానం నాకే వర్తిస్తుంది. ప్రస్తుతం మకీని. అయితేనేం? ఈ దుఃఖాన్ని మర్చిపోతాను. జీవితంలో అది జరుగనట్టే భావిస్తాను. ఇప్పటికి నాకు మిగిలిందల్లా ముళ్ళదారి మాత్రమే. నేను పయనించేది గతుకులబాట. ముసలిఎద్దులాగ గతుకుల్లో పడుతూ లేస్తూ, ఈ బండిని యీడుస్తున్నాను. అయితే యీ బండి ఎక్కడికి వెళ్తుంది? అసలు నేనెక్కడికైనా వెళ్తానా? దేవుడికే తెలియాలి....'

'జీవితం ప్రసాదించేది యిక ఏమీలేదని మీరు భావిస్తున్నారా?'

'కాదు కాదు. జీవితం అన్నీ ప్రసాదిస్తుందని ఆశిస్తున్నాను: కాని అది నా కోసం గాదు జీవితంలో చెయ్యవలసిన కృషిని నేను మానుకోను. కృషి ఆనంద మిస్తుంది.

కాని లోలత్వాన్ని మాత్రం నేను పరిత్యజించాను. నా ఆశలూ స్వప్నాలూ, ఆనందం అసాధారణమైనవి. ఇవి అందరికీ ఉండేవిగావు. ప్రేమ అనేది....'

'ప్రేమ' అనేమాట నోటివెంట జారేసరికి రూడిన్ బుజాలను ఒకసారి సర్దుకున్నాడు. తిరిగి ప్రసంగిస్తూ, 'ప్రేమఅనే పదం నాకు అందనిది. అందుకు నేను తగను. ప్రేమికురాలు ప్రియుడు పూర్తిగా తన స్వాధీనం కావాలని కోరుకుంటుంది. అది ఆమె హక్కు. దీన్ని నేను కాదనను గాని, అలాగమాత్రం నేను యిక స్వాధీనం కాలేను. అదీకాక ప్రేమకు మూలం ఆకర్షణ. ఆకర్షణ యువకుల కుంటుంది. నేను యువకుణ్ణి గాదు. వయసుదాటినవాడిని. స్త్రీల మనస్సును ఎలా రంజింపజేస్తాను? ఆ రంజింపజేసేగుణ మేదో నాలోనే ఉండనీయండి.'

'ఒక ఆదర్శంకోసం సదా పాటుపడేవాళ్లు వాళ్ళను గురించి వాళ్లు ఆలోచించుకోరు. అలాంటి స్వార్థత్యాగిని హర్షించే స్త్రీలు ఉండరనుకోవడం ఒక భ్రమ మాత్రమే. అహంకారుల్ని స్త్రీలు ద్వేషించడం సహజం. యువకులు, యిప్పుడు మీరు చెప్పిన యువకులు అంతా అహంకారులే. వాళ్లు ప్రేమించినప్పుడుకూడా, ఆ ప్రేమలో అహంకారం స్వార్థపరత్వం దాగివుంటాయి. స్వార్థత్యాగులను స్త్రీలు హర్షించడమే కాదు; వాళ్లూ స్వార్థత్యాగం చేయగలరు.'

నటాలియా నెక్కళ్ళు ఎర్రబడి, కళ్ళు ఒక్కసారి మెరిశాయి. రూడిన్‌తో పరిచయం కాకపూర్వం, యింత

నిగూఢంగా ఎవరితోను ప్రసంగించి ఎరగదు. ఇదే తొలిసారి. రూడిన్ చిరునవ్వును పైకికనపించనీకుండా యిలా అన్నాడు.

'స్త్రీజాతిపట్ల నాకున్న గౌరవభావ మేమిటో మీకు తెలుసు ననుకుంటాను. జోన్ ఆఫ్ ఆర్క్ పుట్టివుండకపోతే ఫ్రాన్సు ఆనాడే నశించిపోయేదని, నా అభిప్రాయం...కాని మనం మాట్లాడుతున్న విషయం జోన్ ఆఫ్ ఆర్క్ గురించి గాదు, మీగురించి. జీవిత ప్రాంగణంలో మీ రిప్పుడిప్పుడే కాలు పెడుతున్నారు. మీ భవిష్యత్‌నుగురించి చర్చించుకోవడంలో ఆనందమూ వుంది, ప్రయోజనమూ వుంది. మీకు తెలుసుగదా— నేను మీ స్నేహితుణ్ణని. మీరంటే నాకు సోదరవాత్సల్యం. కనుక నన్ను మీరు అపార్థం చేసుకోరనుకుంటాను. నిజం చెప్పండి. మీ హృదయం ప్రశాంతంగానే వుంటోందా?'

ఈ ప్రశ్నకు నటాలియాహృదయం గగుర్పొడిచింది. శరీరం జలదరించింది. ఆమె ఏమీ మాట్లాడలేదు. రూడిన్ ఆమెవంక చూస్తూ 'కోపంరాలేదుగదా?' అనిప్రశ్నించాడు.

'కోపమెందుకు? కాని మీ ప్రశ్న...'

'నా ప్రశ్నకు మీరు సమాధాన మివ్వనక్కర్లేదు. ఆ సమాధానమేమిటో నాకే తెలుసును. రహస్యాన్ని, రహస్యంలాగే వుండిపోదు.'

నటాలియా దిగ్భ్రాంతితో కళ్ళప్పగించి చూస్తున్నది.

'నాకు తెలుసును. అతనెవరో నాకు తెలుసును. అంతకంటే తగినవాడు మీకుదొరకడు. చాలా గొప్పవాడు. మంచివాడు. ఈడూజోడూ బాగానేవుంది. మీరు సుఖపడతారు.'

'ఎవ రనుకుంటున్నారు?'

'అతనెవరో నా నోటితో చెప్పించాలనుకుంటున్నారు. అతను పావ్‌లోవిచ్ గదూ?'

నటాలియా మొహం పక్కకితిప్పుకొని పిసుగు మీద పడేటట్టు నిలుచుండిపోయింది.

'అతను మిమ్మల్ని ప్రేమించడంలేదా? నిజం చెప్పండి. మీరు ఎక్కడ నిలబడితే అక్కడ—మీరు అక్కడనుండి వెళ్ళిపోయినా చూస్తూనేవుంటాడు. మీరు ఎటువెడితే అటు వెనుకనేవుంటాడు. హృదయంలో ప్రేమ దాచుకోవడం, అతనికేకాదు; ఎవరికైనా కష్టమే. మీ అమ్మగారికకూడా యిష్టమే ననుకుంటాను, మరి మీరు?...'

నటాలియా భయాందోళనలతో వణకిపోయింది. తన భయాన్ని, ఆందోళనను కప్పిపుచ్చుకునేందుకు, మామూలుగానే వున్నట్టు పక్కనే వున్న మల్లెపొదను చేతులతో పట్టుకొని నుంచుంది.

'ఆ విషయం యిప్పుడు చర్చించలేను. కాని మీరు పొరబడుతున్నారని మాత్రమే చెప్పగలను.'

'నేను పొరబడుతున్నాననా, మీ రంటున్నది? పొరబడ్డం లేదనుకుంటాను. మీతో అట్టే స్నేహం లేకపోయినా ఆ మాత్రం నాకు తెలుసును. ఎవరిని ప్రేమించకపోతే అలా ఎందుకు కళవళపడుతున్నారు? నేను మొదటచూసిన నటాలియా వేరు. యిప్పుడు చూస్తున్న నటాలియా వేరు.'

నటాలియా హృదయం ఉయ్యాలవలె ఊగింది. గుండె బరువైంది. నిట్టూరుస్తూ, 'నన్నేమీ అడక్కండి' అంటూ

యింటివైపు అడుగులు వేసింది. రూడిన్ 'నటాలియా' అని పిలుస్తూ ఆమెను అనుసరించాడు.

'ఏమీ తెలకుండా అలా వెళ్ళిపోవడం బాగాలేదు. ఈ విషయం నాక్కూడా సంబంధించిందే. మీరేమీ చెప్పక పోతే నే నెలా అర్థం చేసుకోగలను?'

'నన్ను ఇంటికి వెళ్ళిపోనివ్వండి.'

'మీకు పుణ్యముంటుంది. మనస్సులోని ఉద్దేశ మేమిటో చెప్పకుండా వెళ్ళిపోకండి.'

'అన్నింటినీ అర్థంచేసుకుంటున్న మీరు నన్నే నా అర్థంచేసుకోలేనిది?' అంటూ నటాలియా అతని చేతులను విదళించుకుని పక్కకు తొలగిపోయింది. వెళ్ళిపోతున్న నటాలియాను 'ఇదిగో ఒక్కమాట' అని పిలిచాడు. ఆమె ఆగింది కాని వెనక్కి తిరిగి చూడలేదు. రూడిన్ ఆమెను సమీపించి ప్రార్థిస్తున్నట్లు ఇలా అన్నాడు :

'నిన్న నేను చెప్పిన ఉపమానానికి అర్థ మేమిటో చెప్పమని మీరు అడిగారు. చెప్తాను వినండి. ఒకరినొకరు అపార్థంచేసుకోవడం మనిద్దరికీ మంచిదిగాదు.... నిన్న నా గురించీ, మీ గురించీ ఉపమానం చెప్పాను.'

'ఏమిటీ? నాగురించా?'

'అవును. మీగురించే. నన్ను అపార్థం చేసుకోవద్దని మిమ్మల్ని మళ్ళీ కోరుతున్నాను. నిన్న నేనుపొందిన నూతనానుభూతి, చెప్పిన నూతన అనుభూతి, యిప్పుడు చెప్పలేకపోతున్నాను. ఆ సాహసం నిన్న లేకపోయింది, మన్నించండి.'

నటాలియా సిగ్గుతో రెండు చేతులతోను మొహాన్ని కప్పుకుంది. గబగబా యింటివైపు పరుగు పెట్టింది. ఆ తొందరలో ఎదురుగుండా పావ్‌లోవిచ్ దారిప్రక్క ఉన్నాడనే సంగతికూడా గ్రహించలేదు. పావ్‌లోవిచ్ పావుగంటక్రితమే లాసున్‌స్కయాయింటికి వచ్చాడు. ఆమెతో కాస్సేపుమాట్లాడి నటాలియా కోసమని తోటలోకివచ్చాడు. ఇంతసేపూ మామిడిచెట్టుకు చేరగిలబడి ఆలోచిస్తూ నిలుచున్నాడు. రూడిన్ చేతులను నటాలియా వొదిలించుకొని తొందరగాఅడుగులువేస్తూ రావడంచూసి తను ఎదురయ్యాడు. ఇప్పుడతనికి అంతా అంధకారం. చీకట్లో వుణికిసలాడుతున్నట్టు నటాలియావంక చూసి, ముందుకు మూడు నాలుగడుగులు వేశాడు. ఎదురుగావస్తున్న రూడిన్ అతన్నిచూసి మౌనంగా నమస్కరించాడు. యిద్దరిచూపులుఒకచోటకలుసుకున్నాయి. ఒకర్నొకరు పలకరించుకోకుండా విడిపోయారు. 'ఈకథ యింతటితో ముగియలేదు. యింకా ముదిరేటట్లేవుంది.' అనుకుంటున్నట్టు యిద్దరూ కనుపించారు.

పావ్‌లోవిచ్ అడుగులువేస్తూ తోట చివరికి చేరుకున్నాడు. మనస్సు ఆందోళనపడుతోంది. హృదయంలో తుపాను రేగింది. క్రోధంతో నెత్తురు మరిగిపోతోంది. రూడిన్ తన గదిలోనికి వెళ్ళిపోయాడు. అతనికికూడా మతిస్థిమితం లేదు. సుడిగుండంలో చిక్కుపడ్డట్టు గిలగిల్లాడాడు. భోజనంవేళ యింది. ఇట్లోసవారంతా ఎవరి ఆసనాల్లో వాళ్ళు కూర్చున్నారు. నటాలియా మొహం వెలవెలబోతోంది. కళ్ళుపైకెత్తి ధైర్యంగాదేనినీచూడలేకపోతోంది. పావ్‌లోవిచ్ మామూలు

గానే ఆమెపక్క మరో కుర్చీలో కూర్చుని అప్పుడప్పుడు ఆమెతో ఏదో అంటున్నాడు. ఎప్పుడూరాని పిగసోవ్ ఈపూట విందుకు వచ్చాడు. ఈవేళ ఉత్సాహంగా అందరికన్నా అతనే హెచ్చు మాట్లాడాడు. మనుష్యులు కుక్కలవలే రెండురకాలుగా ఉంటారన్నాడు. మొదటిరకం కుక్కలకు తోకలు పొట్టిగా వుంటాయట. రెండోరకం కుక్కలకి పొడుగైన తోక లుంటాయట. పొట్టితోకల కుక్కల జీవితం దుర్భరమైనది. జీవితంలో విజయమన్న దేమిటో అవి ఎరగవు. కారణం వాటితో వాటికి విశ్వాసం లేకపోవడం; యిక కుచ్చుల్లాగ పొడుగైన తోక లుంటాయే, అవి చాలా అదృష్టమైనవి; అదృష్టం వాటిని వెనుకంటూ వస్తుంది. పొట్టితోకలకంటె, పొడుగుతోకలు బలహీనమైనవే కావచ్చును; కాని వాటికి ఆత్మవిశ్వాసముంది. అందువల్ల అపజయమంటే ఏమిటో ఎరగవు. ఈ కుక్కలు, తోకలను ఒక్కసారి చాచి ఆడిస్తే చూచి అందరూ సంతోషపడేవాళ్లే, తోక అనేది వొంటికి అనవసరమేగదూ. తోకలవల్ల ప్రయోజన మేమిటి? కాని మన తోకలపొడుగును చూసి, ఎవరూ మన గుణగణాల్ని మెచ్చుకోరు. అదీ వచ్చిన ఖర్మ. కొందరు పొట్టితోకల కుక్కలవలే ఎప్పుడూ అదృష్టహీనులేనని, యిది జన్మతఃగాని, లేదా వారి దోషాలవల్లగాని సంభవిస్తూ వుంటుందనీ చెబుతూ పిగసోవ్ నిట్టూర్చి యిలా అన్నాడు. 'నాదిమట్టుకు పొట్టితోకే. ఉన్న తమాషా ఏమిటంటే నా తోకను నేనే పొట్టిగా కత్తిరించేసుకున్నాను.'

రూడిన్ తోకలకథ విని తన ధోరణిలోనే సమాధాన మిచ్చాడు. 'దీంట్లో ఏముందీ? నిమీద నీకు విశ్వాస ముండాలి. అప్పుడు అందరికీ నీమీద విశ్వాస ముంటుంది. ఈ విషయం మీకన్న ముందు అంతా చెప్పిందే. దీన్ని చెప్పడానికి తోకల కథెందుకు? యింకుంలో తోక లెక్కడినుంచి మొలుచుకొచ్చాయి?'

చర్చ జరుగుతూంటే ఉన్నట్టుండి, పావ్లోవిచ్ సహితం ఒక్కసారి అగ్నిపర్వతంవలె విజృంభించాడు. 'ప్రతివాడికీ తను అనుకున్న దేదో పైకి చెప్పేహక్కువుంది. నన్నడిగితే ఈ తెలివైనవాళ్ళు మనుకుంటున్నారే; వాళ్ళందరికన్నా నిరంకుశులే నయం. తెలివైనవాళ్ళు! వాళ్ళ తెలివి పాడుగాను' అతని హఠాత్ విజృంభణచూసి అందరూ మూగవాళ్ళలా ఊరుకుండిపోయారు. రూడిన్ మాత్రం, అతని చూపుల్నోసారి పరికించి దృష్టిని మరోవైపుకి తిప్పుకున్నాడు. నవ్వుతూ పెదమొహం పెట్టి, ఏమీ లెక్కచేయనట్టు ఊరుకున్నాడు. పిగసోవ్ 'నువ్వుకూడా పోట్లాటకే వేసన్న మాట?' అని నటాలియావంక చూశాడు. నటాలియా గుండె గొంతుకవరకు వచ్చి ఆగిపోయింది. ఆశ్చర్యంతో లాసున్స్కయా పావ్లోవిచ్ వంక తదేకదీక్షతో చూసింది. సంభాషణ మళ్ళించడానికని తనదగ్గర ఒకప్పుడున్న కుక్కను గురించి గొప్పగా చెప్పుకొచ్చింది. అది పులివంటికుక్కట. ఒకానొకమంత్రి దాన్ని కొన్నాళ్లు పెంచి తనకు బహూకరించాడట.

విందు అయిపోయిన తరువాత పావ్లోవిచ్ వెంటనే వెళ్ళిపోతూండగా వెళ్ళిపోతున్నానని నటాలియాతో చెబుతూ

మెల్లగా యిలా అడిగాడు. 'ఈమధ్య ఎందుకలా వుంటున్నావు, ఏదో నేరం చేసినట్టు!'

దీనికి నటాలియా ఏమీ సమాధాన మివ్వలేదు. వెళ్ళిపోతున్న పావ్‌లోవిచ్ వంక కంగారుగా చూసింది. రూడిన్ ఆమె చెంతకు వచ్చి బల్లమీదపడివున్న పత్రికను చూస్తున్నట్టు నటిస్తూ ఆమె భుజాలవెనక నుంచున్నాడు. నుంచుని మెల్లగా 'ఇదంతా ఒక కలలావుంది. అంతేగదూ? మిమ్మల్ని ఓసారి కలుసుకోవాలి. చిన్న విషయం చెప్పాలి.'

దూరంగాకూర్చొని తనవంకచూస్తున్న పంతులమ్మకు రూడిన్ పేపరు అందిస్తూ, ఆమెదృష్టిని మరల్చాడు. 'ఇదిగో పేపరు. మీరు ఎదురుచూస్తున్నవార్త యిదిగో, యీమూల వుంది.' రూడిన్ తిరిగి నటాలియా బుజాలమీదికి కొద్దిగా వంగాడు. 'తోటలోకి ఒకసారి రండి. మాలతీ పందిరిదగ్గర మీ కోసం ఎదురుచూస్తూవుంటాను. సాయంకాలం కలుసుకుందాం.'

సాయంకాలంఅయేవరకు లాసున్‌స్కయాతో పిగసోవ్ పిచ్చాపాటీ మాట్లాడుతూనే వున్నాడు. రూడిన్ పూర్తిగా ఆపూట అతనికి లొంగిపోయినట్లు కనిపించాడు. పిగసోవ్ మహానాయకుడులా అన్నివిషయాలు చెప్పుకొస్తున్నాడు. అతని మాటలను లాసున్‌స్కయా ఆనందభరితురాలైంది. పిగసోవ్ యింటిపక్కనే ఒకాయన ఉండేవాడట. అతనిభార్య గయ్యాళిగంప. పెళ్ళాం ఏం అంటే అది. ఎలాచెప్తే అలాగ. భార్య చెప్పుచేతల్లోవుంటూ భర్త కొన్నాళ్ళకి తన నడక మర్చిపోయాడట. ఆమెలాగే చేతులు త్రిప్పుతూ గడ్డంక్రింద

శ్రీ వేమన గ్రంథాలయము
(కృష్ణా జిల్లా)

వేళ్ళు పెట్టుకొని మాట్లాడుతూండేవాడట. ఇంకా [illegible], [illegible], ఆ జాతి అప్పుడప్పుడయినట్టు యీనాడు పిగసోవ్ ఒకలాంటిదే ఇంకొక కథ చెప్పాడు. తనకు తెలుసున్న ఒకానొక తను రహస్యసంఘంలో చేరేడట. కొన్నాళ్ళకి ఎందుకు క్లిష్టా తెలుసుకున్నాడట. రహస్యసంఘంలో చేరి ఏం జేస్తావని ఎవరు అడిగితే తాను పెంచుకున్న తన గోళ్ళను ఆ పెద్దమనిషి చూపించాడట. ఈ సంభాషణకంటే పిగసోవ్ తన ప్రేమ ముచ్చట్లను చెప్తున్నప్పుడు లాసున్స్కయా మాటిమాటికి నవ్వుతూ ముక్కి ముక్కి ఆనందించింది. పిగసోవ్ సహితం ఆడవాళ్ళ హృదయాన్ని ఒకప్పుడు దోచుకొన్నాడట. తన ప్రేమకు పాత్రమైన యువతి చాలా అందగత్తె. జాలరుల పిల్ల. 'నాముద్దుగుమ్మ చిలుకల కొలికి' అని తను పిలిచేవాడట. తన ప్రేమ ఉదంతం చెప్పి పిగసోవ్ ఆడవాళ్ళ హృదయాన్ని అవలీలగా వశపర్చుకోవచ్చునని, ఏ ఆడదైనా సరే, అదేమంత కష్టంగాదనీ చెప్పుకొచ్చాడు. దానికు కొన్ని మంత్రాలున్నాయట. నాలుగైదురోజులు పరిచయమైన తరువాత ఆమె పెదవులు సన్నంగా వున్నాయని, చెక్కిళ్లు గులాబిరేకులనీ, ఆ పిల్ల పగడపుతీగలాగున్నదనీ, లోకంలో మిగిలిన అందగత్తెలంతా ఆమెముందు దిగదుడుపనీ ప్రక్కకూడా పనికిరారని, కళ్లల్లో నీలిమబ్బులు, ఇంద్రధనుస్సులు కనిపిస్తున్నాయనీ వర్ణిస్తే చాలట. వర్ణనను [illegible] చెప్పేదేలేదట. ఎవరైనా ప్రేమలో పడిపోవలసిందేనట.

సాయంకాలమైంది. తోటలో మాలతీ పందిరివద్ద రూడిన్ ఎదురుచూస్తూ నించున్నాడు. పడమటి దిక్కున అస్తమిస్తున్న సూర్యబింబం ఎర్రగా కిందకు దిగిపోతోంది.

ఆకాశంలో కుంకుమరేఖలు తోటలోని చెట్లమీద కాంతులను ప్రసరింపజేస్తున్నాయి. గాలికి చెట్లు కదలాడుతున్నాయి. పూలగుచ్ఛాలు ఊగుతున్నాయి. దూరంగావున్న భవంతి నిశ్శబ్దంగా వుంది. సంజచీకటిపడింది. ఆకాశంలో అక్కడక్కడ నక్షత్రాలు మెరుస్తున్నాయి. వంచినవిల్లువలె చంద్రుడుదయించాడు. రెండు చేతులూ వెనక్కిపెట్టుకొని, దిక్కులను కలయ వెదుకుతూ రూడిన్ భవంతివైపు చూస్తున్నాడు. గుండె దడదడ కొట్టుకోసాగింది. ఊపిరి బిగబట్టి నిలబడ్డాడు. భవంతి దగ్గర చిన్న అలికిడైంది. తోటలో అడుగులతాకిడికి నేలమీద పడివున్న ఆకులు చప్పుడైనాయి. అడుగులు దగ్గరైనాయి. పూలపొదలచెంతకు నటాలియా చేరుకొంది. రూడిన్ ఆమెను ఎదురుగుండా వెళ్ళి చేతులు రెండూ పట్టుకున్నాడు. ఆమె చేతులు కొత్తగా చల్లగా వున్నాయి. రూడిన్ మెల్లగా 'నటాలియా!...మీకోసం కళ్ళు కాయలుకాసిపోతున్నాయి. వేయికళ్ళతో వెదుకుతూ నుంచున్నాను. అబ్బ! రేపటిదాకా దాచుకోలేను. ఇప్పుడే చెప్తాను. ఇంతవరకు అదేమిటో నాకే తెలియలేదు... నేను మిమ్మల్ని మనసారా ప్రేమిస్తున్నాను.'

నటాలియా అతనిచేతులను కదిపింది. రూడిన్ ఆమె చేతులను గట్టిగాపట్టుకొని 'ప్రేమిస్తున్నాను, మనసారా ప్రేమిస్తున్నాను. ఇంతకాలం నాప్రేమను దాచిపెట్టుకున్నాను. నేనెంత అంధుణ్ణి!...నటాలియా! నన్ను ప్రేమించడంలేదూ?'

నటాలియా ఊపిరిబిగబట్టింది. నోటివెంట మాట రాలేదు. రూడిన్ 'నటాలియా' అంటూ వ్యాకులంగాచూశాడు.

'అందుకేకదా ఇక్కడికి నే నొచ్చాను!' నటాలియా ఆ మోహన్ని కనులతో చూసింది. నన్ను మీరు మీరని మన్నించవద్దన్నట్లు ఆమెచూపులు వేడుకుంటున్నాయి. రూడిన్ ప్రార్థిస్తున్నట్లు చూశాడు.

'అవును. మిమ్మల్ని ప్రేమించాను.'

'అయితే నన్ను మీరు మీరనకు. నువ్వే నేను. నేనే నువ్వు.'

ప్రేమికుల మధ్యనున్న మీరుఅనే మన్నాపనాభావం తొలగిపోయింది. నువ్వు నువ్వనే చనువు, ఆత్మీయత నెలకొన్నాయి.

రూడిన్ ఆమెచేతులను మెత్తగా స్పర్శిస్తూ దగరకు లాక్కున్నాడు. నటాలియా చుట్టూచూసింది. 'నన్ను వెళ్లిపోనీ. ఎవరన్నా చూస్తే బాగుండదు. చూస్తున్నారేమోగూడాను. పావ్లోవిచ్ కి తెలిస్తే...'

'అతనిమాటకేంలే. చూశావుగదా నే నతనితో మాట్లాడకపోవడం... నటాలియా! ఇప్పుడెంత ఆనందంగా వుందీ! గంధర్వలోకంలో విహరిస్తున్నట్టుంది. యీ ప్రపంచంలో, ఏశక్తీ మనల్ని దూరంచేయలేదు.'

నటాలియా అతని కళ్ళల్లోకి చూస్తూ 'నేను వెళ్ళిపోతాను; నన్ను వెళ్ళిపోనీ' అంటూ అతనిచేతులను విడిపించుకుంది.'

'ఒక్కనిముషం...ఒక్కక్షణం'

'ఊహు. నన్ను వెళ్ళిపోనీ'

'నేనంటే నీకు భయంగావుందా?'

'లేదు. కాని నన్నాపకు.'

'అయితే ఒక్కమాటు. మళ్ళీ ఆ మాట .. చెప్పవు?... నన్ను ప్రేమించానని'

'ఎంతో ఆనందంగా వుందన్నావు?'

"ఆనందమా? లోకంలో నువ్వు నా ప్రక్కనుంటే నాకన్నా అదృష్టవంతు లెవరు? అంతకన్నా ఆనందం యింకెక్కడుంది?'

నటాలియా తల పైకెత్తింది. అందమైన సుకుమార మైన ఆమె మోముపై గుడ్డివెన్నెల పడుతోంది. గుసగుసలు చెప్తూన్నట్టు ఆమె వినీ, వినిపించకుండా 'ఇక నేను నీ దాన్నే' అంది.

రూడిన్ 'ఇదంతా నా అదృష్టం. దేవతలు కరుణిం చారు' అంటూ ఆమెను దగరకు తీసుకోబోయాడు. ఆమె అతని చేతులను అవతలికితోసి ప్రక్కకు తప్పించుకొని వెళ్ళి పోయింది. రూడిన్ అక్కడే కాస్సేపు నిలబడి మెల్లగా అడుగులువేస్తూ తోటలో పచార్లుచేస్తున్నాడు. వెన్నెల్లో అతని పెదవులపై చిరునవ్వు విరిసింది. తననుతాను సంబా ళించుకున్నట్టు 'అవునవును. నే నదృష్టవంతుణ్ణే. నాకానందం గానే వుంది. ఆనందంగా లేదూ?' అని ప్రశ్నించుకున్నాడు. ముందుకుపడుతున్న ఉంగరాలజుత్తును వెనక్కిసర్దుకుని, సంతోషంతో చేతులు రెండూ ఊపుకుంటూ, గబగబా తోట చివరికి వెళ్తున్నాడు.

మైనది లోకంలో మరొకటిలేదని అతనిభావం. తనభావానికి ఉదాహరణగా అప్పుడప్పుడు ఓ పద్యం చదువుతూండేవాడు.

సోఫామీద కూర్చున్న అన్నగారివంక, పావ్‌లోవ్నా దృష్టిని సారించింది. ఏదో అడగాలనుకుందిగాని నోరు మెదపలేకపోయింది. బయటగుమ్మంచెంత బండిఆగిన చప్పుడు వింది 'అమ్మయ్య, లెజ్‌నోవే గాబోలు వస్తున్నాడు,' అనుకుంటూ తనునుతాను సంబాళించుకుంది. నౌకరువచ్చి ఎదుట నిలబడ్డాడు. చేతుల్లోవున్న పుస్తకాన్ని జారవిడిచి 'ఎవరువస్తున్నారు?' అని పావ్‌లోవిచ్ ప్రశ్నించాడు. నౌకరు 'డిమిట్రీ నికొలోవిచ్ రూడిన్ వస్తున్నారు.' అని సమాధాన మిచ్చాడు. సోఫాలోంచి గబుక్కునలేచి, 'లోనికి రమ్మను' అని నౌకరుకి ఆజ్ఞాపించి చెల్లెలువంక తిరిగాడు.

'మేం కాస్త మాట్లాడుకుంటాం. కాస్సేపు నువ్వు పక్కగదిలోకి వెళుదూ' అన్నాడు.

'ఏం. నేను వినకూడదా?'

'తరవాత చెప్తానుగదూ. విసిగించక చెప్పినట్టుచేయి.'

రూడిన్ గదిలోకివచ్చాడు. గదిమధ్యదాకా పావ్‌లో విచ్ ఎదురువెళ్ళి, నమస్కరించి అతనిచేతులను పట్టుకున్నాడు. కిటికీచెంత తనటోపీని పెట్టుకుంటూ రూడిన్, 'ఇప్పుడు నేను వస్తానని మీరు అనుకొనివుండరు.' అని పెదవులను కొరుక్కున్నాడు. పావ్‌లోవిచ్ తనఆశ్చర్యాన్ని కప్పిపుచ్చు కుంటూ మూతి బిగించాడు.

'ఎలా అనుకుంటాను? రాత్రి జరిగిందాన్నిబట్టి మీరు నాదగ్గరకు ఎవరినో పంపిస్తారనుకున్నాను.'

'మీరు అంత ముక్కుసూటిగా భాషించినందుకు సంతోషం. కాని ఒక తగుమనిషి దగ్గరికి యింకొక పెద్దమనిషి వెళ్ళినట్టు నేనే మీదగ్గరికి వచ్చాను.'

'నా పెద్దమనిషితరహా కేముంది లెండి.'

రూడిన్ కుర్చీమీదకూర్చుంటూ 'మీ దగ్గరకు ఎందుకు వచ్చానో, స్పష్టంగా చెప్పాలనుకుంటున్నాను.'

'మనం పరిచయస్థులమే. మీరు రావటంలో ప్రత్యేకత ఏముందీ? అదీగాక యిదివరకు మీ రనేకసార్లు వచ్చారు, వెళ్లారు.'

'ఇప్పుడలాకాదు. నా రాకలో ప్రత్యేకత ఉంది. ఒక తగుమనిషి చెంతకు, మరో పెద్దమనిషి వచ్చినట్టు నేను యిప్పుడు మీ వద్దకు వచ్చాను. నేను చెప్పేది జాగ్రత్తగా విని, బాగా ఆలోచించండి. మీరలా ఆలోచిస్తారని, నాకు నమ్మకముంది.'

పావ్లోవిచ్ యింకా గదిమధ్యలోనే నిలబడి పోయాడు. ఏమీతోచక మీసాలు కొరుకుతుంటూ రూడిన్ కేసి నిశ్చగా చూశాడు.

'అసలు విషయం చెప్పండి.'

'నేను చెప్పే విషయం, ఇదివరకు జరిగిపోయిందే అను కోండి. ఇప్పుడు మనచేతుల్లో ఏమీలేదు. ఏదో చేద్దామను కున్నా, మీవల్ల కాదు.'

'ఎందుకు కాదు?'

'ఇది మనిద్దరికి సంబంధించినది మాత్రమే కాదు. అలా అయితే బాగానే వుండును.'

'మరింకెవరికి సంబంధించినది?'

'మూడోవ్యక్తికికూడా యిందులో చిక్కుకుంది.'

'ఎవరా వ్యక్తి?'

'మీకు తెలియనట్టు నన్ను అడుగుతారేం, పావ్‌లో విచ్!'

'నాకు నిజంగా తెలియదు, రూడిన్'

'అయితే మీరు నన్ను...'

'నేను మిమ్మల్ని, చెప్పే దేదో స్పష్టంగా చెప్పమంటున్నాను. మీ ముక్కెదో చూపించమంటే, చెయ్యెందుకు గిరగిరా తిప్పుతారు?' పావ్‌లోవిచ్ వస్తున్న కోపాన్ని అణుచుకోలేకపోయాడు. కళ్లు చింతనిప్పుల్లా చేసుకున్నాడు.

రూడిన్‌కూడా చిటపటలాడాడు. 'సరే అయితే నేనే చెప్తాను. గదిలో యింకెవరూ లేరుగదూ? నిజంగా మీకు తెలుసును. మీకు తెలియకపోవడ మేమిటి? నాచేత చెప్పించాలనిగాని ... నటాలియాను నేను ప్రేమిస్తున్నాను. ఆమెకూడా నన్ను ప్రేమిస్తోందని నాకు తెలుసును.'

పావ్‌లోవిచ్ మోము వెలవెలబోయింది. మనిషి పాలిపోయాడు. మొహంమీాద గంటువేస్తే నెత్తురుచుక్క లేదు. ఏమీ మాట్లాడకుండా కిటికీదగ్గరకు వెళ్ళి, కూర్చున్న రూడిన్‌వైపు తన వీపునుపెట్టి, నిర్లక్ష్యంగా నుంచున్నాడు.

'పరిస్థితి మీకు బోధపడిందనుకుంటాను. నన్ను ఆమె ప్రేమించకుండా ఉంటే,...'

'నాకా సందేహ మేమీలేదు. ప్రేమించండి, సుఖించండి. కాని ఈ విషయం నాతో చెప్పాలని మీ కెందుకు

తట్టిందీ? దాంతో నాకు సంబంధ మేమిటీ? మీరు ఎవర్ని ప్రేమిస్తే నా కెందుకు? ఎవతె మిమ్మల్ని ప్రేమిస్తే నా కెందుకు? మీ ఉద్దేశ మేమిటో నాకు అర్థంకావడంలేదే?' పావ్‌లోవిచ్ గొంతు బొంగురుపోయింది. కిటికీలోంచి శూన్యంగా చూస్తున్నాడు. రూడిన్ గుబుక్కున లేచాడు.

'నే నిక్కడికి ఎందుకు వచ్చానో చెప్తాను. మన యిద్దరికీమధ్య పొరపొచ్చాలు ఉండగూడదని నాఅభిమతం. పరస్పరం హృదయాలను గాయపర్చుకోగూడదని నా అభిప్రాయం. మీరంటే నాకు అమితగౌరవం. అందుకే యిక్కడికి నేను వచ్చింది. ఒకర్నింకొకళ్ళం మోసం చేసుకోగూడదని, నే ననుకున్నాను. నటాలియా అంటే మీ కున్న ప్రేమ ఏమిటో నాకు తెలుసు. మీకు మారుగా ఆమె హృదయంలో స్థానం సంపాదించదగ్గ అర్హత నాకు లేదనికూడా తెలుసు. కాని అది, విధి. విధియిలా ప్రేరేపిస్తుంటే మనం మనం లేనిపోని అనుమానాలతో పరస్పరం వంచించుకున్నందువల్ల ప్రయోజన మేమిటి? నిన్నటిలాగ పదిమందిముందు, మనం హాస్యాస్పదులం కావడందేనికి? ఏం. మాట్లాడ రేం పావ్‌లోవిచ్?'

పావ్‌లోవిచ్ హృదయంలోని కోపాన్ని అణుచుకుందుకో అన్నట్లు, గుండెపై చేతులను ఆనించుకున్నాడు.

'పావ్‌లోవిచ్! నాకు తెలుసును. మీ హృదయాన్ని నేను గాయపర్చాను... కాని మమ్మల్నిద్దరిని అర్థంచేసుకు నేందుకు ప్రయత్నించండి, కలలోకూడా అపార్థంచేసుకోవద్దు. మీరంటే మాకున్న గౌరవాన్ని ఎలా చూపించం? ఇంకో మనిషైతే నే నిలాచెప్పేవాణ్ణిగాదు. ముక్కుసూటిగా

నిజంమాట్లాడేవాళ్ళని మీరు హర్షిస్తారని నాకు తెలుసును. కనుకనే యీవిషయం చెప్పడం, నా విధి అనుకున్నాను. మా జీవితరహస్యం మీ చేతుల్లోఉందని మాకు తెలుసు.'

పావ్‌లోవిచ్ లేసినవ్వును తెచ్చిపెట్టుకొని 'నామీద మీకంత నమ్మకమున్నందుకు ధన్యుణ్ణి. మిమ్మల్ని..., నాకు తెలుసును...కాని మీరహస్యాలతో, ఆనందంతో నాకేమీ జోక్యంలేదు. నా ఆనందంకూడా అంతే. ఏదో ఒకవస్తువును తీసిపారేసినట్లు మీరు నన్నవతలికి గెంటనేగెంటారు. రూడిన్! ఒకమాట. ఇక్కడికి మీరువచ్చినట్టూ, యీవిషయం చెప్ప దలచుకున్నట్టూ నటాలియాకు తెలుసునా?'

'ఊహు. తెలియదు. నేను చెప్పలేదు, కాని నాతో ఆమె ఏకీభవిస్తుందనే నానమ్మకం'

పావ్‌లోవిచ్ కిటికీఊసలను వేళ్ళతోకొడుతూ 'అలా అయితే మరీమంచిది. కానిమీరు నాకింతగౌరవం యివ్వకుండా ఆమాటేదో మీదగ్గరే వుంచుకుంటే సంతోషించేవాణ్ణి. మీ గౌరవాగౌరవాలతో నాకేం సంబంధం? అవి మీదగ్గరే వుంచుకోండి. ఇంతకీ నన్ను గౌరవిస్తున్నట్లు, యిదంతా చెప్పి, నన్నేం చేయమని మీ ఉద్దేశం?'

'ఏమీ చేయవద్దు... ఒక్కకోరిక. నన్ను మీరు అర్థం చేసుకోవాలి. ఏదో నక్కజిత్తులవాడిననీ, కుట్రలుపన్నుతున్నా నని మీరు అపార్థంచేసుకోకూడదు. నా చిత్తశుద్ధి మీరు శంకించరనే విశ్వసిస్తాను.' రూడిన్ కుర్చీలోంచిలేచి పావ్‌లో విచ్ ఎదురుగానిలబడి చేతులు ముందుకు చాచాడు.

'ఎప్పట్లాగే యిప్పుడూ, ఎప్పుడూ మనం స్నేహితులమే.' చేతులందిస్తున్న రూడిన్‌ను తప్పించుకొని వెనక్కి తగ్గి పావ్‌లోవిచ్, 'క్షమించండి రూడిన్. మీ అభిమతానికి నేనేమీ అడ్డురాను. మీ ఉద్దేశాలు ఎప్పుడూ గొప్పవే. అవి అద్భుతం. నాలాంటి పల్లెటూరి మనుషులు అద్భుతమైన విషయాలను మెచ్చుకోలేకపోతేనేమి? మీ మనస్సు పరిగెత్తినట్టు, మాలాంటివాళ్ళం పరిగెత్తలేం. ఒక విషయం, మీకు ఎంతో నమ్మకమైనదిగా తోచవచ్చును. అదే విషయం పచ్చి మోసంగా మాలాంటివాళ్ళకు కనిపించవచ్చు. అవి తేలిగ్గా స్పష్టంగా మీకు కనిపించి, మాలాంటివాళ్లకి అతిక్లిష్టంగానూ, అగమ్యంగానూ కనిపించవచ్చు. క్షమించండి. మిమ్మల్ని నేను స్నేహితుడులా సంభావించలేను. పూర్వంలాగ నా చేతిని మీకందివ్వలేను. కరస్పర్శలో ఏముంది? నేను కరస్పర్శ చేయనంతమాత్రంచేత, మీకు కలిగే కష్టమేమీలేదు. మాలాంటి అల్పులు. . . .'

రూడిన్ కిటికీలోవున్న తన టోపీని తీసుకున్నాడు. మనస్సు గాయపడింది.

'పావ్‌లోవిచ్! నేను పొరపడ్డాను. చాలా ఆశించి వచ్చాను. అలా రావడం వింతగానే వుంటుందని నాకూ తెలుసును. కాని మీరు . . . క్షమించండి. ఆ మాట మళ్ళీ అనలేను. ఇప్పట్లో మీ రింకోలా ప్రవర్తించలేరు. అది సహజం కూడా. ఇక వెళ్ళొస్తాను. వెళ్ళేముందు ఈ ఒక్కమాట మళ్ళీ చెప్పాలనుకుంటున్నాను. నాకేమీ దురుద్దేశంలేదు. మీ మీంద నాకు నమ్మకముంది.'

'అంతటితో ఆగండి. నా మీద మీ కెందుకంత విశ్వాసం? మీ విశ్వాసంకోసం నేనేమీ పాకులాడలేదే? నేనేదో సరిగ్గా ఆలోచిస్తాననీ మాటిమాటికి అనడానికి మీ కున్న హక్కేమిటి? అంత చనువు ఎవరిచ్చారు?

రూడిన్ ఏదో చెప్పాలనుకుంటూనే వొద్దనుకొని నమస్కరించి వెనక్కితిరిగి వెళ్ళిపోయాడు. పావ్‌లోవిచ్ సోఫామీద కూలబడి టేబిల్ మీద కాళ్ళు ఆనించుకున్నాడు.

'నేను లోనికి రావచ్చునా?' అంటూ పావ్‌లోవ్నా ద్వారం చెంత నిలబడింది. పావ్‌లోవిచ్ మూతిబిగించుకొని కోపంతో మొహాన్ని చేతులతో కప్పుకున్నాడు. 'గదిలో కెవ్వరూ రావద్దు. నన్నెవ్వరూ విసిగించకండి.'

అరగంట పోయినతరువాత ఆమె మళ్ళీవచ్చి ద్వారం దగ్గర నిలబడింది. 'లెజ్‌నోవ్ వచ్చాడు' లోపలికి పిలిచేదా?'

'పిలు!'

గదిలోకివస్తూ లెజ్‌నోవ్ 'నీకు వంట్లో బాగోలేదా?' అని ప్రశ్నించాడు. సమాధానం వినకుండానే పావ్‌లోవిచ్ పక్కనేవున్న వాలుకుర్చీలో కూర్చున్నాడు. పావ్‌లోవిచ్ కొంచెం తేరుకొని తొడమీద మోచేతులను ఆనించుకొని, లెజ్‌నోవ్ వంక పదేపదే చూస్తూ జరిగిన సంగతులన్నీ చెప్తూ కొస్తున్నాడు. నటాలియాను తను ప్రేమించినట్లు యిదివర కెప్పుడూ అతను ఎవరికీ చెప్పలేదు. అతను చెప్పకపోయినా అందరికీ ఆ విషయం తెలుసును. పావ్‌లోవిచ్ రూడిన్‌తో జరిగిన సంభాషణంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. అంతా పూర్తిగావిని లెజ్‌నోవ్ 'ఆశ్చర్యమే! ఇలాంటివి అతను చేస్తా

డని. నాకు తెలుసునుగాని, యింతవిడ్డూరంగా వుంటుందనుకో లేదు. . . ఇక్కడకూడా రూడిన్ తనచిత్తశుద్ధిని రుజువుచేసుకున్నాడు' అన్నాడు.

'ఎంత మూర్ఖత్వం! ముక్కుకోస్తే నెత్తుకుతాగేరకం. అంత పనిగట్టుకొని, నా దగ్గరకు ఎందుకొచ్చి చెప్పాడంటావ్? డాంబిక మంటావా? పిరికితన మంటావా? ఏ మొహం పెట్టుకొని, మనిషంత మనిషి దగ్గరకు. . . .'

'అదేంకాదులే. అతని తత్వమే అంత. నా మాట నమ్మవేమోగాని, రూడిన్ సద్బుద్ధితోనే చేశాడీపని ... ఏం, అలా చూస్తున్నావు? నిజం; నామాట. ముక్కుకు సూటిగా పోదామనుకున్నాడు. అలా చెపితే గొప్పగా వుంటుందనుకున్నాడు. ఉపన్యాసం చెప్పడానికి మంచి అవకాశం. ఉపన్యాసంలేనిదే మనవాడు బతకలేడు ... ఔను. అతని నోరే అతనికి శత్రువు ... అయితేనేం, లోకాన్ని ఆ నోటితోనే జయించుకువస్తున్నాడు.'

'అబ్బ! గదిలోకి ఎలా వచ్చాడనుకున్నావు? ఎలా మాటాడేడని?'

'నాకు తెలుసుగా. సరిగ్గా కోటు తొడుక్కున్నాడో లేదోకూడా మర్చిపోతాడు. కోటుబొత్తాలు ఒకదానికొకటి పెట్టుకున్నా ఫరవాలేదు. ఉపన్యాసముంటే చాలు. అందులోను పవిత్ర కార్యభారం. తనవిధిని తాను నిర్వర్తిస్తున్నాడాయె. హిమాలయ పర్వతాలమీద కూర్చోబెట్టు; ఎడారిలో పడేయి; సముద్రంలోకి తోయి; మనవాడు అక్కడకూడా ప్రబోధం మానడు.'

'అసలు యిదంతా ఎందుకు చెప్పాడంటావు? ఇదే మన్నా వేదాంత మనుకున్నాడా?'

'ఇదంతా ఒకలా వేదాంతం, యింకోలా కాదు. ప్రతి దాన్నీ, వేదాంత దృష్ట్యా చెప్పుకురావడం కష్టం.'

'రూడిన్ చెప్పింది కట్టుకథ కాదంటావా?'

'ఆరి పిచ్చివాడా! కాదు. అంతా నిజం. దాని మాట కేంలే. కాస్సేపు సిగరెట్లు కాల్చుకుందాం....పావ్‌లోవ్నా కాస్త టీ యిస్తే బాగుండునే.'

పావ్‌లోవిచ్ లోనికి రమ్మని చెల్లెలు పావ్‌లోవ్నాను కేకవేశాడు. ఆమె గదిలోనికి వచ్చింది.

♦ ♦ ♦

రూడిన్ తన గదిలోనికి వచ్చాడేగాని, మనస్సు పరిపరి విధాల పరుగిడుతూంది. అంతా గాభరాగానూ, గందరగోళం గానూ కనిపిస్తోంది. తనంటే తనకే విసుగు; చికాకు, రోత. కుర్రతరహాగా ప్రవర్తించానేమోనని తననుతానే నిందించుకున్నాడు. తనదోషం తనకు తెలిసినప్పుడు, మానవుడు పడే ఆవేదన అంతాయింతాగాదు. 'నే నెందుకు అక్కడికి వెళ్లాలి? నాకు నేనే ప్రళయం తెచ్చుకుంటున్నానే? వెళ్ళకపోతే వచ్చిన నష్టమేమిటి? ఎందుకింత తొందర?' అంటూ తననుతనే ప్రశ్నించుకున్నాడు.

జమీందారిణి భవంతి ఎప్పట్లా కళకళ్లాడుతూలేదు. అంతా చిన్నబోయింది. పొద్దుటినుంచీ లాసున్‌స్కయా తన గదిలోనే వుండిపోయింది. అందరితోపాటు భోజనంకూడా చేయలేదు. గదిలోకి ఎవ్వరినీ రానీయలేదు. పాండలవిస్కీ

మాత్రం ఒకటిరెండుసార్లు ఆమె పిలిస్తే వెళ్ళాడు. అమ్మగారికి తలనొప్పిగా వుందని, ఎవ్వరినీ రానీయబద్దన్నారనీ చెప్పాడు. నటాలియాకూడా తనగదిలోనుంచి బయటకురాలేదు. పంతులమ్మతో అక్కడే కూర్చుండిపోయింది. నటాలియా కనపడనందుకు, రూడిన్ ఆందోళన పడుతున్నాడు. భోజనాల దగ్గర కూర్చున్నప్పుడుమాత్రం నటాలియా తనవంక ఒక్కసారి చూచింది. ఏదో బాధతో కుమిలిపోతున్నట్టు కనిపించింది. మోములో వెనకటి లావణ్యంలేదు. విషాదంగా చూస్తూ, పరధ్యానంగా రెండు మెతుకులుకతికి లేచిపోయింది. అన్నంకూడా సహించలేదు. రెండురోజులీమధ్య ఎంతమార్పు! ఎంతవిషాదం! ఎందు కా దుఃఖం?...రూడిన్ హృదయం ద్రవించిపోతోంది. అనేక అనుమానాలు పట్టుకుని పీడించసాగాయి. నటాలియా ఎందుకంత దిగులుగావుందో, బెసిస్టోవ్ నడిగితెలుసుకోవాలనుకున్నాడు. అతని మాటల్లో మాటలుకలిపి, ప్రశ్నలు వేశాడు. కాని బెసిస్టోవ్ ఏమీ తొణకలేదు. సాయంకాలం లాసున్స్కయా గదిలోనుంచి హాలులోకివచ్చింది. గంటా రెండుగంటలు రూడిన్‌తో మాట్లాడిందిగాని, ఆమాటలు పూర్వంలా లేవు. ఒక్కొక్కప్పుడు వెడవెడా నవ్వేది. ఆక్షణం లోనే మొహం చిట్లించుకునేది. చికాకుపడేది. మళ్ళీ నవ్వు తెచ్చుకునేది. ముక్కుతో సణిగేది. దేనిమీదో పెట్టి అర్థోక్తిలో, ఏమేమోఅనేది. మాటల్లో మర్యాద కనిపించినా, రూడిన్ తనను అప్పుడే పరిచయమైనట్లు ప్రవర్తించింది. లాసున్స్కయా ఎందుకిలా ప్రవర్తిస్తున్నదో రూడిన్ మొదట అర్థం చేసుకోలేక పోయాడు.

లాసున్‌స్కీయా వింతప్రవర్తనకు కారణం మరికొద్ది సేపట్లోనే అతనికి బోధపడింది. తనగదిలోనికి రూడిన్ వెళ్ళి పోతున్నప్పుడు వసారాలో మూలను ఒకామె నుంచుని అతని చేతికి ఒకఉత్తరం అందించింది. అందించి లోనికి గబగబా వెళ్ళిపోయింది. ఆమె నటాలియా పరిచారిక. గదిలోనికి వెళ్ళి రూడిన్ ఉత్తరాన్ని విప్పిచూచుకున్నాడు. దస్తూరి నటాలియాది. గబగబా అక్షరాలవంక అప్రయత్నంగా చూపులు మళ్ళాయి.

'సరుగుడుతోట అవతల ఉన్న కొలనువద్దకు రేపు ఒక్కసారి రండి. పొద్దున్నే ఆరున్నర గంటలకు, మీకోసం అక్కడ ఎదురుచూస్తూ వుంటాను. ఆరున్నరదాటితే రావవసరంలేదు. మనం కలుసుకోవడం అది ఆఖరిసారి...తప్పక రండి. ఏదో ఒకటి మనం నిర్ణయించుకోవాలి...ఒకవేళ నేను రాకపోవడమే తటస్థిస్తే, నేను కబురుచేస్తాను. యిక మనం కలుసుకోలేమనే దానిఅర్థం...'

ఉత్తరం చదువుకొని రూడిన్ ఆలోచనా నిమగ్నుడైనాడు. జాగ్రత్తగా మడిచి ఉత్తరాన్ని తన తలగడక్రింద దాచుకున్నాడు. దుస్తులుమార్చుకొని ప్రక్కమీదవాలాడు. రాత్రి నిద్రపట్టిందిగాదు. కాస్సేపుకళ్ళుమూసుకొని తెల్లవారి లేచిచూచేసరికి అయిదుగంటలు కావస్తోంది...

## 9

జమిందారిణిభవంతికి అరమైలుదూరంలో సరుగుడు తోటల అవతల తామరకొలను ఒకటుంది. అక్కడే తనను

కలుసుకోవలసిందని నటాలియా రూడిన్‌కు ఉత్తరం రాసింది. అది వారి సంకేతస్థలం. పేరుకు అది కొలనన్నమాటేగాని యిప్పుడు యించుమించుగా పూడ్చుకుపోయింది. నీరు పాకుడు కట్టి పచ్చగా కనిపిస్తోంది. ముప్ఫైఏళ్ళక్రిందట కొలను సొగసుగానే వుండేది. కొలనుగట్టున ఒక జమీందారు భవంతికూడా వుండేది. ఇప్పుడా ఆ భవంతి ఒకప్పుడున్న జాడకూడా లేదు. పునాదులుసహితం కాలగర్భంలో కలిసిపోయాయి. ఆ ప్రదేశంలో నాలుగైదు చింతచెట్లు గుబురుగా పెరిగి భయం గొల్పుతున్నాయి. ఆ కొలనుఒడ్డున కొరవిదెయ్యాలు తిరుగుతూ వుంటాయని, చింతచెట్లమీద బ్రహ్మరాక్షసి వుంటుందని పల్లెటూరి జనం కథలు చెప్పుకుంటారు. ఆ ప్రదేశంలో అనేక ఘోరమైన హత్యలు జరిగాయట. చెట్టుపడి మనుష్యులు చనిపోయారట. నిత్యం ఎవర్నో ఒకర్ని అక్కడి చెట్లు బలి కోరుతూ నేవుంటాయట. ఆ ప్రదేశమంతా కీకారణ్యం. సాధారణంగా మనుష్యు లెవరూ అటుపోరు. పట్టపగలుకూడా అక్కడ కారుచీకటిగా నే వుంటుంది. కొలనుకు యింకోవైపున ఉన్న తుమ్మబీడు మరీ భీతావహంగావుంది. చెట్లు దెయ్యాల్లాగ ఎత్తు పెరిగి బోసుకొని మనుష్యుల్ని భయపెడతాయి. అత్యవసరమైన పనివుంటేతప్ప, దారితప్పి, ఆ దారిని ఎవరూ రారు. నటాలియా యిదే ప్రదేశాన్ని ఎంచుకొంది.

తామరకొలనుదగ్గరకు రూడిన్ చేరుకొనేసరికి సూర్యుడు ఉదయించాడు. గాలి సరుగుడుతోటల్లో యీలలు వేస్తోంది. ఆకాశంమీద తెల్లనిమబ్బులు గాలికి చెదరిపోతున్నాయి. రూడిన్ కొలనుగట్టున చింతతోపుల చెంత నుంచు

న్నాడు. ఒంట్లో ఏమీ బాగోలేదు. హృదయం ఆందోళనపడు తోంది. నటాలియాతో సమావేశం, అనుభూతులు ఒకపక్క ఉద్రేకాన్ని కలిగిస్తున్నా యింకోవంక మనస్సునుపట్టుకొని వేధి స్తున్నాయి. నటాలియా తనను హఠాత్తుగా కలుసుకోవా లని కోరడంతో రూడిన్ ఏటూ తోచక క్రిందుమీదా తున్నాడు. అంతిమఘడియలు సమీపిస్తున్నట్టు, లోలోపల భయంపట్టుకొంది. పైకి ధైర్యంగా కనిపిస్తూ, చేతులను రొమ్ముమీద ఆనించుకొని చుట్టూ చూశాడు. నటాలియాను నిజంగా తను ప్రేమిస్తున్నాడా? ఈ బాధంతా నిజమైందేనా? తనకు నటాలియా దూరమైతే యిలాగే బాధపడతాడా? రూడిన్ ప్రశ్నపై ప్రశ్న, ఆలోచనపై ఆలోచనలతో సతమత మౌతున్నాడు. తనకు నిజంగా ప్రేమ లేకపోతే ఆమె హృద యాన్ని తను ఎందుకు వశంచేసుకోవాలి? రహస్యంగా యిక్కడకువచ్చి ఆమెకోసం వెదుకుతూ వేసారిపోవడం దేనికి? ఈ ప్రశ్నలకు అతనికి ఒకటే సమాధానం తోచింది. ఉద్రే కాలకు లోనుకామనుకుంటున్న వ్యక్తులుకన్నా, లోకంలో చపలచిత్తులు మరుండబోరు.

రూడిన్ అటూ యిటూ పచారుచేస్తూవుంటే పొలం గట్లకుఅడ్డుపడి నటాలియా మనోవేగంతో వస్తున్నది. ఆమెతో కూడావస్తున్న పరిచారిక నటాలియాతో నడవలేకపోతున్నది.

'జాగ్రత్తగా నడవ్వమ్మా. గతుకులున్నాయి.'

పరిచారికమాటలు వినిపించుకోకుండా నటాలియా చరచరా అడుగులువేస్తోంది. రూడిన్ కనిపించేసరికి నడక మాని కొంచెం పరుగుపెట్టింది.

'మాషా! ఎవరైనా చూశారంటావా?'

'చూస్తే ఏంలే అమ్మా. ఇంట్లోంచి ఎవరూ చూడకుండా నేవచ్చేశాము. అదిగో తామరకొలను దగ్గరకు వచ్చాం... ఉయనేగా మోసు, అటూ యిటూ తిరుగుతున్నాడు. లోప పెక్కడో ఉండక అందరికీ కనుపించేటట్లు బయటనే నుంచున్నాడే?'

నటాలియా ఆగిపోయింది. 'ఇక్కడే ఉండు. నే వెళ్ళి వస్తాను.' అంటూ తామరకొలను చెంతకు వెళ్ళింది. రూడిన్ ఎదురుగుండావచ్చి ఆమెనుచూచి ఆశ్చర్యంతో ఆగిపోయాడు. నటాలియా మోముల్లో యిప్పుడున్నంత ధైర్యం అత నెప్పుడూ చూడలేదు. ఆమె కనుబొమ్మలు ముడుచుకున్నాయి. పెదవులు బిగించుకుంది. చూపులు ఆజ్ఞాపిస్తున్నాయి.

'రూడిన్! యింక వ్యవధి ఏమీలేదు. అయిదు నిముషాలు. అయిదే నిముషాలు. అమ్మకు అన్నీ తెలుసును. పాండలేవ్‌స్కీ అమ్మకు అంతా చెప్పేశాడు. నిన్న అమ్మ నన్నుపిలిచి...'

'కొంపముంచాడే! ఒకళ్ళకు తెద్దునా, యిద్దరికి తెద్దునా అని...మీ అమ్మగా రేమన్నారూ?'

'పెద్ద కోప్పడలేదు, తిట్టాలేదు. కొంచెం మందలించింది. 'బొత్తిగా చిన్నపిల్లవై పోతున్నావే? అలాగైతే ఎలాగమ్మా' అని కూకలేసింది.'

'అంతేనా? యింకేమీ అనలేదూ?'

'మనయిద్దరిని పెళ్ళిపీటలమీద చూసేకంటే ముందు తను ఎందులోనో పడిచస్తే తను చూసి సంతోషిస్తుందట.'

'అంతమాటందా?'

'నేను నన్ను పెళ్ళాడాలని ఏకోశానా లేదట. ఊరికే ఊసుపోవడానికి తమాషా చేస్తున్నానట. అయినా మనిద్దరిని అంతచనువుగా వదిలేయడం తనదే బుద్ధితక్కువట...జ్ఞానం వచ్చినపిల్ల తనహద్దులో తానుండాలిగాని, హద్దుమీరితే ఎలాగంది. నేను అమ్మకు ఉరికొయ్య నయ్యానట!...యింకా ఏమేమో అంది.'

నటాలియా వణకిపోతోంది. స్వరం మందగించింది.

రూడిన్ బుజ్జగిస్తూ, 'అయితే నువ్వు ఏమన్నావు?'

'ఏమంటాను? అనడాని కేముంది? యిప్పుడు నువ్వు ఏంచేద్దా మనుకుంటున్నావు?'

'అరి, భగవంతుడా! ఎంతను తెచ్చావురా! యిప్పు డేమిటి చెయ్యడం? ఏమీ ఆలోచించుకోకుండా ... యింత త్వరగానా ? హఠాత్తుగా పిడుగువచ్చి మీదపడ్డదే! ...మీ అమ్మగారికి కోపంగా ఉందన్నావుగదూ?'

'కోపంగానా? నీ పేరెత్తితే తోకతొక్కిన తాచులా కస్సుమంటోంది.'

'దారుణం. మహాదారుణం. అయితే మరేం లాభం లేదన్నమాట...'

'అమ్మను ఒప్పించాలంటే లాభంలేదు.'

'మనం యింత దురదృష్టవంతులం ఎందుకావాలి? ఏంపాపం చేశామని?...అరరే. పాండలవిస్కీ ...నా కెంతపని చేశాడూ.'

'వాడిమాటకేం. అయిందేదో అయింది. ఇప్పుడు ఏం చేద్దామని ఆలోచిస్తున్నావు?'

'ఆలోచించడమూ ... ఏమీ పాలుపోవడం లేదు. దారీ తెన్నూ కనిపించదు. తల గిరగిరా తిరిగిపోతోంది. ... ఆలోచించలేను. ఏమీ ఆలోచించలేను...ఎంత దురదృష్టవంతుణ్ణి... యిదంతా ఏమీ కానట్టు అంత శాంతంగా నువ్వెలా వున్నావని ఆశ్చర్యపోతున్నాను.'

'ప్రశాంతంగా ఉన్నాననుకుంటున్నావా?'

రూడిన్ అటు, యిటూ పచారుచేస్తూనే వున్నాడు. నటాలియా అతనివంక తేరిపారజూసింది. రూడిన్ నటాలియా వంక తిరక్కుండానే 'మీ అమ్మగారు నిన్ను యింకేమీ అడగలేదూ?'

'నిన్ను నేను ప్రేమించానా? లేదా? అని అడిగింది.

'దీనికి నువ్వే మన్నావు?'

'ఏమంటానని నీ వుద్దేశం? ఉన్న సంగతి చెప్పాను.'

రూడిన్ ఆమె చేతులను పట్టుకున్నాడు.

'అన్నిటా, అన్ని వేళలా నీహృదయం బంగారం... మనం పెళ్ళిచేసుకుంటే,...మీఅమ్మ అంతవ్యతిరేకంగావుందా?'

'నేను చెప్పానుకదూ. నీ పేరంటే మండిపడుతోందని. నన్ను పెళ్ళిచేసుకోవాలని నీకు లేనేలేదట.'

'అయితే నేనుఉట్టి దగాకోరు ననుకుంటోందన్నమాట! నేనేం తప్పుచేశాను? ఆమె ఎందు కిలా అనుకుంటోంది?'

'రూడిన్! మనం వృథాగా కాలక్షేపంజేస్తున్నాం. నేనింక నీమొహం చూడనని జ్ఞాపకంపెట్టుకో. నీదగ్గరకువచ్చి కంట నీళ్లు పెట్టుకుందామని యిక్కడికి రాలేదు. మా అమ్మ ఏమందో చూడమని, ఫిర్యాదు చెయ్యడంలేదు. ఇప్పుడు

సమయం మించింది. వ్యవహారంబెడిసింది. ఏంచేయమంటావో చెప్పు.'

'నన్ను సలహా అడిగితే నేనేం చెప్తాను?'

'ఏంచెప్తావా? మగవాడివికాదూ? నిన్ను నేనునమ్మి... యిక్కడికి వచ్చాను. నా జీవితాంతంవరకూ నీమీందే నాకు నమ్మకం. నువ్వు ఏం చేయదలచుకున్నావో త్వరగాచెప్పు. నీ ఉద్దేశమేమిటి?'

'నా ఉద్దేశం!...యింక యింటికి నన్ను రానీయదు గామోసు మీ అమ్మ.'

'రానీయకపోవచ్చును. సూచా వాచాగా ఆ సంగతి నిన్ననే చెప్పింది...కాని నాప్రశ్నకు జవాబుచెప్పవేం?'

'ఏంప్రశ్న?'

'ఇప్పుడు మనమిద్దరం ఏం చేయాలని . నా ప్రశ్న.'

'ఏమిటి చెయ్యాలి?...ఏముంది? యిద్దరం విడిపోదాం. మామూలుగానే వుందాం.'

నటాలియాపెదవులు చలించాయి. మొహం నల్ల బడింది. కోపం ముంచుకొచ్చింది.

'ఏమిటంటున్నావు?'

'ఏమీలేదు...విడిపోతే మంచిదేమోనని. యింతకీ విధి విలాసం ఎలావుంటే అలా అవుతుంది. విడిపోకుండా వుండి మనం చేసేదేమిటి? నాకు తెలుసును. అదెంత బాధగా, హృదయవిదారకంగా వుంటుందో? కాని నటాలియా! ఒక్కక్షణం ఆలోచించి చూడు. నేనేమో పేదవాణ్ణి ... జీవి తంలో కృషిఅంటూ చేయగలననుకో. కృషిచేసి ధనవంతుడ

నాతానే అనుకో. అలా అయినా నువ్వు, మీ అమ్మను కాదని, యిల్లూ వాకిలీ వదిలిపెట్టి వుండగలవా? ఆమె కోప గిస్తుంది. భయపెడుతుంది. వీటిని నిగ్రహించుకోగలవా? ఊహుం. నిగ్రహించుకోలేవు. నటాలియా, అలా అనుకోవడమే పొరపాటు. మనం యిద్దరం సుఖంగా వుండడం ఆ పరమేశ్వరుడికి యిష్టంలేదు. కాబోలు. నిన్ను పెళ్ళాడి ఆనందంతో చిలకా గోరువంకల్లా ఉందామనుకుంటే ఆదేవుడికే కన్నుకుడుతోంది. నేను ఏవే కలలుకన్నానో, ఆ కలలన్నీ ... అనుభవించేయోగం నాకు లేదు.'

నటాలియా తన చేతులలో మోమును దాచుకొంది. అప్రయత్నంగా దుఃఖం వెల్లువలా పొంగుకొచ్చింది. వెక్కి వెక్కి ఏడుస్తోంది. రూడిన్ ఆమెచెంతకు వెళ్ళాడు. గట్టిగా కోపగిస్తున్నట్లు 'నటాలియా! ఏమిటది, నా నటాలియా! ఏడుస్తోందా? ఏడవకు నటాలియా. నువ్వు ఏడిస్తే నాకు... ఊరుకో.'

నటాలియా తల పైకెత్తిచూసింది. కన్నీటిబిందువులలోనుంచి ఆమెచూపులు అగ్నిని కురుస్తున్నాయి.

'నన్ను ఊరుకోమంటున్నావు. నేనేమీ ఏడవడం లేదు....నిన్ను నమ్మి నేను మోసపోయాను. నన్ను నువ్వు నమ్మించి మోసగించావు. అందుకే ఏడుపొచ్చింది. ఇల్లువదలి అమ్మనుకాదని వచ్చినందుకు ఎంత పరాభవం? విడిపోదామని అంటున్నావు జాగ్రత్తగా ఆలోచించమంటున్నావు. స్వాతంత్ర్యమనీ, త్యాగమనీ నువ్వు చెబుతున్న మాటలకు యిదేనా అర్థం?'

'అదికాదు నటాలియా. అన్నమాటమీద నిలబడనని గాదు. నేననేదేమిటంటే...'

'అనేదింకేముంది? అదేదో యిదివరకే అనేశావు. మా అమ్మ మనిద్దరి పెళ్ళి కళ్ళతో చూసేకంటే, నా శవాన్ని చూడడమే తనకు పరమసంతోషమంది. 'అలాగైతే నన్ను యింకొకరికిచ్చి పెళ్ళిచేసేముందు నా శవాన్నే చూద్దువు గానిలే' అని నే నన్నాను. అప్పుడు మా అమ్మ అన్నదే యిప్పుడు నువ్వూ అంటున్నావు. ... మా అమ్మ చెప్పింది నిజం. నువ్వు నే నొక ఆటవస్తువు ననుకున్నావు.'

'అదేమిటి నటాలియా. ఎప్పుడూ రానిమాటలు నీనోటి వెంట...నమ్ము. నా మాట నమ్ము...'

నటాలియా అతను చెప్పే మాటల్ని మధ్యలో నే అడ్డి, 'అలా అనుకోకపోతే, యింకే మనుకున్నావు? ఎందుకు నన్ను మోసగించావు? ప్రేమిస్తున్నట్లు నటించావు ... ఏ అడ్డూ రాదని ప్రేమించేటప్పుడు అనుకున్నావా? నీతో నా కెందుకు? అవన్నీ మాట్లాడం నాకే సిగ్గుగావుంది ... సరే. అదంతా అయిపోయింది. జరిగిపోయిందాన్ని తవ్వుకుని లాభ మేమిటి?'

'అంత ఉద్రేకం కూడదు నటాలియా. కొంచెం ఓర్మి పట్టాలి. ధైర్యంగా, నిదానంగా మనిద్దరం కూర్చుని అన్నీ ఆలోచించుకొని ఏం చేయాలో అప్పుడు తేల్చుకోవాలి.'

'నువ్వు ఆత్మత్యాగమని, స్వార్థత్యాగమని మాటి మాటికీ చెబుతూవుండేవాడివి. జ్ఞాపకముందా? యిప్పుడు, ఈ నిముషంలో నిన్ను నేను ప్రేమిస్తున్నాను. కాని పెళ్ళి మాత్రం చేసుకోలేను. మన భవిష్యత్ ఎలా వుంటుందో

కూడా చెప్పలేను. నాతో రా, అను. నీ నోటితో ఆమాట అను. నేను అలాగే అని నీతో వస్తాను. దేనికైనా సిద్ధమే నేను. కాని నువ్వుమాత్రం సిద్ధంగాలేవు.'

రూడిన్ మొహం ఎర్రబడిపోయింది. నటాలియా తనను ప్రేమిస్తున్నందుకు ఉద్రేకంతో యిలా అన్నందుకు ఆనందించాడు. కాని నువ్వు సిద్ధంగా లేవు అన్నమాట అతన్ని గాయపరచింది.

'నటాలియా! నువ్వు నన్నెంత గాయపరుస్తున్నావో నీకు తెలియదు. సరేలే. ఆసంగతి తరవాత నీకే తెలుస్తుంది. నీవల్లకలిగే ఆనందాన్ని నేను త్యజిస్తున్నానంటె లోలోపల నేనెంత కుమిలిపోతున్నానో నీ కిప్పుడు అర్థంకాదు. నువ్వు జీవితంలో సుఖించడమే నాకాక్షాంక్షి. ఈలోకంలో నేనింకేమీ కోరను.'

'కావచ్చు. కావచ్చు. నీమాట నీకు సబబుగానే కనిపించవచ్చు. ఇంతవరకు నువ్వే సర్వస్వ మనుకున్నాను. నిన్ను నమ్మాను. నీమాటలు నమ్మాను. కాని ఒక్కటిమాత్రం కోరుతున్నాను. ఇకముందు నువ్వేమి మాటాడినా ఆలోచించుకొని మరీ మాట్లాడు. చూచిచూచి మాటాడు. పొల్లుమాటల వల్ల ప్రయోజనమేమిటి? నిన్ను నేను ప్రేమించాను. మనసారా ప్రేమించాను. ప్రేమంటేఏమిటో నాకు తెలుసు. కనుకనే తెగించి వచ్చాను...అన్నీ వదులుకొని వచ్చాను. అమ్మను కాదన్నాను. ఎదిరించాను...ఇలా వచ్చినందుకు తగినశాస్తి జరిగింది. జన్మజన్మాలకి మర్చిపోలేని శాస్తి...మొహ,

మొహాలు చూచుకుంటూ యింక యిక్కడ నేనెందుకు? వెడతాను.'

'నీకు పుణ్యముంటుంది, వెళ్ళిపోకు నటాలియా. నన్ను అంత కోప్పడ్డానికి, నేనేంజేశానని? ఎందుకలా యీసడిస్తావు? నా మొహం చూడ్డమే మహాపాపమన్నట్లు, ఎందుకంతద్వేషం? నేనే నువ్వనుకో. యిదేపరిస్థితుల్లో చిక్కుకున్నావనుకో. అప్పుడు నువ్వు ఏంచేస్తావు? నేనొక్కణ్ణేఅయితే పేచీ పూచీలేదు. యిప్పుడు యిద్దరం. నువ్వు, నేను. నీ మంచిచెడలు, నీభారంకూడా నేను భరించకలగాలికదా? భక్తుడు దేవిని ఆరాధించినట్లు నిన్ను నేను ప్రేమిస్తున్నాను. ఆ ప్రేమే, నీమీద నాకు లేకపోతే, 'పెళ్ళి చేసుకోకపోయినా, నీతో లేవస్తాననీ, ఉంటానని నువ్వు అన్నప్పుడు, వెంటనే సరే అనేవాడిని. కొన్నాళ్లుపోతే మీ అమ్మకూడా ఊరుకునేది...తరువాత... కాని నేనుసుఖపడ్డం ఎలాగా? అని ఆలోచించేముందు—'

ఈమాట అని రూడిన్ తననుతానే అదుపులోపెట్టుకున్నాడు. నటాలియా ఆ మాటల్ని గణించకుండా అతనివంక నిశ్చలంగా చూస్తున్నది.

'నాకు తెలుసులే. ఆడితప్పనివాడిలా, మాటమీద నిలబడేలా, నన్నింకా నమ్మించాలనుకుంటున్నావు. నువ్వు మర్యాదస్తుడివే. నాకేం సందేహంలేదు. నీ గుణాలు ఎలాంటివో తెలుసుకుందుకా—యిప్పుడు నేనిక్కడికివచ్చింది?'

'నటాలియా! యిలా అవుతుందని...'

'నీ వెప్పుడూ అనుకోలేదు. నేనిలా రాగలుగుతాననీ అనుకోలేదు. పోనిలే. గాభరాపడకు. నాకు తెలిసింది;

నువ్వు నన్ను ప్రేమించడంలేదని. నువ్వు నన్ను ప్రేమించక పోతే, నీ కాళ్లావేళ్లా పడవలసిన అగత్యం నాకూ లేదు.'

'నువ్వు నా ఆరాధ్యదేవతవు నటాలియా!'

'నేనేం దేవతనుకాదు రూడిన్. మనిషిని. దేవతల్ని ఆరాధించేవాళ్లు. మనుష్యుల్ని ఎందుకు ఆరాధిస్తారు? ఆరాధనమాటకేం. నాలాంటిదాన్ని నువ్వెలా ప్రేమిస్తావు? అప్పుడు నువ్వన్నమాటలన్నీ, యిప్పుడు ఒక్కొక్కటే జ్ఞాపకానికొస్తున్నాయి. సరిసమానస్తులమధ్యకాని ప్రేమ ఫలించదని, నువ్వోసారి నాతో అన్నావు, జ్ఞాపకముందా? అవును. 'సమానవియ్యం సమానకయ్యం...' నేను నీకు తగుదునా? నువ్వు అందలంమీద వున్నావు. నేను నేలమీదున్నాను... నువ్వు అందాలపురుషుడివి. నేనో అనాకారిని. తగినదాన్నే పెళ్లాడతావు... తెలియక పొరపాటు, నాకు మంచి శాస్తే జరిగింది. ఈరోజు నాజీవితంలో మర్చిపోలేను...శలవిప్పించు మరి...'

'వెళ్ళిపోతున్నావా నటాలియా? యిలాగ మనం ఒకళ్ళకొకళ్ళం దూరమై పోవలసిందేనా?'

రూడిన్ గాద్గదికంగా ఆమెను ప్రార్థించాడు. చేతులను ముందుకు చాచాడు. వెళ్ళిపోతున్న నటాలియా అతని దీనస్వరం విని ఆగిపోయింది.

'దూరంకాక ఏమౌతాం?...ఏదో అనేశాను. సన్నిపాత జ్వరం వచ్చినట్లు, కన్నూ, మిన్నూ గానక చిత్తంవచ్చినట్లు ప్రవర్తించాను. నా హద్దుల్లో నేనుండాలి...ఎలావచ్చానిక్కడికి? ఎందుకొచ్చాను? ఎవరికోసం? దేనికోసం? ఇక్కడికి

వస్తూ యిక పుట్టింటికీ, నాకూ సంబంధం లేదనుకున్నాను. పుట్టింటిఆశ మరి లేదనుకున్నాను. నా తలిదండ్రు లెవరో, వాళ్లు నన్ను ఎలా పెంచారో, నేనెవర్నో, అన్ని మర్చి పోయాను. ఇంతావస్తే ఏమైంది? ఇక్కడ నాకు ఎదురుపడిం దెవరు? ఒక పాషాణహృదయం. నువ్వేమన్నావు? 'మీఅమ్మ మనపెళ్ళికి ఒప్పుకోదు. ఒప్పుకోపోతే యింకేమిచేయను' అని కదా నువ్వన్నది? అందర్నీ కాదని తెగ తెంపులు చేసుకొని నేనొస్తే, 'నువ్వెలా తెగతెంపులు చేసుకుంటావు?' అని నువ్వు అంటున్నావు. ఇప్పుడు నాఎదుట నిలబడింది అప్పటి రూడినేనా? ప్రేమ, స్వేచ్ఛ, ప్రణయం, ఆనందం అని పెద్ద పెద్ద కబుర్లుచెప్పిన రూడినేనా? ఉహు! ఆ రూడిన్ కాదు... వెడతాను...ఇప్పటికైనా నన్ను నువ్వు ప్రేమించావను... ప్రేమించు...రమ్మను...ఒద్దు, ఒద్దు. అందలంమీంది అందాల పురుషులతో...'

నటాలియా దెబ్బతిన్న లేడివలె యింటివైపు మరలింది. కొంచెందూరంలో సరుగుడుతోటలమధ్య యింతసేపూ నిరీక్షిస్తున్న పరిచారిక మాషా, పరిగెత్తుకువస్తున్న నటాలియాను, త్వరగా రమ్మని చేతులతో సౌంజ్ఞ చేస్తోంది. వెళ్ళిపోతున్న నటాలియావంక తిరిగి రూడిన్ 'నేనుకాదు పిరికివాణ్ణి. నువ్వే' అని బిగ్గరగా అన్నాడు. అతని మాటను వినిపించుకోకుండా, చేలకడ్డుపడి నటాలియా యింటివైపు వెళ్ళిపోతోంది.

తన గదిలోనికి భద్రంగా చేరుకొని మాషా చేతుల్లో మూర్ఛవచ్చినదానివలె ఒరిగిపోయింది.

ఆ కొలనుచెంత చింతతోపులమధ్య రూడిన్ ఆలోచిస్తూ అలాగే ఉండిపోయాడు. చిట్టచివరికి తెప్పరిల్లి మెల్లగా అడుగులువేస్తూ భవంతివైపు నడవసాగాడు. గాయంతగిలిన పిట్టవలె హృదయం కొట్టుకొనసాగింది. 'ఏమిటీపిల్ల, పద్ధెనిమిదేళ్లు! అంతే వయస్సు! ఎలా గాయపరచింది? ... ఆ పిల్ల తత్వం నాకు తెలుసునా? తెలియదు. నే నెప్పుడైనా చూశానా? యిలాంటి పిల్లను నే నెప్పుడూ చూడలేదు. రోషం, మానసం, తెగువా, చొరవా ... అంత రోషంలో కూడా, ఒక్క తప్పుమాట ఆడిందా? లేదు. ఆవిడ అన్న మాటలు నిజమే. నేను ప్రేమించిన ప్రేమకంటే, యింకా అధికమైన, ఉత్తమ ప్రేమకే ఆమె అర్హురాలు. అయితే నా ప్రేమ అల్పాతి అల్పమైనదనా? ఆమెను నేను ప్రేమించానా? ప్రేమించానని భ్రమించానా? భ్రమించడం? అంతేనేమో? అంతేనా? అయితే ఆ భ్రమ యింక యిప్పుడు మాత్రం లేదా? చివరికి జరిగిందిది. ఆమెముందు ఎంత నిర్భాగ్యుడిలా, ఎందుకూ పనికిరానివాడిలా ప్రవర్తించానే!'

అర్ధనిమీలిత నేత్రాలతో, చింతాక్రాంతహృదయంతో బాటవెంట రూడిన్ తనకు తెలియకుండానే అడుగులు వేస్తున్నాడు. బాటమ్మట వస్తున్న గుర్రపుబగ్గీ చప్పుడుకు కళ్ళెత్తి చూశాడు. బగ్గీని తోలుతూ, లెజ్నోవ్ తనవైపే వస్తున్నాడు. ఒకరినొకరు కళ్ళతోనే పలకరించుకున్నారు. ఏమితట్టిందోగాని, మెల్లగా నడుస్తున్నవాడల్లా హఠాత్తుగా పెద్ద పెద్ద అంగలువేయజొచ్చాడు. లాసున్స్కాయా యింటివైపు వెళుతున్న రూడిన్‌ను కనిపించేవరకు బగ్గీని ఆపి లెజ్

నోవ్ పరిశీలిస్తున్నాడు. అతను అదృశ్యమయేసరికి తాను తనదారినిపోకుండా బగ్గీని మళ్ళీ వెనక్కిమళ్ళించాడు. తిన్నగా పావ్‌లోవిచ్ యింటికి వచ్చాడు. ఆ రోజల్లా అక్కడే వుండి పోయాడు.

# 10

పావ్‌లోవిచ్ యింకా నిద్రపోతూనే వున్నాడు. నిద్రపోతున్నవాణ్ణి లేపడం ధర్మంకాదని లెజ్‌నోవ్ చుట్ట కాల్చుకుంటూ మేడమీది వరండాలో కూర్చున్నాడు. పావ్‌లోవిచ్ లేచేసరికి పదిగంటలైంది. లెజ్‌నోవ్ తనకోసమే చూస్తున్నాడని తెలియగానే, రా, రమ్మని గదిలోపలికి పిలిచాడు.

'ఇంటికి వెళ్ళిపోతానన్నావుగా ? యింతలో మళ్ళీ వెనక్కి వచ్చావేం ?'

'వెడదామని అనుకున్నాను. దారిలో రూడిన్ కనిపించాడు. ఒక్కడూ చింతతోపులవద్ద, దెయ్యాల కొలను దగ్గిర తిరుగుతున్నాడు. మనిషి మామూలుగాలేడు. ఏదో జరిగుంటుంది.'

'దారిలో రూడిన్ కనిపిస్తే, నువ్వు వెనక్కి వచ్చేశావన్నమాట.'

'రూడిన్‌ను చూడగానే, నిన్ను కలుసుకోవా లనుకున్నాను.'

'రూడిన్ కనిపిస్తే నేను, నేను కనిపిస్తే రూడిన్, నీకు జ్ఞాపకమొస్తూ వుంటామన్నమాట.'

స్నేహితులిద్దరూ టి తాగుతూ పొలాలనుగురించి, పంటలగురించి మాట్లాడుకుంటున్నారు. లెజ్‌నోవ్ రూడిన్ ప్రస్తావన ఆపివేశాడు. పావ్‌లోవిచ్ కుర్చీలోంచి గబుక్కున లేచి, టేబిల్‌మీద ఒక్కగుద్దు గుద్దాడు. గుద్దుకు టీ కప్పులు, సాసర్లు దొర్లిపడ్డాయి.'

'ఈ శషభిషలు నాదగ్గర పనికిరావు. ఆ రూడిన్, ఆ మహామేధావిని పిస్టల్‌తో కాల్చిపారేస్తాను. లేదా నన్నే వాడు కాల్చి చంపనీ. ఏదోఒకటి జరగాలి.'

'అదేమిటి! ఆ కేకలు; ఉగ్ర నరసింహావతారమెత్తావే. అంత గుద్దు గుద్దడానికి ఆ టేబిల్ ఏంచేసింది? నానోట్లో పైపు కూడా పడిపోయిందే? ఏమిటా వీరావేశం?'

'వాడిపేరు నాదగ్గరఎత్తావా, ఒళ్లు మండుకొస్తుంది. 'రూ' అనే మొదటిఅక్షరం వినిపించిందా, నానెత్తురు సలసలా మరుగుకొస్తుంది.'

నేలమీదపడిన పైపునుతీసి తుడుచుకుంటూ లెజ్‌నోవ్ అతన్ని నెమ్మదిగా బుజ్జగించాడు.

'అంతకోపం దేనికయ్యా? 'తనకోపమె తన శత్రు' వని వినలేదూ?'

పావ్‌లోవిచ్ గదిలో పచారుచేస్తూ 'ఎంత అవమానపరిచాడు. నిలువునా నా పరువు తీసేశాడు. అనుకోకుండా వెనకనుంచివచ్చి వెన్నుపోటుపొడిచాడు. నేనెవరనుకున్నాడు? నిప్పుతో చెలగాటమాడుతున్నాడు. పిట్టను కొట్టినట్టు కాల్చి చంపుతాను.'

'మంచిపనే చేస్తావు. గొప్ప ప్రయోజకుడివే. అలా నువ్వు మనుష్యులను చంపితే పదిమందీ ఏమనుకుంటారు? మీ చెల్లెలు ఏమనుకుంటుంది? ఆ పిల్ల ...ముక్కుపచ్చలార లేదుగదా? ఆవిడేం కావాలి? నీ వీరావేశంలో, యివేవీ నువ్వు ఆలోచించలేవు. ఇంతకీ రూడిన్ చచ్చిపోతాడే అనుకుందాం అతన్ని చంపి నువ్వేం బావుకుంటావు? నటాలియా నిన్ను ప్రేమిస్తుందా?'

పావ్‌లోవిచ్ హతాశుడై పడకకుర్చీలో కూలబడ్డాడు. 'అలాఅయితే యిక యిక్కడ నేను ఉండనే వుండను. ఎక్కడి కైనా వెళ్ళిపోతాను. యిక్కడ అంతా బందిఖానా. నేనొక ఖైదీని.'

'చంపడంకంటే అదే మంచిది. నువ్వు ఒక్కడవే ఏమిటి? నేనూ వస్తాను. పద, ఇద్దరం కాకసస్సో, యిుక్రే నియావో పోదాం.'

చెల్లెలి నొక్కర్తెనే ఒదిలిపెట్టి మనం ఎక్కడికో పోతామా?'

'ఆవిణ్ణీ రమ్మందాం. వస్తానంటే అన్ని ఏర్పాట్లు చేస్తాను.'

'ఇల్లు వదిలిపెట్టి పోవడమా? ఊరుకదిలి పోవడమా? యిక్కడే వుండి వా డంతేదో కనుక్కుంటాను.'

'మళ్ళీ అదేమాటా? ఏమిటీ వేళ యిలా చిందులు తొక్కుతున్నావు. ఏదైనా పూనిందా?'

దీనికి పావ్‌లోవిచ్ ఏమి సమాధాన మిచ్చునోగాని, యింతలోనే, ఉత్తరంపట్టుకొని నౌకరొకడు లోనికివచ్చాడు. లెజ్‌నోవ్ ఉత్తరాన్ని చూసి,

'ఏమిటదీ? ఎవరిచ్చారు?' అన్నాడు.

'డిమిట్రీ నికొలోవిచ్ రూడిన్ రాశారండి.'

'పట్టుకొచ్చిం దెవరు?'

'అమ్మగారి నౌకరండి'

'రూడిన్ రాశాడా? ఎవరికి?'

'మీకేనండి'

'నాకా? ఏదీ, యిలా తే'

నౌకరు యివ్వకుండానే, చేతులోంచి ఉత్తరాన్ని పావ్లోవిచ్ చటుక్కున లాక్కున్నాడు. పక్రున చించి ఒక్క-చూపులో అంతా చదివేడు. చదువుతున్నప్పుడు, యింత ఆవేశం ఎక్కడికి పోయిందోగాని, మొహంలో అతిశయం తొంగిచూసింది. మందహాసం కనిపించింది. ఆశ్చర్యంతో చేతులు రెండూ చాచి నిలబడ్డాడు.

'ఏమిటి రాశాడయ్యా?'

'నువ్వే చదువు' అంటూ పావ్లోవిచ్, ఉత్తరం అతని చేతుల్లో పెట్టాడు. లెజ్నోవ్ ఉత్తరం చదువుతున్నాడు. రూడిన్ వ్రాసిన ఉత్తర మిది:

ప్రియమైన సెర్జీ పావ్లోవిచ్,

'ఈవేళే లాసున్స్కయా యింట్లోంచి వెళ్ళిపోతున్నాను. ఇదే ఆఖరిసారి. నే నిలా వెళ్ళిపోవడం బహుశ మీకు ఆశ్చర్యంగానే వుండవచ్చును. అందులోనూ నిన్న జరిగిన సంఘటనదృష్ట్యా మీకు మరీ విస్మయంకలగవచ్చును. ఎందుకిలా వెళ్ళిపోతున్నానో, ఆ కారణాలన్నింటినీ చెప్పి ప్రయోజనంలేదు. కాని నే నిలా వెళ్ళిపోయేముందు, మీతో

చెప్పడం మంచిదని భావిస్తున్నాను. నేనంటే మీకు గౌరవం లేదనే సంగతి నాకు తెలుసును. పైగా నేనొక అమర్యాదస్థుడ ననీ, అల్పుడననీ మీ రనుకుంటున్నారు. ఇవేవీ కాదని నాలో ఏదోషం లేదని ఎవరిముందూ నేను రుజువు చేసుకోవలసిన అవసరం లేదు. అది కాలమే నిర్ణయిస్తుంది. నిష్కారణంగా ఒక వ్యక్తినిగురించి మరొకవ్యక్తి అపోహపడుతున్నప్పుడు, అతని అపోహ కేవలం ఆధారరహితమైనదని చెప్పి, నేను సాధించగలిగిం దేమీలేదు. అది నిరర్థకంకూడా. నన్నెవరైతే అర్థం చేసుకుంటారో, వాళ్లు నన్ను క్షమించగలుగుతారు. ఎవరైతే అర్థం చేసుకోరో, చేసుకోలేరో, వాళ్లు నన్ను నిందిస్తే, నేనేమీ చలించను. మిమ్మల్ని చూసి ఏమో అనుకున్నాను. ఇప్పటికీ నాదృష్టికి మీరు ఉదాత్తహృదయులుగానే కనిపిస్తున్నారు. కాని మీరు ఏ పరిస్థితులకు అంటిపెట్టుకునివున్నారో, ఆపరిస్థితులను అధిగమించి, యింకా ఉన్నతంగా, విశాలంగా ఉదారహృదయంతో ఆలోచించ గలుగుతా రనుకున్నాను. అలాభావించడమే నా పొరపాటు. జీవితంలో యిలా అనుకుంటూనే మళ్ళీ నేను పొరబడుతూవుంటాను. ఇది మొదటిసారి గాదు. ఆఖరిసారి గాదు. అంతేలెండి. నేను వెళ్ళిపోక తప్పదు. మీరు సుఖించాలని నా అభిలాష. మీరు సుఖంగా వుండాలనే నాకోరిక నిరాపేక్షణీయమైనది. ఇక మీరు హాయిగా, నిశ్చింతగా ఉంటారని విశ్వసిస్తున్నాను. నామీద మీకున్న అభిప్రాయాన్ని మార్చుకుంటారని నా నమ్మకం. మనం మళ్లీ కలుసుకుంటామో, లేదో ఎవరికి తెలుసు!

భవదీయుడు,

డి. ఆర్.

తీరా ఉత్తరమంతా రాసేశాక మీకు నేను డబ్బివ్వాలనే విషయం గుర్తుకొచ్చింది. మీ దగ్గర పుచ్చుకున్న చేబదులు రెండువందలూ మా గ్రామం చేరగానే పంపిస్తున్నాను. నేనిలా ఉత్తరం వ్రాశాననే సంగతి లాసున్స్కీయాకు తెలియనీయవద్దని నా ప్రార్థన.

ఇంకో ముఖ్యమైన ఆఖరి విజ్ఞప్తి: ఆవేళ మీరూ నేనూ కలుసుకున్న విషయం, నటాలియాకు ఎన్నడూ చెప్పరనే ఆశిస్తాను...'

లెజ్నోవ్ ఉత్తరం చదివేక, అతన్ని పావ్లోవిచ్ యిలా ప్రశ్నించాడు. 'ఎలావుంది ఉత్తరం. ఏమంటావు?'

'ఏమనడాని కేముంది? నోట్లో వేళ్లుపెట్టుకొని ఆశ్చర్యపోవడమే. రూడిన్ వెళ్ళిపోతున్నాడన్న మాట. పీడ వదిలిందిలే. ఈ ఉత్తరం నీకు రాయడం, తనకొక విధట. నిన్ను చూడ్డంకూడా అందుకే మానేశాడట. ఆ పెద్దమనిషి ఏం పని చేసినా అదొక విధి. అదొక బాధ్యత. ప్రపంచాని కేదో రుణపడివున్నట్టు రూడిన్ మాట్లాడుతూంటాడు. ఎంత ఆశ్చర్యం!'

'మామూలుగా మాట్లాడతాడా? పెద్దపెద్ద మాటలు. పెట్టకొంచెం కూతఘనం. నన్ను చూసి ఏమో అనుకున్నాడట. ఏ పరిస్థితుల కంటపెట్టుకొని ఉన్నానో వాటిని అధిగమించి, ఉదారహృదయంతో నేను ఆలోచిస్తాననుకున్నాడట... హరి వీడిదుంపతెగా! ఏమిటి ఆ రాత? ఏమిటా మాటలు? కవిత్వమే అనుకుంటే అంతకన్నా చండాలంగా ఉందే?'

లెజ్‌నోవ్ ఏమీ మాటాడలేదు. మిణుగురులులా ఒక్కసారి కన్నులు మెరిశాయి. పావ్‌లోవిచ్ కుర్చీమీద నుంచి లేచి, 'లాసున్‌స్కయానే అడుగుతాను. యీ మాటల కర్థం ఆవిడే చెప్పాలి' అన్నాడు.

'తొందరపడకు. కాస్త ఆగు. పరుగెత్తి పాలుతాగే కంటె నిలబడి నీళ్లుతాగడం మంచిది. ఊళ్లోనుంచి ముందు ఆ రూడిన్‌ను వెళ్ళిపోనీ. అత నుండగా, నువ్వెందు కక్కడికి వెళ్ళడం? ఇంతకీ ఆ ఉత్తరంతోటీ, అర్థాలతోటీ నీ కేమిటి సంబంధం? అత నెలాగా పోనే పోతున్నాడు. అంతకన్న నికేం కావాలి? నిశ్చింతగా గుండెలమీద చెయ్యివేసుకొని పడుకో. రాత్రల్లా నిద్ర లేదులాగుంది. రోజులు కలిసొస్తున్న యిలే.'

'అంత సులభమని ఎలా అనుకుంటున్నావు?'

'రూడిన్ వెళ్ళిపోతే సులభం కాదూ? నిజంగానే నిశ్చింతగా పడుకో. నేను పావ్‌లోవ్నా దగ్గరికి వెళ్ళివస్తాను.'

'నాకు నిద్ర రావడంలేదు. వచ్చినా నే నెందుకు నిద్ర పోవాలి? చేలోకెళ్ళి వస్తాను.'

'అదీ మంచిదే. చేను బాగా యీనినట్టే వుంది.'

♦ ♦ ♦

లెజ్‌నోవ్ వెళ్లేసరికి పావ్‌లోవ్నా తనగదిలో ఉంది. అతన్ని చూడగానే 'రండి, రండని' మర్యాదగా ఆహ్వానించింది. అతన్ని కలుసుకోవడమంటే ఆమె కెంతో సంతోషం. చూసిన వెంటనే మోము వికసిస్తుంది. కాని యిప్పుడు మాత్రం గదిలో మొహం జేవురించుకొని కూర్చుంది. మొన్న

రూడిన్ రాక ఆమెను కలవరపరచింది. లెజ్‌నోవ్ కుర్చీలో కూర్చోగానే ఆమె 'మా అన్నయ్యను చూశారా? ఈపూట ఎలా వున్నాడు?' అని ఆతృతతో ప్రశ్నించింది.

'అతనికేం. నిక్షేపంలా వున్నాడు. పొలంలోకి పోయి వస్తానని బయలుదేరాడు.'

వాసిల్యేవ్నా క్షణంసేపు మౌనంగా నిలబడి, తన జేబురుమాలుతో చెక్కిళ్లను అద్దుకొంటూ 'మొన్న మన యింటికి ఎందుకొచ్చాడంటారు?'

'రూడిన్ మాటేనా? ఊళ్లోనుంచి వెళ్ళిపోయేముందు చెప్పిపోదామని వచ్చాడు.'

'ఏమంటున్నారూ? ఊళ్లోనుంచి వెళ్లిపోవడమా?'

'ఆఁ. మళ్ళీ తిరిగిరాకుండా. నీకింకా తెలియదన్న మాట. ఈ ఊరికి అతనికి యిక చెల్లు.'

'వెళ్ళిపోతున్నాడా?'

'అది అందరికీ మంచిదేగదూ? ఆ మాట అతనే చెప్తున్నాడు.'

'మంచేమిటి? మరి ఆ... వ్యవహారం?'

'అది వేరేవిషయం. చిక్కుల్లోపడింది. యిద్దరికి ఏదో వచ్చివుంటుంది. మధ్యలో బెడిసింది. తాడు గట్టిగాలాగుంటాడు. తెగిపూరుకుంది.'

'నాతో హాస్యమాడుతున్నావు గామోసు. అలా ఎప్పుడూ జరిగుండదు.'

'అది దేముడికే తెలియాలి. అతను వెళ్ళిపోతున్నాడు. వెళ్ళిపోయే ముందు, వెళ్ళిపోతున్నానని ఉత్తరం రాశాడు.

అంతవరకూ నాకు తెలుసు...అతను వెళ్లిపోవడం, మీఅన్నకు లాభమేగాని నాకొచ్చింది నష్టం. వేసుకున్న పథకమంతా తల్లక్రిందులై పోయింది.'

'పథకం! ఏమిటా పథకం?'

'మీ అన్నా నేనూ కులాసాగా దేశం చూసొద్దామనుకున్నాం. నిన్నుకూడా తీసుకెడదామనుకున్నాం. నీకేమీ ప్రయాణంలో బడలికలేకుండా నేను చూసుకుంటానన్నాను.'

'నువ్వు నన్ను ఎలా చూసుకుంటావో నాకు తెలుసుగా. నువ్వు వేరే చెప్పాలా? నీవెంటవుంటే నే నాకలితో మాడి చచ్చిపోవలసిందే.'

'నువ్వు మాడతావో లేదోగాని, నువ్వు ఎదుటవుంటే నాకు ఆకలి, దప్పికలుండవు. నిన్నుచూస్తూ రాతిబొమ్మలా రోజులతరబడి అలాగే కూర్చుండిపోతాను.'

'నువ్వు రాతిబొమ్మలా, ఎలా కూచుంటావో చూడాలసివుంది.'

'అంత చూడాలనివుంటే యిప్పుడే పెళ్ళాడు. యిక్కడే రాతిబొమ్మ నై పోతాను.'

'ఏమన్నావు? ఏమన్నావు?' అంటూ పావ్‌లోవ్నా కుంగిపోతున్నట్టు కళవళపడింది. శరీరం జలదరించింది. కళ్లు ఎర్రబడ్డాయి. 'ఏమన్నాను. వెయ్యిసార్లు అందామని నాలుక చివరిదాకావచ్చి ఆగిపోయినమాటే అన్నాను. నే నన్నానా? అదేవచ్చింది. యిప్పుడే పెళ్ళాడమనిగాదు. ఎప్పుడో ఒకప్పుడు.

కోపం తెచ్చుకోకుండా వుంటే, ఒక ప్రార్థన. ఆలోచించుకొని నీ ఉద్దేశమేమిటో చెప్పు.'

వెళ్లివస్తానని లెజ్నోవ్ లేచాడు. ఆమె అతన్ని ఆగమనే లోపునే గబగబా వెళ్లిపోయాడు. పావ్లోవ్నా తోటలోనికి వెళ్లి గేటుకు ఆనుకొని అతను వెళ్ళబోయే దారివంక చూస్తోంది. గేటుకు కొంచెం దూరంలోవున్న లెజ్నోవ్, ఏదోమాటవినపడి వెనక్కి తిరిగి చూశాడు. వెనకాలే పరిచారిక పరిగెత్తుకొచ్చి 'మా అమ్మగారు రమ్మంటున్నారండి. వెళ్ళొద్దంటున్నారు' అని చెప్పింది.

లెజ్నోవ్ హృదయం గగుర్పొడిచింది. శరీరం పులకరించింది. ఆనందంతో మోము వికసించింది. శుభవర్తమానం తెచ్చినందుకు పరిచారికను ఎలా అభినందించాలో తెలియక, పావ్లోవ్నా యింటివైపు బయలుదేరాడు.

# 11

తోమరకొలనుదగ్గర లెజ్నోవ్ కనిపించినంతనే చరచరా యింటికివచ్చి రూడిన్ గదితలుపులు రెండూ బిగించుకున్నాడు. వెంటనే కాగితం కలం తీసి పావ్లోవిచ్ కి ఉత్తరం వ్రాశాడు. రెండో ఉత్తరం ఒకంతకి తెమిలిందికాదు. రాసింది కొట్టివేస్తూ, మళ్ళీ రాస్తూ, పంక్తులను మారుస్తూ గంటల తరబడి కూర్చున్నాడు. రాయడం పూర్తిఅయ్యాక తళతళ మెరిసే అందమైన కాయితంపై ముత్యాల దస్తూరితో తిరిగి వ్రాశాడు. నాలుగైదు మడతలుపెట్టి జేబులో భద్రపచ్చుకున్నాడు.

విషణ్ణవదనంతో గదిలో కాసేపు తచ్చాడాడు. కుర్చీలో చేతులమీద గడ్డం ఆనించుకొని ఆలోచనా నిమగ్నుడై కూచుండిపోయాడు. ఒక్కొక్క కన్నీటిబొట్టే కారుస్తూ చింతాక్రాంతహృదయంతో మోము కిందకు వంచుకున్నాడు. చటుక్కునలేచి కోటుబొత్తాలు సరిచేసుకొని గది తలుపు తెరిచి నౌకరును రమ్మని కేకవేశాడు. 'అమ్మగారేంజేస్తున్నార్రా? తీరుబడిగా వున్నారా?' చూసివస్తానని నౌకరు క్షణంలో తిరిగివచ్చి 'అమ్మగారు మిమ్మల్ని రమ్మంటున్నారండి' అని చెప్పాడు. రూడిన్ లాసున్స్కయా గదిలోనికి వెళ్ళాడు. ఆవిడ బీరువాల్లోని పుస్తకాలను పరిశీలిస్తూ నుంచుంది. పాండలవిస్కీ ఎప్పుడూ లేనంత హుషారుగా, కీవిగా కూచున్నాడు. రూడిన్ గదిలోనికి కాలుబెట్టేసరికి ఆమె మర్యాదగా ఆహ్వానించింది అతను నమస్కరించి నవ్వుతున్న యిద్దరివంకా చూశాడు. ఆమె పలకరింతలో మునుపటి చనువు, ఆపేక్ష లేవు. తను మొదటిసారి వచ్చినప్పుడు ఆవిడ యిలాగే పలకరించింది. ఆమె పలకరింతలో అయిష్టతకూడా పొడగట్టకపోలేదు. ఆవిడకు కోపం వచ్చిందని రూడిన్‌కు తెలుసును. ఏమి జరిగిందో రూడిన్ ఎరుగునని ఆమెకూ తెలుసును. నటాలియాతో కూడని చనువుతో మాట్లాడుతున్నాడని లోలోపల లాసున్స్కయా చురచురలాడుతూనేవుంది. ఆనాడు పాండలవిస్కీ రూడిన్ ప్రేమకలాపాలు చెప్పేసరికి ఎగిరిపడింది. ఉన్నవీ, లేనివీ మరి రెండు పుట్టగించి పాండలవిస్కీ అగ్నిలో ఆజ్యం పోశాడు. రూడిన్ నిరుపేద. ఊరూపేరూ లేదు. ఇల్లూ వాకిలీలేదు. అతనెవరో,

శ్రీ వేమన గ్రంథాలయము
(కృష్ణాజిల్లా)

అతని తలిదండ్రు లెవరో ఆమెకు తెలియదు. గాలికి పుట్టి, ధూళికి పెరిగి పూపతి ఏమీలేని ఎవడో ఒక అనామకుడు తన కూతురుతో ప్రేమకలాపాలు సాగించడానికి ఎంత సాహసం కావాలి! నటాలియా ఏమనుకుంటున్నాడు? జమిందారిణి డార్యా మిఖిలోవ్నా లాసున్‌స్కయా కూతురు. ఒక్కగా నొక్క కూతురు. 'సరే, అతను తెలివైనవాడే ననుకుందాము. మహామేధావే కావచ్చు. అయితే దానికి దీనికి సంబంధ మేమిటి? ఎవడుపడితేవాడు నా కల్లుడు కాగలడా?' అని ఆనాడే పాండలవిస్కీముందు మండిపడింది. పాండలవిస్కీ మంటను మరింత ఎగతోస్తూ, 'నా కళ్ళను నేనే నమ్మలేక పోయా నమ్మగారు! ఎంతదారుణం? ఎంత అఘాయిత్యం? ఎవరితో మాట్లాడుతున్నాడో, ఏమి మాట్లాడు తున్నాడో, తను ఎక్కడున్నాడో తెలుసుకోవద్దండీ!' లాసున్‌స్కయా కళ్లు చింతనిప్పుల్లా చేసుకొని నటాలియాను పిలచి, పరిపరివిధాల ప్రశ్నించి, కోప్పడింది.

రూడిన్ గదిలో అలాగే నుంచుండిపోయాడు. అతను వచ్చిన సంగతి మర్చిపోయినట్లు జమిందారిణి నటించసాగింది. పుస్తకాలు చూస్తున్నదల్లా వెనక్కితిరిగి యింకా నుంచునే వున్నారా? అన్నట్లు కుర్చీకేసి చూసింది. రూడిన్ కుర్చీలో కూచున్నాడు. ఇదివరకు రూడిన్‌స్థితి వేరు. అప్పుడు యించు మించు యింటి పెత్తనమంతా అతనిదే. ఇప్పటి రూడిన్ పరిస్థితివేరు. తనకు చిరపరిచితుడు కాకపోతేమానె; పరిచయ స్తుడే కానట్లు ఎవరో, అతిథి వచ్చినట్లు, ఆ అతిథికూడా పరాయివాడే నన్నట్లు ఆమె ప్రవర్తించసాగింది. ఇదంతా ఒక

మెరుపులాగ, ఒకతృటిలో నీరు గడ్డకట్టినట్టు జరిగిపోయింది. రూడిన్ గొంతు సవరించుకుని 'యిన్నాళ్లు మీ యింట్లో ఉన్నందుకు కృతజ్ఞుణ్ణి ... మా వూరునుంచి నన్ను రమ్మని కబురువచ్చింది. ఈవేళే వెళ్ళిపోదామనుకుంటున్నా.' జమీందారిణి రూడిన్‌వంక కోరచూపులు చూచింది. 'నేనే వెళ్ళిపొమ్మనేలోపున అతనే వెళ్ళిపోతానంటున్నాడు. సిష్టాచారం తెలిసింది. తెలివైనవాడే. అంతా ముందే గ్రహించినట్టున్నాడు' అని అనుకుని బయటకుమాత్రం యిలా అంది.

'అంత తొందరగా వెళ్ళడానికేమొచ్చింది? తప్పనిసరైతే వుండమని బలవంతపెట్టడం భావ్యంకాదు. శీతాకాలంలో మాస్కో వెళ్ళిపోతున్నాం. అక్కడ మీరు మమ్మల్ని కలుసుకుంటారుగదూ?'

'మాస్కో రాగలనో లేదో చెప్పలేనండి. రావడానికి అవకాశముంటే మిమ్మల్ని చూడడానికి తప్పకుండా వస్తాను.'

'ఇంత హఠాత్తుగా వెళ్ళిపోతున్నారే? ఎవరికైనా ఒంట్లో బాగోలేదా?

'అదేంకాదు...మీయింట్లో యిన్నాళ్ళూ ఉన్నందుకు నా కృతజ్ఞతను ఎలా చెప్పుకోగలను!'

'మీరు మాయింట్లో ఉన్నందుకు, మీ పరిచయం కలిగినందుకు నాకెంతో సంతోషంగావుంది...మీరు ఎప్పుడు బయలుదేరుతున్నారు?'

'ఈవేళే, భోజనంచేశాక.'

'అంత వేగంగానా? శుభం. సుఖంగా వెళ్ళిరండి.

ఈలోపున మీపనులేవో తెములితే మమ్మల్ని చూడ్డానికి మీ రిక్కడికే రావచ్చును.'

'పనులు అంత సులభంగా తెములవనుకుంటాను.' అంటూ రూడిన్ కుర్చీలోంచి లేచాడు. 'మన్నించండి. ఒక్క మాట. యిప్పుడే మీ బాకీ తీర్చలేకపోతున్నాను మన్నించండి. మావూరు వెళ్ళినవెంటనే...'

'ఏమిటా మాటలు రూడిన్? నా ఋణంమాట ఎవరెత్తారు? యిదా సమయం?'

పాండలవిస్కీ తనజేబులోంచి గడియారంతీసి 'అబ్బో. రెండున్నర అయిపోయిం దమ్మగారూ!' అని హెచ్చరించాడు. జమీందారిణి రూడిన్ వంక తిరిగి 'పనుంది నే వెళ్ళొస్తాను.' అంటూ కదిలింది. రూడిన్ గదినుంచి నిష్క్రమించాడు. జరిగిన సంభాషణ జ్ఞప్తికి తెచ్చుకుంటూ 'యిదంతా నాటకం వేసే ముందు చేసుకునే రిహార్సల్సులాగుంది. తాము మాట్లాడేదేదో ముందే అనుకొని ప్రభుత్వాధిపతులు యిలాగే సమావేశాల్లో పాల్గొంటా రనుకుంటాను.' అంటూ తలపోయ సాగాడు.

(సమాజంలో పై అంతస్తులో కూచున్న భాగ్యవంతుల, పెట్టిపుట్టిన మహారాజుల తరహా వేరు. అవసరముంటే మనిషిని చేరదీసి, ఆ అవసరం కాస్తా తీరేక అవతలకు నెట్టిపారేస్తారు. భోజనం చేసేటప్పుడు ముందున్న దేమో విస్తరి, భోజనమయాక అది పుల్లాకు. లాటరీ అయిపోయాక పనికిరాని టిక్కట్టుని జేబులో అట్టే పెట్టుకోరు. దాన్ని చించిపారేసినట్లు మనుష్యుల్ని భాగ్యవంతులు అవతలికి తోసిపారేస్తారు. 'ఏరు

దాటేదాకా ఓడమల్లప్ప దాటేక బోడిమల్లప్ప,' లోకంలో నుచేరి సంతతంతా యింతే. యిది పరమసత్యం. దీనిని విస్మరించలేమని యిప్పుడిప్పుడే తనఅనుభవం కట్టించి చెబుతున్నట్టు అనిపించింది. ఆ యిల్లువదిలి ఎప్పుడు వెళ్లిపోతానా అనే ఆదుర్దాతో ఆక్షణంకోసం నిరీక్షిస్తున్నాడు. గబగబా గదిలోకివెళ్ళి, పెట్టెసర్దుకున్నాడు. పుస్తకాలు, బట్టలు అన్నీ జాగ్రత్తపర్చుకున్నాడు. రూడిన్ వెళ్ళిపోతున్నాడనే విషయం ఆనోటా ఆనోట యింట్లో అందరికీ తెలిసింది. నౌకర్లు విస్తుపోయారు. దూరపుబంధువులు ఆశ్చర్యపడ్డారు. బెసిస్టోవ్ విచారంతో కృంగిపోయాడు. నటాలియా అతనికి కనిపించకుండా ఆ మూలా యీ మూలా మసులుతోంది. అతనిమొహం యిక చూడకూడదనుకొని భీష్మించుకు కూచుంది. ఆమెను ఎలాగైనా ఒకసారి రూడిన్ చూడాలనుకున్నాడు. అతికష్టంమీద అతని ప్రయత్నం నెరవేరింది. తను ఆమెకు వ్రాసిన ఉత్తరాన్ని, ఆమె చేతులలో రహస్యంగా పెట్టాడు. భోజనాలవేళ అంతా సహపంక్తిని కూచున్నారు. వెళ్ళిపోయేముందు ఒకసారి రూడిన్‌ను కలుసుకోవాలని జమిందారిణి వాంఛించింది. కాని రూడిన్ దీనికి ప్రత్యుత్తరమేమీ యీయలేదు. పాండలవిస్కీ అతనితో మాటాడాలని ప్రయత్నించాడు. డేగ కోడిపిల్లను తన్నుకుపోయినట్లు పాండలవిస్కీ భరతంపట్టాలని రూడిన్ గురగురమన్నాడు గాని, సంబాళించుకున్నాడు.

ఆరుగంటలైంది. బండి ఇంటిముందు ఆగింది. రూడిన్ 'వెళ్ళివస్తా'నని అందరిదగ్గిరా సెలవు తీసుకున్నాడు. హృదయం

భారమైంది. గొంతుక బొంగురుపోయింది. ఈవిధంగా యింత అవమానంతో తాను వెళ్ళిపోవలసివస్తుందని కలలోకూడా ఊహించలేదు. ఇంట్లోంచి తాను వెళ్ళిపోతున్నట్టుకాక తన నెవరో మెడబట్టి గెంటుతున్నట్టు బాధపడ్డాడు. 'సరే! జరగ వలసిం దేదో జరుగుతుంది' అనుకుంటూ అందరికీ నమస్క రించాడు. వెళ్ళిపోతున్నప్పుడు నటాలియానుచూసి నిట్టూ ర్చాడు. నటాలియా కళ్లు చెమ్మగిలినట్లు పొడకట్టినా, ఆమె చూపులు అతన్ని తరిమికొట్టాయి. గుమ్మంమెట్లుదిగి రూడిన్ బండీలో కూలబడ్డాడు. బెసిస్టోవ్ కొంతదూరం టోలుగేటు దాక సాగనంపుతానని బయలుదేరాడు. బండి కదిలింది; మనుపుతిరిగింది. ఊరు పొలిమేర దాటింది. రోడ్డు చేరుకొంది. రూడిన్ బెసిస్టోవ్ వంక తిరిగి,

'డాన్ క్విగ్జోట్ కథ నీకు గుర్తుందా?' అని ప్రశ్నించాడు.

'ఏం?'

'రాణీగారి ఆస్థానాన్ని వదిలిపెడుతూ అతనన్న మాటలు జ్ఞాపకమున్నాయా?...'స్వాతంత్ర్యం! స్వాతంత్ర్యం! స్వర్గం మానవుడికి ప్రసాదించిన అమూల్యవరాలలో స్వాతం త్ర్యం ఒకటి ఎవరికైతే భగవంతుడు అన్నోదకాలు కల్పి స్తాడో అతను ధన్యుడు. అందుకు అత నెవరికీ, ఒక్క భగ వంతుడికితప్ప దాసానుదాసుడు కానక్కరలేదు,' బెసిస్టోవ్! యివీ అత నన్న మాటలు. అప్పుడు అతను ఏ అనుభూతిని పొందేడో ఆ అనుభూతే, ఇప్పుడు నాకూ కలిగింది. మరి కొన్నాళ్ళకు నీకూ యీ అనుభూతి కలగవచ్చును.' 'బెసి

ప్లోవ్ మనస్సు కరిగిపోయింది. గుండె కొట్టుకుంది. తటాలున ఆవేశంతో రూడిన్ చేతులను పట్టుకొన్నాడు. రూడిన్ దారిపొడుగునా సంభాషిస్తూనే వున్నాడు. మానవాత్మ మహోన్నతమైనదని, నిజమైన స్వాతంత్ర్యాన్ని మానవుడు సాధించాలని, యిది మాటలతో పనికాదని చెప్పాడు. స్వాతంత్ర్యం, మానవహక్కులు, ఆత్మోన్నత్యం వీటిని గురించి చాలాసేపు ప్రసంగించాడు. ఈ మాటలు పలుకుతున్నప్పుడు అతని కంఠస్వరం హెచ్చింది. గంభీర నిశ్చల ప్రవాహంవలే మాటలు హృదయంలోనుంచి ఉరకలు వేసేయి. టోలుగేటు వచ్చింది. 'నువ్వు చాలదూరం వొచ్చావు' అన్నట్లు రూడిన్ చూశాడు. బండి ఆగింది. బెసిస్లోవ్ బండి దిగాడు. దుఃఖం ఆగిందిగాదు. వెల్లువలా పొంగింది. రూడిన్ మెడను చేతులతో కౌగలించుకొని చంటిపిల్లడిలా వెక్కి వెక్కి ఏడ్చాడు. రూడిన్ కళ్లమ్మట జలజలా నీటిబొట్లు కారజొచ్చాయి.

♦ ♦ ♦

రూడిన్ వెళ్లిపోయిన తరువాత యిల్లంతా చిన్నబోయింది. నటాలియా తన గదిలోనికివెళ్ళి తలుపులు మూసుకుంది. రూడిన్ తనకు రాసిన ఉత్తరాన్ని ఆతృతగా చదవసాగింది.

ప్రియమైన నటాలియా!

వెళ్లిపోదామని నిర్ణయించుకున్నాను. నాకింకొకగత్యంతరంలేదు. నన్ను వెళ్లిపొమ్మనకుండానే, నాఅంతట నేనే వెళ్లిపోవడంమంచిది. నేను వెళ్లిపోతే వాటంతటవే పరిస్థితులుకుదుటపడతాయి. ఎవరూ నన్ను తప్పుపట్టరు. ఎందుకు తప్పుపడతారు?

అయితే నే నొకందుకు నీకీ ఉత్తరం రాస్తున్నాను. బహుశయిక మనంకలుసుకోకపోవచ్చు. ఇదే మనఆఖరిసమావేశం కాబోలు. నేను, నువ్వనుకున్నంత చెడ్డవాణ్ణి కాననుకుంటాను. నన్ను ద్వేషించవలసిన దానికంటె యింకా ఎక్కువగా, నువ్వు ద్వేషించడం విచారకరం. కనుక నే నీకీ ఉత్తరం యిప్పుడు వ్రాయవలసివచ్చింది. ఒకళ్ళని నిందించేకంటే నన్ను నేనే నిందించుకోవడం ఉత్తమం. నే నెందుకలా ప్రవర్తించానో, దానికి హేతువేమిటో నా శక్త్యానుసారం నీకు వివరించ ప్రయత్నిస్తాను. గత నాలుగైదురోజుల్లోను జరిగిన సంఘటనలు ఎవరూ అనుకోనివి. చాలా హఠాత్తుగా, పిడుగుపాటుగా. ఆశ్చర్యజనకంగా అవి సంఘటిల్లాయి...

ఈవేళ మన సమావేశం నా కొక జ్ఞానోదయహేతువు. జీవితంలో మాసిపోరాని సత్యాన్ని అది నాకు బోధించింది. అవును. నువ్వన్నది నిజం. నీ హృదయం నాకు అర్థమైనదని నే ననుకున్నాను. కాని నీ హృదయాన్ని అర్థంచేసుకోలేదు. ఇంతకాలంగా నా జీవితంలో రకరకాల మనుష్యుల్ని చూశాను. నాకు అనేకమందితో పరిచయముంది. స్నేహముంది. చాలామంది స్త్రీలతో, యువతులతో సన్నిహితంగా మెలిగాను. కాని నీవంటి చిత్తశుద్ధిగల, పవిత్రమైన యువతిని నే నెక్కడా చూడలేదు. నీ హృదయం పసిడితునక. ఆత్మ, అత్యంత గంభీరమైనది. నీ హృదయాన్నీ, ఆత్మను దర్శించిన వెంటనే నాకు ఎంతో ఆశ్చర్యం వేసింది. నీ ఆత్మను తగిన కానుకను నేను చెల్లించలేకపోయాను. మనమిద్దరం తొలిసారి ఒకరినొకరు చూచుకున్నప్పుడు, నామీద నీ కొకవిధమైన మమ

కారం కలిగింది. ఆ విషయం నువ్వు గ్రహించేవుంటావను కుంటాను. గంటలతరబడి నీతో మాట్లాడే అవకాశం, అదృష్టం నాకు కలిగింది. అయినా నిన్నుమాత్రం నేను అర్థం చేసుకోలేకపోయాను. నిజం చెప్పాలంటే నిన్ను అర్థం చేసు కుందుకుకూడా నేను మనసారా ప్రయత్నించనేలేదు...అయి నప్పటికీ నిన్ను నేను ప్రేమించానని కలలోలాగ ఊహించాను! యిదీ నేను చేసిన పాపం. అప్పుడు చేసిన ఆ పాపానికి యిప్పుడు యీ శిక్ష అనుభవిస్తున్నాను.

ఇదివరకు ఒకసారి నన్నొకామె ప్రేమించింది. నేనూ ఆమెను ప్రేమించాను. ఆమెపట్ల నాకున్న మనోభావాలు వేరు. నాపట్ల ఆమెకూ అంతే. అనేకపాయలు వచ్చి నదిలో కలిసినట్లు ఉండేవి నా భావాలు. ఆమె భావాలూ అంతే. ఆమె స్వభావం ఒడుదుడుకులతో ప్రవహించే నదీగర్భంలా వుండేది. యీ స్వభావంలోఉన్న యదార్థ మేమిటో అప్పుడు నేను గ్రహించలేదు. నా స్వభావానికి ఆమె స్వభావం ఎదురు పడ్డప్పుడు, నేనామె స్వభావాన్ని గమనించనైనా గమనించలేదు ... యిప్పుడు అది గ్రహించాను. కాని కాలాతీతమైపోయింది. భూతకాలంలోనికి మనం మళ్ళీ వెళ్లి తొంగిచూడలేం. మనిద్దరి జీవితాలూ లతలవలే అల్లుకొని వుండేవి...యిప్పుడు యిక అది పొసగదు. నేను నా మనసారా హృదయమిచ్చి నిన్ను గాఢంగా ప్రేమించానని, నా ప్రేమ కేవలం ఊహాజనితమైనదికాదని నీకు నే నెలాగ రుజువు చేయ గలను? నా ప్రేమ మనసారా హృదయమిచ్చి ప్రేమించిన

ప్రేమ అవునో, కాదో నాకే నిర్ధారణ కానప్పుడు ఆ ప్రేమ స్వరూపాన్ని నే నెలా చెప్పగలను ?

ప్రకృతి సహజసిద్ధంగా కొన్ని విశిష్టగుణాలను నాకు ప్రసాదించింది. అంతవరకు నాకు తెలుసును. మర్యాదకోసమని లేనిపోని సిగ్గును అభినయిస్తూ యీ విషయాన్ని నీకు చెప్ప కుండా వూరుకోవడం నా కభిమతంకాదు. అందులోనూ యిలాంటిపరిస్థితుల్లో నా ఆత్మ క్షోభిస్తోంది. అంతా దుఃఖ మయంగా కనిపిస్తోంది. మనిషికి దుఃఖంవచ్చినపుడు తన హృద యాన్ని విప్పి ఆప్తులతో ఏమో చెప్పుకోవా లనుకుంటాడు... నిజమే. కొంతసామర్థ్యాన్ని, నేర్పును, తెలివితేటలను, ఆలో చనాశక్తిని ప్రకృతి నాకు దానంచేసినమాట నిజమే; కాని నాశక్తికితగినట్లుగా నా జీవితంలో ఒక్క సుకృతాన్ని, ఒక్క ఘనకార్యాన్ని చేసి ధన్యుణ్ణవుతాననేఆశ నాకు లేకుండా పోయింది. ఏకార్యమూ నెరవేరకుండానే, ఏ ఆశయాన్నీ సాధించకుండానే నేను చనిపోతాను కాబోలు. నా శక్తి సామర్థ్యాలు, దీక్ష, కార్యపరతి యివన్నీ బూడిదలోపోసిన పన్నీరులా వ్యర్థంకావలసిందే. ఏ చెట్టునైతే నా టేనో, ఆ చెట్టు పెరిగి పెద్దదై, చిగిర్చి, పుష్పించి, ఫలించేసమయానికి ఆ ఫలాలు అనుభవించకుండానే మరణిస్తా ననుకుంటాను... నా కొక లోపంవుంది...ఆ లోపం ఏమిటో సరిగ్గా యిదీ అని నేనే చెప్పలేను...మానవుల హృదయాలను, స్త్రీలచిత్తాలను రంజింపజేసే శక్తి బహుశ నాలో మృగ్యమనుకుంటాను. తెలివితేటలతో, యుక్తులతో, తర్కంతో మానవులను జయించడం వేరు. ప్రేమతో, వాత్సల్యంతో, కరుణతో

మానవహృదయాలను జయించడం వేరు. మొదటిది నీటి బుడగవంటిది; ఎందుకూ కొరగానిది. నా జీవిత[గమనం, నాకే వింతగావుంది. పరిహాసాస్పదంగా వుంది; హృదయంతో, ఆత్మతేజస్సుతో మానవులను ఉన్ముఖులుగా చేసుకోవాలని నాజీవితంలో ఎంతో ప్రయత్నించాను. ప్రయత్నిస్తున్నాను. కాని అంతటిశక్తి నాకు లేదు. ఏదో ఒక ఆశయంకోసం, ఆదర్శంకోసం నేను నా జీవితాన్ని త్యజిస్తాను. నేను దేని కోసం బలిఅవుతున్నానో ఆ ఆశయం, ఆ ఆదర్శం మహత్తర మైనది కాకపోవచ్చును. బహుశః దానిలో నాకు విశ్వాసం లేకపోతే లేకపోవచ్చును... పరమేశ్వరా! ... ముప్ఫై అయిదోపడిలో వున్న మనిషిని, నేను యింకా జీవితంలో ఏదో చేద్దామనే ప్రయత్నాల్లోనే ఉండిపోయాను!

ఇంతకుముందెన్నడూ, ఎవరితోనూ నా మనసువిప్పి మాట్లాడిన పాపాన పోలేదు. యిప్పుడు యీ ఉత్తరంలో నా హృదయాన్ని బహిర్గతం చేస్తున్నాను. ఇది నా నివేదన.

ఇంతవరకు నన్ను గురించే యింతసేపూ చెప్పూ కొచ్చాను. యిక యింతటితో అది చాలు. నీ గురించి కొంతసేపు ప్రస్తావించి నా సలహా ఏమిటో చెప్పాలనుకుంటు న్నాను. నే నెందుకూ పనికిరానివాణ్ణి...నువ్వింకా యవ్వన వతివి. ఎంతో కొంతకాలం జీవిస్తావు. ఎంతకాలం బతికుంటే నేం; ఆ కాలంతో మనకు ప్రమేయంలేదు. నా సలహా ఒకటే. నీ హృదయం దేనిని నిర్దేశిస్తుందో, దానినే ఆచరించు. అంతే కాని యితరుల మేధస్సు ఆదేశించినట్లు ఎంతమాత్రం నడవకు. యితరుల మేధస్సేగాదు; నీ మేధస్సు చెప్పినట్లుసైతం ప్రవర్తిం

చకు. యిక్కడ బుద్ధిబలం ప్రసక్తి లేనేలేదు. అట్టే బెడదలు పెట్టుకోకపోవడం మనిషికి మంచిది. ఎక్కడికక్కడ సరిపెట్టు కుంటూ, జీవితాన్ని విస్తృతంచేసుకోకపోవడం మనిషికి సుఖమిస్తుంది. జీవితానికి అనేక దృక్కోణాలు ఉన్నమాట యదార్థం. అయితే ఆ అంతరవుల తత్వ మేమిటో, జీవితంలో నూతన దృక్పథ మేమిటో మనం తెలుసుకుందామని జంజాటన పడటం అనవసరం. 'జీవితాన్ని అలాగే సాగనీయి. దాని గమనంలో, దాని స్వరూప మేదో అదే బహిర్గతం చేసు కుంటుంది. ఈ పరిణామాన్ని మెలకువతో నువ్వు గమనించ డమే చేయవలసిన పని. అంతేకాని దానిలో ప్రమేయం పెట్టుకోవడంవల్ల ప్రయోజనం శూన్యం.

'ఎవరైతే తమ యవ్వనదశలో యౌవనవంతులుగా వుంటారో, వారు నిజంగా వరప్రసాదులు'...అయితే యిప్పుడు నీకిస్తున్న నా సలహా నికంటే నాకే హెచ్చుగా వర్తిస్తుంది.

నిజం చెప్పాలంటే నటాలియా! నేనిప్పుడు గొప్ప దుస్థితిలో వున్నాను. నేను మీ యింటికి వచ్చినప్పుడు మీ అమ్మగారిలో కొన్ని భావాలు కలిగాయి. నా మాటలవల్ల గోష్ఠులవల్ల ఆవిడలో కొన్ని నూతన భావాలు ఉత్పన్న మయాయి. నా సాంగత్యం ఆమెకు ఉద్రేకాన్ని. ఉత్సాహాన్ని కలిగించింది. ఏదో స్వార్థప్రయోజ నాన్ని కాంక్షించి నేనామెలో యీ భావాలు కలిగించ లేదు. కాని ఒక్కటిమాత్రం ఆశించాను. ఎల్లకాలం కాక పోతేపోనీ, తాత్కాలికంగానైనా మీ యింట్లో తల దాచు కొనే అవకాశం నాకు కలుగుతుందని ఆశించాను......

యిప్పుడు కొంపాగోడూలేక దేశాలమ్మట, వీధులవెంట తిరగవలసివస్తోంది. మీ యింట్లో వున్నప్పుడు, నీ ఎదుట కూచుంటే, నిలబడితే, నీ సాన్నిధ్యంలో నా కెంతో ఆనందంగా వుండేది. అమాయకమైన నీ చూపులు, గంభీరమైన నీ హృదయం, దివ్యమైన నీ ఆత్మ, వెన్నపూసవంటి నీ మనసు నన్ను ఉపశమింపజేసేవి. నా జీవితంలో తత్తుల్యమైన ఆనందం యిక లభిస్తుందా? నన్ను నేనే నిందించుకుంటున్నాను. నేనెవరినీ నిందించను. మనిద్దర్నీ చూసి దుర్విధి పరిహాసం చేసింది...ఒకవారంరోజులక్రితం, నేను నిన్ను ప్రేమిస్తున్నట్లు కలలోకూడా భావించలేదు. కాని మొన్న ఆ తోటలో, సంజవేళ, జాజిపొదలచెంత నువ్వు నన్ను ... అప్పుడు నువ్వేమన్నావో అవన్నీ జ్ఞాపకంచేయడం బాధగానే వుంటుంది ... ఈవేళ నేను వెళ్ళిపోతున్నాను. లజ్జతో తలవంచుకొని వెళ్ళిపోతున్నాను. అత్యంతబాధాకరమైన స్థితిలో భవిష్యత్తుమీద ఆశలన్నీ వదులుకొని నిన్నువిడిచి వెళ్ళిపోతున్నాను...నీ పట్ల నేను కావించిన అపరాధం అంతా యింతా కాదు. అది ఎంతటి ఘోరమైనదో యిప్పటికికూడా నీకు తెలియదు ... అదేమిటోగాని ఒక్కొక్కప్పుడు నేను అదే వెర్రిగా మాటాడేస్తాను. అలా మాటాడుతున్నట్లు నాకే తెలియదు...సరే, అవన్నీ యిప్పు డెందుకు? నే నెలాగూ వెళ్ళిపోతున్నాను గదా....

ఈలోకంలో నేనొక అభాగ్యజీవిని. ప్రవాసిని. నాకంటె అమూల్యమైన, ఉన్నతమైన కార్యాచరణను ఏకాంతంగానే నే నీ ప్రపంచంలో పూనుకుంటాను. ఈవేళ

ప్రొద్దున అందుకేగదా, నువ్వు పరిహాసంగా ఆ మాటలు అన్నది. ఆ ఆశయసాధనకు ఏకాగ్రతతో నేను నామనస్సును మళ్ళించగలిగితే, ఈ సోమరితనాన్ని మానుకోగలిగితే నిజంగా ధన్యుణ్ణే... కాని అలా జరగదు శాబోలు. మనసంతా, బుద్ధి అంతా వినియోగించి ఒకపనిని నిర్వర్తించేశక్తి నాకు కొరవడింది. ఎప్పుడూ నా తత్వమే అంత. ఒకపనిని ప్రారంభిద్దామనుకుంటాను. ప్రారంభిస్తాను. మొదట్లోనే ఏదైనా విఘాతం కలిగిందా, అంతటితో దానికి స్వస్తి. అడుగుల్లోనే హంసపాదు. నీతో నాకుకలిగిన అనుభవం, సంఘటనలు యిదే విషయాన్ని స్పష్టంచేస్తున్నాయి. పోనీ యికముందైనా నేను చేయబోయే కార్యంపట్ల ఆసక్తి, దీక్ష వహించగలిగితే బాగానేవుండును. అదీ నిర్ధారణగా చెప్పలేను. నామీద ఏమైనా ఒకబాధ్యత వచ్చిపడితేనే నేను భయపడిపోతాను. బాధ్యత నిర్వర్తించడం నాశక్తికి మించినపని. అందువల్లనే నీప్రేమకు నేను తగను. నాకోసం నువ్వు నీకుటుంబాన్ని విడిచిపెట్టడం తగదు. అంతటి నీత్యాగానికి నేను తగను... జరిగిందంతా మంచికే. ఈ అగ్నిపరీక్షను తట్టుకోవడంవల్ల నేను యింతకంటె శక్తివంతుణ్ణి కాగలనేమో!

జీవితంలో సదా నీకు శాంతి, సౌఖ్యం కలగాలని వాంఛిస్తున్నాను. యికనాక్షు శెలవిప్పిస్తావా? అప్పుడప్పుడైనా నేను నీకు జ్ఞాపకముంటా ననుకుంటాను. నా క్షేమసమాచారాలు తరచు నీకు తెలియగలవు.'

రూడిన్.'

తాను పావ్‌లోవిచ్ యింటికి వెళ్ళిన సంగతిని నటాలియాకు యీజాబులో తెలియజేయాలని, మొదట రూడిన్ భావించాడు. ఆవిషయం యథాతథంగా వేరొక్కంటూ ఉత్తరంలో రాశాడు. కాని మళ్ళీ ఆలోచించుకొని దాన్ని కొట్టివేశాడు. మొదట వ్రాసిన ఉత్తరాన్ని తిరిగి రాశాడు.

నటాలియా ఉత్తరం చదువుకుని కుర్చీలో అలాగే చాలాసేపు నిశ్చేష్టయై నేలవంక చూస్తూ ఆలోచించసాగింది. ఆరోజు ఉదయం కొలనుచెంత తాను పలికిన పలుకులను జ్ఞప్తికి తెచ్చుకొంది. 'రూడిన్! నువ్వు నన్ను ప్రేమించడం లేదు. నన్నొక ఆటవస్తువుగా...' అనే ఆనాటి ఆమెమాటలు హృదయంలో ప్రతిధ్వనించేయి. తా నామాటలు అనడం న్యాయమేనని చెప్పడానికి వేరే ఏమీ అక్కర్లేదు. తనకు వ్రాసినఉత్తరమే అందుకుసాక్ష్యం. తానేమీ అన్యాయంగా మాట్లాడలేదని నిశ్చయాని కొచ్చినా, యీ తలంపు ఆమె హృదయానికి శాంతినీయలేదు. లోలోపల అంతా అశాంతి. మూగపిల్లవలె, దేవతావిగ్రహంవలె నటాలియా గదిలోనే కూచుంది. మనసులో మసక మసకమబ్బులు, నల్లని క్రీనీడలు, చీకటితెరలు! పాము కాటువేసినట్లు, హృదయంలో క్రమేపి విషం ఎక్కువౌతున్నట్లు బాధపడసాగింది. తనజీవితం యింతటితోసరి అనుకుంది. సుడిగుండంలో చిక్కుకుని ఎక్కడికో కొట్టుకుపోతున్నా ననుకొంది.

మానవుడు ఒక వస్తువుమీదనో, వ్యక్తిమీదనో కొన్ని ఆశలు పెట్టుకుంటాడు. తీరా ఆ వస్తువు దగ్గరకు, ఆ మనిషి సమీపానికి వెళ్ళినప్పుడు, తన ఊహలు యిదివరకనుకున్నంత

ఉదాత్తమైనవి కావని, తన ఆశలు కేవలం భ్రమలుమాత్రమే ననీ తెలియవస్తుంది. అప్పుడు అతను హతాశుడౌతాడు. భ్రమలుగా పరిణమించిన ఆశలు యిప్పుడు దుఃఖకరమౌతాయి. తమనుతాము వంచనచేసుకోలేని సుకుమార, లలిత హృదయులకు యిది మరీ దుఃఖభాజన మౌతుంది.

నటాలియా ఆశలు భ్రమలుగా పరిణమించి పడగవిప్పి కాటువేశాయి. ఆమె చిన్ననాటిరోజులు జ్ఞప్తికి వచ్చాయి. ఆ రోజులు ఎంత బాగుండేవి! అవి మధురమైన క్షణాలు! సాయంకాలం తోటలో మెల్లగా అడుగులు వేస్తూ, అస్తమిస్తున్న సూర్యకాంతిని చూస్తూ అటే, ఆ వెలుగువైపుకే నడుస్తూ ఆనందించేది. అప్పుడు, ఎప్పుడూ ఆమె నడక వెలుగువైపే. చీకటన్నది ఆమె బాటలో లేనేలేదు. ఇప్పుడో! తనముందూ, వెనకా, చుట్టూ అంతా చీకటి; కారుచీకటి. ఈ భావం ఉదయించినతోడనే నటాలియా నేత్రాల వెంబడి జలజలా నీటిబొట్లు రాసాగేయి. కన్నీళ్లు ఎల్లప్పుడూ మనసుకు ఉపశాంతిని చేకూర్చవు. హృదయంలో అణగి, అణగి యిక ఉండలేక లోనున్న దుఃఖం పైకి ఉబికినపుడుమాత్రమే కన్నీళ్లు హృదయానికి ఉపశమనం. అణుచుకుందామని ప్రయత్నించిన మన ప్రయత్నానికి లొంగని విషాదం, కన్నీళ్లుగా కరిగిపోయినపుడు, హృదయపంజరంలోనుంచి తప్పించుకున్న విషాదం కన్నీళ్లుగా మారినపుడు మనసులోని భారం తేలికౌతుంది. కన్నీళ్లు దుఃఖోపశమనకారణ మౌతాయి.

అయితే అన్నివిధాలభావాలవలన వచ్చే కన్నీళ్లు దుఃఖోపశమనం కలిగిస్తాయని చెప్పలేం. అలా కలిగించక

పోగా ఆ వేదనను ద్విగుణీకృతం చేస్తాయి. మాత్సర్యం, పగ, యీర్ష్య, ద్వేషం వీటివలన కలిగేదుఃఖం ఎవరూ తీర్చలేనిది. దుఃఖభారానికి, హృదయంలోనున్న విషాదం భరించలేక ఒక్కొక్కబొట్టుగా కళ్ళల్లో కనిపిస్తుంది. ఒకవిధమైన పొగలాగ, సెగలాగ ఆవిరులను రేపుతూ, హృదయాన్ని మరీ పీడిస్తుంది. వేధిస్తుంది. ఇవి గత్యంతరంలేక కారిన కన్నీళ్లు. నటాలియా కార్చినకన్నీళ్లు, ఆమె మనోవ్యథను మరింత హెచ్చించాయి. రెండుగంటలకాలం అలాగే గడిచింది. తనను తానే ఓదార్చుకొని తెప్పరిల్లి కళ్లు తుడుచుకుంది. కుర్చీలోంచి లేచింది. కొవ్వొత్తి వెలిగించింది. రూడిన్ ఉత్తరాన్ని అంటించింది. బూడిదను జాగ్రత్తగాఎత్తి కిటికీలోంచి అవతల పారేసింది. అలమరాలోని 'పుష్కిన్' కావ్యాన్ని తెరిచి చదవసాగింది.

"తొలిసారి మెరుపువలె
తొలకరించిన ప్రేమకె
ఆశలతో మేనెల్ల పుష్పించును
కలలతో మనసంత నగదొడుగును."

'పుష్కిన్' కావ్యంసైతం హృదయాన్ని ఊరడించలేకపోయింది. లేచి నిలువుటద్దంముందు నుంచుంది. అద్దంలో తన ప్రతిబింబపు పెదవులపై తెచ్చుపెట్టుకున్న నవ్వు కనిపించింది. ఆమె తల వూపింది; అక్కడనుంచి గిరుక్కున తిరిగి, మేడదిగి మరో గదిలోకి వెళ్ళిపోయింది. గదిలోవున్న నటాలియాను ఆమెతల్లి చూసింది. తన గదిలోనికి రమ్మని తీసుకువెళ్ళింది. తనపక్కన కూచోబెట్టుకొని భుజాలను

నిమురుతూ వీపుతడుతూ బుజ్జగిస్తూ ఆమె బుగ్గలను, కళ్లను పేరిపారజూసింది. బుగ్గలు కందిపోయాయి. కళ్లు ఉబ్బిపోయి వున్నాయి. చెక్కిళ్ళమీద కనీకనిపించని కన్నీటి చారలు. తల్లి కూతురునుచూసి భయపడింది. తనకూతురు హృదయమే ఎత్వమే తనకు తెలియదనిపించింది. రూడిన్ నటాలియాతో ప్రేమకలాపాలు సాగిస్తున్నాడని పాండలవిస్కీ చెప్పినపుడు తనకూతురు అంతటిది కాదనుకుంది. అయినా అడిగిచూద్దామని వెంటనే కబురుపెట్టింది. మందిలించింది. కోప్పడింది. సాధారణ స్త్రీలవలె తిట్టింది. నటాలియా చూపులు, సమాధానాలూ, నిగ్లక్ష్యవైఖరి ఆమెను భయపెట్టేయి. నటాలియా ఎంతకు తెగిస్తుందోనని భయవిహ్వాల అయింది. కాని రూడిన్ తనకు తానే హఠాత్తుగా నిష్క్రమించడంతో ఆమె హృదయంలోని భయాందోళనలు తొలగిపోయాయి.

తల్లి కూతుర్ని బుజ్జగిస్తూ మెల్లగా అడిగింది.

'ఏమమ్మా. అలావున్నావేం తల్లీ ?' నటాలియా, వంచుకొనివున్న తలను పైకెత్తి తల్లివంక చూసింది; 'అతను వెళ్ళిపోయాడు. అంత హఠాత్తుగా ఎందుకు వెళ్ళిపోయాడో నీకేమైనా తెలుసునా ?'

నటాలియా స్వరం సన్నగిలింది. 'అమ్మా' అని పిలిచింది. 'అతని సంగతి యిక నా దగ్గర ఎత్తకు.'

'సరేలే. నీ పొరపాటేమిటో నీకు తెలిసిందికదమ్మా!'

నటాలియా మొహం వంచుకుని, 'నా నోటితో అతని పేరు ఉచ్ఛరించను; నా చెవులతో అతనిసంగతి విసను' అంది.

తల్లి నవ్వుతూ 'అంతేనమ్మా. ఆ మాటమీదే వుంటా వనుకుంటాను. కాని మొన్న నువ్వు...సరేలే, అవన్నీ యిప్పు డెందుకు? జరిగిందేదో జరిగింది. అంతా అయిపోయింది... ఏమంటావు? యిప్పుడు నువ్వు మామూలులాగే వున్నావు. ఆ నాల్గురోజులుమాత్రం నాకు అన్నం నిద్రా లేవు. నీకోసం చాలా బెంగపెట్టుకున్నానమ్మా. యిప్పుడు నాకేం దిగులు లేదు. యిలా రా తల్లీ; దగ్గరకు రా! ఎంత తెలివైనదానివే! ఒక్క ముద్దీయి తల్లీ!'

నటాలియా తన తల్లి చేతులను పట్టుకొని పెదవులతో ముద్దిడుకొంది. తల్లి ఆమెతలను చుంబించింది.

'నువ్వింకా చిన్నపిల్లవమ్మా. అశుభం శుభం తెలియదు. పెద్దదాన్ని నేనుండగా నాతో చెప్పకుండా, మంచీ చెడ్డా ఆలోచించకుండా ఏం చేయకు తల్లి! మనవంశం ఎటువంటిదీ' నాన్నగారు ఎలాంటివారూ! వంశ గౌరవప్రతిష్టలూ, కీర్తి ప్రఖ్యాతులు...నువ్వు నా కూతురువి. నేనుండగా నీకేం లోటు? పువ్వుల్లోపెట్టి పూజించే మొగుడు వస్తాడు...వెళ్లు. వెళ్ళమ్మా. ని పనేదో చూసుకో తల్లీ!'

నటాలియా మౌనంగా వెళ్ళిపోయింది. వెళ్ళిపోతున్న కూతురువంక చూస్తూ తల్లి 'వెర్రిబాగుల్ది. నాలాంటిదే. తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్లు, పాపం!' అనుకుంది.

నటాలియా వెళ్ళిపోగానే లాసున్స్కయా, పంతులమ్మను రమ్మని కబురుపెట్టింది. అనేక ప్రశ్నలువేసి పంపివేసింది. తరవాత పాండలవిస్కీని రమ్మంది. రూడిన్ ఎందుకు వెళ్ళిపోయాడో, అసలు కారణం ఏమిటో తెలుసుకోవాలసి

ఆమె ఆతృత. ఆతృతేమీ పడనక్కర్లేదని, యిట్టే తెలుసుకుంటాననీ పాండలవిస్కీ భరోసా యిచ్చినతరువాతగాని ఆమె మనస్సుకు స్వస్థతచిక్కిందిగాదు.

ఆ మర్నాడు పావ్‌లోవిచ్, అతని చెల్లెలు జమిందారిణి యింటికి భోజనానికి వచ్చారు. జమిందారిణి పావ్‌లోవిచ్ అంటే ఎప్పుడూ సుముఖురాలే. అందులోనూ యిప్పుడు ఎప్పటికంటె యీవేళ అతనిపట్ల మరీ గౌరవభావాన్ని వ్యక్తపరుస్తోంది. నటాలియా యింకా విచారంగానేవుంది. పావ్‌లోవిచ్ ఆమెతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడాడు. తనంటే ప్రాణంపెడుతున్నందుకు నటాలియా హృదయంలో కృతజ్ఞతాభావం ఉదయించింది. ఆవేళ చెప్పుకోదగ్గ విశేషమేమీ జరగలేదు కాని, రోజంతా చికాకుగావుంది. విందైన తరువాత పావ్‌లోవిచ్, చెల్లెలితో యింటికి వెళ్ళిపోయాడు. పావ్‌లోవిచ్ హృదయం పూర్వంలా లేదు. యథాప్రకారంగానే జమిందారిణి కుటుంబంతో తమకున్న చనువు మళ్ళీ కలుగుతున్నట్లు సంతసించాడు.

ఈ సంతసం పావ్‌లోవిచ్‌కే కాదు, ఒక్క నటాలియాకు తప్ప అందరికీ ఆనందంగానే వుంది. నటాలియా మాత్రం మాటిమాటికి వ్యథ చెందుతూవుంది. పరుపుపై వాలింది. లేచింది. లేచి కూర్చుంది. అలసిపోయింది. జీవితం కృత్రిమనుకుంది. జీవితం రోతగా కనపడింది. తన ప్రేమ జ్ఞాపకమొచ్చి దుఃఖమొచ్చింది. ఎందుకా ప్రేమ! ఎందుకింత దుఃఖం? నిలువునా కృంగిపోయింది. సిగ్గుతో మొహం వెలవెల బోయింది. ఇంత సిగ్గుమాలిన బ్రతుకు బ్రతికి ప్రయోజన

మేలుకుంటుంది. ఈ క్షణంలో మృత్యువు ముంచుకొస్తే తనను కోరవ మనుకొంది...రోజులు గడిచేయి. రాత్రిళ్లు నిద్రపట్టడం లేదు. ఆత్మ క్షోభిల్లుతోంది. తను యింత చిన్నపిల్ల కదా! యింత చిన్నవయసులోనే ఎందు కింత దుఃఖం? అని పరిపరి విధాల తలపోసింది. ఆమెజీవితం యిప్పుడిప్పుడే తొలకరించింది. జీవిత ప్రాంగణంలోనికి అడుగుబెడుతోంది. చిన్నపిల్లైనా, జీవితం దానంతటదే తొంగిచూడక తప్పదు. ఎవరికైనా యింతే. ఒకరు మహాదురదృష్టవంతులు కావచ్చును. ఎంత దురదృష్టవంతులైనా, కలిగిన ఆ దురదృష్టం ఎంతటి దుస్సహమైనదైనా క్రమేపి దానిని మరచిపోక తప్పదు. ఒక రోజు, రెండురోజులు, కలిగినవిపత్తు అన్నం ముట్టకుండాచేయవచ్చును. కాని మనిషి అన్నంలేకుండా, నిద్రలేకుండా బ్రతకలేడు. నటాలియా విచారం, దుఃఖం దుస్సహమైనది. భరించలేని ఆవేదనను ఆమె భరించింది. జీవితంలో యింత బాధపడడం విపత్తుకలగడం యిదే మొదటిసారి. కాని జీవితంలో మొదటకలిగిన బాధలూ, తొలిసారి ప్రేమవిఘాతాలూ, మళ్ళా తటస్థించినా, అంతబాధ కనిపించదు. జీవుడు కష్టాలకు అలవాటుపడిపోతుంది.

## 12

రమారమి రెండుసంవత్సరాలు గడిచిపోయేయి. వసంతం వెళ్ళింది. మేనెల వచ్చింది. పావ్‌లోవ్నా పూర్వపు పావ్‌లోవ్నా కాదు. యింటిపేరు మారిపోయింది. యిప్పుడామె లెజ్‌నోవ్ సతీమణి యిద్దరికీ ఏడాదిక్రితమే వివాహ

మైంది. వివాహమయాక ఆమెలో అనుకోని మార్పువచ్చింది. బిడ్డపుట్టేక తాను చరితార్థురాల నయాననుకుంది. శరీరం లావెక్కినా, పూర్వపు లావణ్యం తరగలేదు. తనివి మనిషికి లేనిబలాన్ని, ఉత్సాహాన్ని యిస్తుంది.

ఈవేళ పావ్‌లోవ్నా మేడమీది వరండాలో కూర్చుంది. ఆమె చెంతనే పిగసోవ్ కూచున్నాడు. తోటలో బిడ్డణ్ణి ఎత్తుకొని దాది అటుఇటూ నడుస్తోంది. పిల్లడు చక్కని చుక్క. ముత్యంవలె మెరుస్తున్నాడు. పొట్టిచొక్కా తొడిగి, నీలిటోపీ పెట్టి ముస్తాబుచేశారు. నోట్లో వేళ్లుపెట్టుకొని నవ్వుతున్న తన పిల్లడి బోసినవ్వును, పాలబుగ్గలనుచూస్తూ పావ్‌లోవ్నా మురిసిపోతోంది.

పిగసోవ్ ఈ రెండేళ్ళలోనూ చాలా మారిపోయాడు. నడుము యింకొంచెం వంగింది. మనిషి సన్నబడ్డాడు. మాట్లాడుతున్నపుడు తొస్సిమాటలు. ముందుపళ్ళు ఊడిపోయాయి. లెజ్‌నోవ్ యింట్లో లేడు. టీ వేళకి వస్తానని పనిమీద వెళ్లాడు. సాయంత్రమౌతోంది. సూర్యుడు పడమట అస్తమిస్తున్నాడు. కుంకుమవర్ణపు చారలు, నిమ్మపండు ఛాయలతో కలిసి వింతరంగులను ఆకాశంమీద పూస్తున్నాయి. దిఙ్మండలం కాషాయవస్త్రంలా ఉంది. ఎదురుగా లేతనీలిరంగు ఛాయలు శోభిస్తున్నాయి. ఆకాశంమధ్య చిన్నిచిన్నిమబ్బులు పరుగిడుతున్నాయి.

ఉండుండి ఉరిమినట్లు పిగసోవ్ పకపకా నవ్వాడు. పావ్‌లోవ్నా అడిగింది 'ఎందుకలా నవ్వుతున్నారు?'

'ఏం లేదు. ఏదో జ్ఞాపకమొచ్చేను.'

'ఏమిటి జ్ఞాపకమొచ్చిందో?'

'నిన్న మా యింటిపక్క ఒకావిడ వటవటా ఒక్కటే వాగుడు. వాగుడు విని ఆమె భర్త 'నోర్ముయ్' అన్నాడు. నాకు చాలా సరదా అనిపించింది. లోకంలో మాట్లాడ్డానికి ఆడదానికి పనేముందని? అవసర మేమిటి? మనపూర్వీకులు ఉత్తినే అన్నారా? ఆడదాన్ని చెప్పుకింద తేలులా అణిచి పెట్టి వుంచమని. నిన్న మరొకావిడ అంటుందిగదా ... నా ధోరణి ఆవిడకేం నచ్చలేదట. పిస్తోల్తో కొట్టినట్టు నా మొహం ఎదుటే అంతమాట నేసిందే! ధోరణి, నా ధోరణి ఆవిడకు నచ్చకపోవడం. ఆవిడేకాదు. ఏ ఆడదైనా నోరు మూసుకు కూర్చోవడం మంచిదికాదంటావా? భగవంతుడు ఆడవాళ్ళని మూగవాళ్లుగా ఎందుకు పుట్టించలేదా, అని నా ప్రశ్న.'

'ఏమిటది పిగసోన్? నా చిన్నప్పటినుంచి చూస్తున్నాను. ఎప్పుడూ అదే ధోరణి. ఆడవాళ్ళం ఏం చేశాం చెప్పు. మామీదే విరుచుకుపడాలా? పాపం! నీ దురదృష్టం. నిన్ను చూసి నాకు జాలేస్తుంది.'

'జాలి! దురదృష్టం. ఏమిటి నీ ఉద్దేశం? లోకంలో మూడంటే మూడే దురదృష్టాలు ఉన్నాయి. చెప్తా విను. శీతాకాలంలో గడగడా వణికే చలిలో తేమగా ఉన్న గదిలో కూచోడం మొదటి దురదృష్టం. ఎండాకాలంలో బిగుతుగా కాలిని కరుస్తున్న బూట్లు వేసుకోవడం రెండో దురదృష్టం. రాత్రి గదిలో పురుగులాగ కీచురాయిలాగ, గీపెడుతూ గుక్కపెట్టి ఏడుస్తూన్న చంటిపిల్లాడి పక్కన పడుకోవడం

మూడో దురదృష్టం. నీవు క్షమిస్తే యింకో విషయం చెప్తాను. నా అంత మెత్తని మనిషి మరి లేడు. అందుకే యింత నెమ్మదిగా చెప్పాను.'

'మెత్తని మనిషివా? నిన్ననేగదా ఎలినా నాతో నీమీద మొర పెట్టుకుంది.'

'అలాగా? ఏమని చెప్పింది? నామీద ఏమన్నా పోటీలు చెప్పిందా?'

'పోటీల మాటకేంగాని నిన్నల్లా ఆవిడ ఏమడిగినా బెల్లంకొట్టిన రాయిలాగ, ఏమిటీ, ఏమిటీ అంటూ ప్రశ్నించావే తప్ప ఒక్క సమాధానమూ చెప్పలేదట. పొద్దస్తమానం విసుక్కుంటూనే వున్నావట.'

'ఆడవాళ్ళతో అలాగే వుండాలి.'

'మెచ్చుకున్నాలే నీ మాటలు! ఆడవాళ్ళతో అంత మొరటుగా వుండడం దేనికి?'

'నేనే ఆడదానితో మొరటుగా ఉన్నాను?'

'ఇంకెవరితో వుంటావు? ఎలెనాతో.'

'అది ఆడదనుకుంటున్నావా?'

'ఆడది కాక?'

'అయ్యో బాబో! అదా! అది ఆడదా? అదొక్క తాండోలు. ఒక తాపామర్సా. మంగలాళ్ళు డబడబా కొట్టే సితారం!'

పావ్లోవ్నాకు అతని సంభాషణేమీ రుచించలేదు. ప్రసంగం మార్చి 'నువు అదృష్టవంతుడివి' అంది.

'ఏం?

'దావా గెల్చుకున్నావట్టగదూ? మాగాణి నీపరమే అయిందట.'

'అందులో ఏముందీ?'

'యిన్నేళ్ళు కోర్టులకెక్కి గెల్చుకున్న తరువాతకూడా నీకు సంతోషంగాలేదూ?'

'అన్నేళ్లు కోర్టులమ్మట తిరిగేను గనుకనే, గెల్చినా సంతోషంలేదు. కోర్టులకెక్కేక గెల్చినా, ఓడినా ఒకటే. కోర్టుకెక్కినవాడూ, గాడిదెక్కినవాడూ ఒకటేనని నీకు తెలియదూ?'

పావ్లోవ్నా తోటలో తిరుగుతున్న దాదిని పిలచింది. 'పిల్లాణ్ణి పడుకోబెట్టు, వేళైంది కదూ?' దాది చేతులోనుంచి తనే కొడుకును తీసుకొంది. పిగసోవ్ లేచి వరండాలో ఒక పక్కకు వెళ్ళిపోయాడు. చీకటి పడుతోంది. తోట అవతల రోడ్డుమీద బండి వస్తోన్న చప్పుడు వినిపిస్తోంది. అలికిడికి కుక్కలులేచి గుఱ్ఱంమీద కలియబడబోతున్నాయి. లెజ్నోవ్ నుచూసి తోకలు ఆడిస్తూ వెళ్ళిపోయాయి. లెజ్నోవ్ గుమ్మంముందు బండిఆపి, దిగకుండానే భార్యను ఆతృతగా కేకవేశాడు. 'పావ్లోవ్నా! ఓ పావ్లోవ్నా త్వరగా రా. చూడు, చూడు, మనింటి కెవ రొచ్చారో చూడు.' తనభర్త వెనకబండిలో కూచున్న ఆగంతుకుని పావ్లోవ్నా వెంటనే గురుపట్టలేకపోయింది. మళ్ళీ మళ్ళీ చూసి 'ఓహో! బెసిస్టోవా? మా యిల్లు పావనమైందే' అంది.

'అవును. బెసిస్టోవే. ఒక్కడే వచ్చాడనుకున్నావా?'

'మరి భార్యతో వచ్చాడా?'

'భార్యతోనే రావాలా? పెళ్ళికబురు తీసుకొచ్చాడు.'

'ఎవరికీ?'

'ఇంకా నీకు తెలియదన్నమాట. యింకెవరికి? నేడో రేపో మీ అన్న పెళ్ళి.'

'ఎవర్నిచ్చి?'

'నటాలియా నిచ్చి. బెసిస్తోవ్ శుభవర్తమానం తెచ్చాడు. మీ అన్న నీకు ఉత్తరంకూడా రాశాడట.'

పావ్లోవ్నా చంటిపిల్లణ్ణి ఎత్తుకొని భర్తచెంత నిలబడింది. లెజ్నోవ్ రెండుచేతులూ చాపి ఆమెచంకనున్న కొడుకును 'రా, రమ్మని' తీసుకున్నాడు. కొడుకుతో మాట్లాడుతూ 'నీ కింకా తెలియదుట్రా? అత్తొస్తుంది రా. అత్తా! వేగం పిల్లని కనమని అత్తతో చెప్పు'

బెసిస్తోవ్, పావ్లోవ్నాకు ఉత్తర మందించాడు. 'మాస్కోనుంచి వస్తున్నానండీ. ప్రత్యేకం మీతో చెప్పమని మరీమరీ అమ్మగారు నన్ను పంపించారండి.'

పావ్లోవ్నా అన్న రాసిన ఉత్తరాన్ని చదువుకుంది. ఉత్తరంలో నాలుగైదు పంక్తులే ఉన్నాయి. తాను నటాలియాను వివాహం చేసుకుంటానని ఆమెను కోరినట్టూ, అందుకు నటాలియా, ఆమెతల్లీ అంగీకరించినట్టూ పావ్లోవిచ్ చెల్లెలికి ఉత్తరం రాశాడు. వివరాలన్నీ తెలుపుతూ త్వరలోనే యింకోజాబు రాస్తా నన్నాడు.

టీ తయారైంది. పిగసోవ్ బెసిస్తోవ్‌ను ప్రశ్నమీద ప్రశ్న అడుగుతూనే అన్నాడు. నటాలియా, పావ్లోవిచ్‌ల వివాహంసంగతి విని సంతోషించాడు. కాని ఒక అనుమానం

అతన్ని పీడిస్తూనేవుంది. అనుమానం పెనుభూతం. బెసిస్ట్రోవ్ నడిగి తేల్చేసుకోవా లనుకున్నాడు.

'అబ్బాయి! బెసిస్ట్రోవ్! నాకో అనుమానం?'

'అడగండి చెప్తాను.'

'నటాలియాను కోర్సాగిన్ అనే పెద్దమనిషికి యిస్తారని పుకార్లుపుట్టాయి. అదంతా అబద్ధమేనా?'

'పుకార్లకి కొంత ఆధారం లేకపోలే దనుకోండి. జమిందారిణి యిష్టపడింది. నటాలియా అతనిమొహామే చూడనంది.'

'నా కాపెద్దమనిషి తెలుసులే. బకాసుడులా వుంటాడు. పెద్ద నోరూ, తల వాడూను. లోకంలో అందరు అలావుంటే మనంయిక ప్రపంచంలోనుంచి సెలవు తీసుకోవచ్చు.'

'మనిషి ఎలావుంటే నేమండీ? మాస్కోలో అతనంటే పెద్దపెద్ద ఉద్యోగస్తులకుకూడా మోజే.'

దీనికి పిగసోవ్ ఏమనునో కాని పావ్లోవ్నా అతని మాటలకు అడ్డువచ్చింది.

'అతనిసంగతి మనకెందుకు? పనిలేని మంగలి... ఏమండీ! బెసిస్ట్రోవ్! నటాలియా కులాసాగా వుందాండీ?'

'కులాసాగానే వుందండి. మామూలుగానే వుంది. సుఖంగానేవుంది.'

భోజనంవేళ కావచ్చింది. అంతా కూచున్నారు. లెజ్నోవ్ బెసిస్ట్రోవ్వంక తిరిగి 'మొహమాటపడకు. మే మేం

కొత్తా నీకు? ...అన్నట్టు రూడిన్ సంగతి నీ కేమన్నా తెలుసునా?'

'ఈమధ్య ఎక్కడున్నాడో తెలీదండీ. ఆమధ్య ఓసారి చూసొస్కా వచ్చాడు. అక్కడినుంచి సింబ్రిస్కు వెళ్లాడు.'

'ఎందుకు వెళ్ళాడు?'

'ఏమో? కూడామాత్రం ఒకామె, పిల్లలు ఉన్నారు. ఎవరో స్నేహితుడి కుటుంబమట.'

'తరవాత నీకేమీ తెలీదన్నమాట?'

'తెలీకేం? అక్కడనుంచి నాకు ఉత్తరాలురాసేవాడు. ఆమధ్య ఉత్తరంరాస్తూ అక్కడినుంచి వెళ్ళిపోతున్నానని మాత్రం తెలియజేశాడు. ఎక్కడికి వెళ్లుతున్నదీ చెప్పలేదు. అంతే. మరి అంతూపంతూ లేదు.'

పిగసోవ్ నవ్వుతూ 'అతని కేమిటయ్యా! ఎక్కడున్నా బ్రతికేస్తాడు. ఎక్కడో, ఎవరింటోనో మకాంబెట్టాడు. నిశ్చింతగా మూడుపూటలూ తింటూ ప్రబోధం చేస్తున్నాడు. అతని ప్రబోధంవిని యిద్దరోముగ్గురో శిష్య పరమాణువులు ఎలాగా తయారౌతారు. నోరు వెళ్ళబెట్టుకొని, గురువుగారు చెప్పేదివింటూ పైపెచ్చు చేబదుళ్లుకూడా యిస్తారు... నామాట, ఎందుకైనా మంచిది; జ్ఞాపకంపెట్టుకోండి. ఆ మహా మేధావి, భీముడిచేతులో కీచకుడిలా ఎప్పుడో ఒకప్పుడు మరణిస్తాడు.'

పిగసోవ్ మాటలకు, బెసిస్టోవ్ కంటగించుకొని 'మీ రెప్పుడూ ఆయన్ని గురించి యిలాగే మాటాడతారు. ఎంత అన్యాయం?' అన్నాడు.

'అన్యాయ మేమిటయ్యా! న్యాయంగా మాటాడు తుంటే; వాడికన్నా యిచ్చకాలరాయుడు యింకెక్కడున్నా డయ్యా?' అంటూ పిగసోవ్ లెజ్నోవ్ వంక తిరిగాడు.—'లెజ్నోవ్, యీ సంగతి విన్నావా? ... 'టార్లిఖోవ్' అని ఒక డున్నాడులే. అతనికీ, రూడిన్‌కీ స్నేహం. ఆమధ్య నే నతన్ని కలిశాను. యిప్పుడు రూడిన్ అంటే అతనికి ఒళ్లుమంట ... అత నే అన్నమాటేంలే. రూడిన్ స్నేహితులంతా, అతనంటే అంతే. నక్క ఒకచోట గారీకళ్యాణం పాడదని ... రూడిన్ ఎవరితో స్నేహంగా వుంటాడూ? టార్లిఖోవ్ నాతో ఏమన్నాడంటే...'

బెసిన్సోవ్ కొంచెం కోపంగా అతని మాటలను అడ్డు వచ్చి 'నేను ఆయనికి శత్రువును కాదులెండి. నా కాయ నెప్పుడూ మిత్రుడే' అన్నాడు.

'నీ మాటకేంలే. నీ స్నేహం వేరు. మిగతావాళ్ళను గురించి మాటాడుతున్నా, నీ గురించి కాదు.'

పావ్లోవ్నా పిగసోవ్‌వంక తిరిగి యిలా ప్రశ్నించింది. 'ఏమిటన్నావ్? టార్లిఖోవ్ నీతో ఏదో అన్నా డన్నావు?'

'చాలా చెప్పుకొచ్చాడు. అవన్నీ ఎవడికి జ్ఞాపక ముంటాయి. అన్నింటికన్నా రూడిన్‌ను గురించి చెప్పిన ఒక కథ నా హృదయానికి హత్తుకుపోయింది. మర్చిపోదామన్నా మరపుకురాదు. పెద్దమనుష్యులంటా యింతేలే. కడుపునిండా తినడం, కంటినిండా నిద్రపోవడం. రూడిన్ అంతటితో పోనీ యడు. శరీరం పెంచి పెంచి, ప్రేమ సిద్ధాంతాన్ని కొత్తగా

కనిపెట్టాడు. దాన్నికి ఆచరణలో ఎలా పెట్టాలని పరిశోధించాడు. దానికోసం ఎరవేశాడు. కాలం కలిసివచ్చింది. అదృష్టం పండింది. వేసిన గాలానికి ఒక ఫ్రెంచివనిత పట్టుబడింది. చాలా అందంగా వుండేదట. రూడిన్ ప్రేమకథ అంతటితో ఆరంభమైంది. చెప్పడం మరచాను. జరిగిన ప్రదేశం ఎక్కడో తెలుసా? రైన్‌నదీతీరాన ఒక జర్మను నగరంలో. రూడిన్ ఆమె దగ్గరకు వెడుతూవుండేవాడు. పుస్తకాలవీ యిస్తూ ఉండేవాడు. మచ్చికైంది. ఇకేముందీ. మెల్లి మెల్లిగా తత్త్వశాస్త్రం ఆ పిల్లతలకెక్కించసాగేడు. ప్రకృతిని గురించి హెగెల్ ఏమన్నదీ వ్యాఖ్యానాలతో బోధించాడు. యివన్నీ ఆవిడకేం బోధపడతాయి? యిత నొక జ్యోతిష్కుడనుకుంది. నీకు తెలుసుకదా. రూడిన్ అనాకారికాడు. అందులోనూ ఆ వయసులో రష్యావాళ్ళంటే ఫ్రెంచివనితలకు సహజంగా మోజుగదా. ఆమెతో రూడిన్ గాలిషికార్లు, నదీవిహారాలు మొదలెట్టాడు. ఒకసారి రైన్‌నదిమీద పడవలో షికారు వెడదాం రమ్మన్నాడు. ఆమె సరేనంది. ఆదివారంనాడు చక్కగా అలంకరించుకొని బయలుదేరింది. నదిలో రెండు గంటలు యిద్దరూ గడిపారు. ఈ రెండుగంటల్లోనూ రూడిన్ ఏం జేశాడనుకున్నావు? ఆమెతలనిమురుతూ కొనగోళ్ళతో సవరిస్తూ కలకంటున్నట్టు ఆకాశంవంక చూస్తూ ఆమెతో నీమీద నాకు ఎంత పుత్రవాత్సల్యముందనుకున్నావు?' అన్నాడట. ఈమాట ఒకసారికాదు, రెండుసార్లుగాదు, ఆ రెండు గంటలూ యిదే మాటలు. ఆవిడకు కోపంవచ్చి గిరుక్కున యింటికిపోయి, యీ కథంతా టార్లిఖోవ్‌కు చెప్పిందట.

రూడిన్ అంటే అది.' పిగసోవ్ పకపకా నవ్వుతున్నాడు. పావ్లోవ్నాకు విపరీతంగా కోపమొచ్చింది.

'నీమాట లెప్పుడూ అంతేలే. ఎవర్ని గురించి నువ్వు మంచి మాటాడుతావుగనక? శుభంపలకరా పెళ్ళికొడకా అంటే...యింతకీ రూడిన్ చెడ్డవాడని, అతని శత్రువులుకూడా అనలేరు,' అంది.

'చెడ్డేలేదూ? అంతా మంచే వుందంటావా? నాకు తెలియనిమంచి, నీ కెలా కనిపించిందో! యిచ్చకాలాడ్డం, చేబదుళ్లు పుచ్చుకోవడం, యివన్నీ మంచిగుణాలే కాబోలు. ఏం లెజ్నోవ్, రూడిన్ నీదగ్గరకూడా డబ్బు పుచ్చుకున్నాడా?' లెజ్నోవ్ అతనిప్రశ్నకు చురచుర చూచాడు.

'పిగసోవ్! రూడిన్ అంటే నాకూ, నాభార్యకూ అంత యిష్టంలేదన్నమాట నీకు తెలుసును. అతన్లో దోషాలు లేవని మా ఉద్దేశం కాదు. అయినా అతను సుఖంగా వుండాలనే మా అభిలాష.'

లెజ్నోవ్ టేబిల్మీాదున్న గ్లాసులలో ద్రాక్షసారా నింపి అందరికి అందించాడు. 'రూడిన్ ఆరోగ్యంకోసం, అతను క్షేమంగా ఉండాలని, యీపానీయం సేవిద్దాం.'

పావ్లోవ్నా, పిగసోవ్లు అతనివంక ఆశ్చర్యంతో చూడసాగారు. బెసిస్టోవ్ కూర్చున్నవాడల్లా లేచి సంతోషం పట్టలేక మళ్ళీ కూచుండిపోయాడు. లెజ్నోవ్ 'అతనిసంగతి నాకు బాగా తెలుసును. అతన్లోవున్న దోషాలు చూడకుండా, నేను కళ్లుమూాసుకోవడం లేదు. అతను అసాధారణవ్యక్తి

గనుక నే అతనిలోపాలు మనందరికి విచిత్రంగానూ, వింత గానూ కనిపిస్తాయి.'

లెజ్‌నోవ్ యీమాట అనడంతోనే బెసిస్టోవ్ పరవశ హృదయుడై, 'రూడిన్ అసాధారణ వ్యక్తిమాత్రమే కాదు. మహా మేధావికూడా.' అన్నాడు.

'కావచ్చును బెసిస్టోవ్ ఉపజ్ఞ ఉంటే ఉండవచ్చు. ఒచ్చిన యిబ్బందల్లా మనిషితోనే. ప్రపంచపుపోకడ తెలియని మనిషి...సరే. అదంతా అప్రస్తుతం. ఎవర్లోనూ లేనిగుణం ఒకటి అతనిలో వుంది. అతన్లో వున్న మంచిని, ఎవరికీలేని ఈగుణాన్ని నేను మెచ్చుకుంటాను. అతను చాలా ఉత్సాహి. ఈరోజుల్లో, ఎవరికీలేని సద్గుణం అతనిలో వుంది. మనమంతా వట్టి బద్ధకస్తులమైపోయాము. మనబుద్ధి మందగించింది. నూత్నవిషయాల నేమీ మనం పట్టించుకోము. తినడం, నిద్ర పోవడం పిల్లల్ని కనడం యిదీమనజీవితం. మనహృదయం ముడు చుకుపోయింది. ఆలోచనాశక్తిమందగించింది. ఇలాంటిమనల్ని ఎవరోఒకరు వచ్చి సుషుప్తావస్థనుంచి మేలుకొలిపితే, ఆ ఒక్క క్షణమైనా, నూత్నవిషయంవైపు మనదృష్టిని మళ్ళించగలిగితే మనం ధన్యులంగదూ! అతనికి మనమెంత రుణపడివుంటాం?... సాషలోవ్నా! ఆవేళ, అతన్నిగురించి నీతో చెప్తున్నప్పుడు, నే నేమన్నానో జ్ఞాపకముందా? రూడిన్ మూర్ఖుడన్నాను. ఆమాటలో కొంత నిజమూ ఉంది. మరికొంత అబద్ధమూ వుంది. అతనొక నటుడనీ మాయకుడని, వంచకుడనీ ఆవేళ అన్నాను. నే నన్నట్టు అతను వంచకుడూకాదు, నటుడు కాదు. యితరులవల్ల అతను బ్రతుకుతున్నాడంటే,

వాళ్ళని మోసంచేద్దామనిగాదు; అలాంటి టక్కరితనం అతనికి లేనూలేదు. యితరుల దగ్గర చంటిపిల్లాడిలాగే మసులుకువస్తూ కాలం గడుపుతున్నాడు...అవును పాపం... అంతే కావచ్చును; లేనితనం, దురదృష్టం వెంటాడి, వేటాడి అతన్ని వేధిస్తున్నాయి. దుర్భర దారిద్ర్యంతో, ఆకలితో అతను మరణించవచ్చును. అందుకా మనం అతన్ని రాళ్లతో కొడుతున్నాం? లోకంలో యిదెవరికైనా న్యాయమేనా? జీవితంలో అత నేమీ సాధించలేదు. కారణం అతని మనసు చంచలమైనది. నెత్తురులో అలాంటిశక్తిలేదు. అయితే యిక ముందు అతనెందుకూ పనికిరాడని ఎవరనగలరు? యిప్పుడు మాత్రం అతను పనికిరాకుండా ఎలా పోయాడు? అతనికి కొన్ని మహదాశయాలున్నాయి. ఆ ఆశయాలను నెరవేర్చే శక్తిమాత్రం ప్రకృతి అతనికియ్యలేదు. కాని తన ఆశయాల్ని గురించి, యువకులకు చెప్తూనేవున్నాడు. యువకుల హృదయాలలో అతను నాటిన యీ విత్తులు రేపుఫలించవని ఎలా అనగలం? ఏ ఆశయాలనైతే అతను నిర్వర్తించలేకపోయాడో ఆ ఆశయాల్ని సాధించేశక్తి ప్రకృతి యువకులకు యీయవచ్చు. అందరియువకుల మాటదాకా ఎందుకు? నా మట్టుకు నాసంగతిచెప్తాను. అతనికి నే నెంతో రుణపడ్డాను. నా చిన్నతనంలో రూడిన్ అంటే నాకేమిటో, పావ్‌లోవ్నాకు తెలుసును. రూడిన్‌మాటలు, ఎవరినీ ఉత్తేజపరచలేవని ఆనాడు పావ్‌లోవ్నాతో నే నన్నాను. ఉత్తేజపరచలేవంటే, యింత వయస్సున్న నాలాంటివాళ్ళనుగాని, యువకుల్ని మాత్రం కాదు. జీవితంలో ఒడిదుడుకులు, కష్టనష్టాలు చవిచూచిన

మనలాంటివాళ్ళ సంగతి వేరు, జీవితరంగంలోనికి అప్పుడప్పుడే కాలుపెడుతున్న యువకులవిషయం వేరు. పొరపాటున మనిషి ఒకతప్పు చేస్తే యిక అతన్ని మనంసహించలేం. సంగీతంలో అపశృతి వినిపిస్తే, చెవులుమూసుకుని 'హరిహరీ' అంటాం. యువకు లలాకాదు. అపశృతులున్నా వాటిజాడ తెలియ నపుడు, వారికి సంగీతం శ్రావ్యంగానే వుంటుంది. వారు శృతి కలుపుతారు.'

'నిజం. నిజం. మీరన్నది నిజం. రూడిన్ మన హృద యాన్ని కదిలించడమేకాదు. ఉద్రేకపరుస్తాడు. విహంగంలా ఎగిరేటట్టు చేస్తాడు. మనల్ని నడిపిస్తాడు, పరిగెత్తిస్తాడు.' అన్నాడు బెసిస్టోవ్. లెజ్నోవ్ పిగసోవ్‌వంక తిరిగి 'రూడిన్ ప్రతిభా ప్రభావా లేమిటో, బెసిస్టోవ్‌కంటే ఉదాహరణ నీ కింకేం కావాలి? బెసిస్టోవ్ మ రియువకుడేకదా, పిగసోవ్! నువ్వు తత్వశాస్త్రాన్నిపట్టుకుని దుమ్మెత్తిపోస్తావే, అయితే, దాన్ని కాదంటున్నప్పుడు నీ వాదనేమిటో చెప్పు. నేనంటావా? నాకు తత్వశాస్త్రమంటే యిష్టమూ లేదు. ఉన్నా అర్థమూకాదు. మనదుఃఖానిక ప్రధానకారణం తత్వశాస్త్రం కాదు. తత్వశాస్త్రంపేరిట మాట్లాడే పదాడంబరం, చేసే అకతాయిపనులు! యివి మనరష్యన్‌లను ఏమాత్రం మోసగిం చలేవు. ఆ మోసంలో పడకుండా తప్పించుకొనే లౌకికజ్ఞానం మనకుంది. అయితే తత్వశాస్త్రంపేరిట సత్యాన్ని మరుగు పుచ్చుతున్నపుడు, అరిసిపుచ్చుతున్నపుడూ మనం సహించ లేము రూడిన్‌కున్న లోపమల్లా అతనికి రష్యన్ల స్వభావ మేమిటో తెలియకపోవడం. అది అతని దురదృష్టం. మనం

ఎవ్వారం లేకుండానే, రష్యా మనగలుగుతుంది. మనంమాత్రం రష్యా లేకుండా ఒక్కనిముషం జీవించలేం. అలా జీవిస్తాననుకునేవాడు జడుడు. అలా జీవించేవాడు మరీ మూర్ఖుడు. పూర్తిగా జాతీయ సంప్రదాయాన్ని మరచిన, లోకంలోని అనేకధోరణుల, సంప్రదాయాల కలగూరగంప అర్థంలేనిది. అప్పుడు వ్యక్తిత్వమే నశిస్తుంది. జాతీయతను త్యజించి దానికి భిన్నంగా ప్రవర్తించినపుడు సత్యమూలేదు; జీవితమూలేదు; కళలూలేవు. ఊహచిత్రానికైనా ఒకముక్కూ, రెండు చెవులూ, కళ్లు అంటూ ఒక ఆధారముండాలికదా? ఆపిరికైతే నిర్దిష్టమైన ఆకారమంటూ వుండదు...యింతకీ యిది రూడిన్ దోషంకాదు. అది అతనిదురదృష్టం. అతన్ని నిందించవలసింది మనంకాదు. అందుకతన్ని నిందించవలసిన అవసరమూలేదు. యిన్నాళ్లూ మనమధ్యకొచ్చి అతనెందుకున్నాడని చర్చించి ప్రయోజనంలేదు. రూడిన్‌లోవున్న మంచి ఏదో చూసి, దాన్నే మనం మెచ్చుకుందాం. అలాఅయితే మనం అతనికి అన్యాయం చేసినట్టుకాదు. అతన్ని శిక్షించవలసింది మనం కాదు. అలాంటి అవసరం మనకులేదు. అతనికతనే శిక్షించుకున్నాడు. నేరానికి మించినశిక్ష విధించుకున్నాడు...

అతన్లోవున్న చెడ్డని పోగొట్టి, మంచిని యింకా పెంచాలని భగవంతునికి నా ప్రార్థన. మానవుడిలోవున్న సౌందర్యాన్ని భగవంతుడు కాపాడాలని నా వాంఛ. రూడిన్ కోసం, అతని క్షేమంకోసం మనం పానీయం సేవిద్దాం. అతనితో గడిపిన ఆ రోజులు ఎంత దివ్యమైనవి! యువకత్వంలో తొణికిసలాడే ఆశలు, ఆశయాలు, విశ్వాసం, సత్ప్రవర్తన,

చి తగుద్ది ఆ రోజుల్లో మమ్మల్ని ఆవహించేవి. బంగారంవంటి ఆ రోజుల్ని జ్ఞాపకం చేసుకుంటూ, రూడిన్ ఆయురారోగ్యాభివృద్ధిగా వరిల్లాలని, యిదిగో యీ పానీయం సేవిస్తున్నాను' అంటూ లెజ్నోవ్ చేతిలోని గ్లాసును ముందుకు పెట్టాడు. అందరూ అతని గ్లాసును తమ తమ గ్లాసులతో స్పర్శించారు. మహాసంతోషంతో బెసిస్టోవ్ తన చేతిలోని గ్లాసును నేలమీద జారవిడిచాడు. పావ్లోవ్నా ఆనందంలో తన భర్త చేతులను పట్టుకొంది. పిగసోవ్ నవ్వుతూ 'నువ్వింత ఉపన్యాసకుడవని నే ననుకోలేదు. రూడిన్ కంటె అమోఘంగా ఉపన్యసించావు. నేనే కదిలిపోయాను' అన్నాడు.

'నేనేమీ ఉపన్యాసం చెప్పలేదే? యింతకీ నిన్ను కదిలించడం ఎవరితరంకాదు. ... సరే. రూడిన్ మాట మన కెందుకు? మరో విషయం మాటాడుకుందాం' అంటూ లెజ్నోవ్, బెసిస్టోవ్ను యిలా ప్రశ్నించాడు. పాండలవిస్కీ యింకా అక్కడే వున్నాడా?

'అక్కడే వున్నాడు. అతనికి ఆవిడ మంచి ఉద్యోగమొకటి చూసింది. పెద్ద జీతమే.'

విందు ముగిసింది. అతిథులంతా వెళ్ళిపోయారు. భార్యాభర్తలు యిద్దరుమాత్రమే మిగిలిపోయారు. పావ్లోవ్నా భర్తను చిరునవ్వులతో పలకరించింది. అతని నుదుట మీదపడుతున్న తలవెంట్రుకలను, తన కొనగోళ్ళతో వెనక్కి సవరిస్తూ 'ఈవేళ ఎప్పుడూ అనుకోంది, మీరెంత హాయిగా మాట్లాడారండీ. ఎంత బాగా మాట్లాడారూ! తెలివితేటలుగా ఔదార్యంగా మాట్లాడారు. కాని ఒక్క సంగతి మాత్రం

మీ రొప్పుకోక తప్పదు. ఆనాడు రూడిన్ అంటే ఎంత ఖ్యాతి లేకంగా ఎంత ఉద్రేకంతో మాటాడేరో యీవేళ అంత ఉద్రేకంగానూ సమర్థిస్తూ మాటాడారు.'

'నేలకొరిగిపోయిన మనిషిని నేను. కొట్టలేను పావ్ లోవ్నా. ఆ రోజుల్లో అంటే వేరు. తన మాటలతో రూడిన్ ఎక్కడ నిన్ను పెడదారి పట్టిస్తాడోనని నాభయం.'

'బావున్నాయి మీ మాటలూ,మీరూనూ. ఎవరన్నా వింటే నవ్వుతారు. అతను మాటాడుతూంటే, తెలివైన వాడనిపించింది అతనంటే నాకూ భయమే. కాని అతని ముందు ఏమీ మాటాడలేకపోయేదాన్ని. అదేమిటండీ; ఆ పిగసోవ్ రూడిన్‌ని అంతలా వేళాకోళం చేస్తాడు? అస హ్యంగా లేదూ?'

'పిగసోవా? అతనంత అసహ్యంగా మాటాడేడు గనుకే రూడిన్ అంటే నే నంత అభిమానంగా మాటాడేను. సమర్థించాను. రూడిన్ వంచకుడని యిచ్చకాలరాయుడని అనడానికి అతని కెంత ధైర్యం? అలాఅయితే రూడిన్‌కంటే, పిగసోవ్ వెయ్యిరెట్లు వంచకుడు. ఏదో యింత భూమీపుత్రా వుంది. పిగసోవ్‌కి పట్టపగ్గాలులేవు. రూడిన్నేకాదు. ప్రతివాణ్ణి వెక్కిరిస్తాడు. వెక్కిరించడూ మరి? యిప్పుడు కనిపించే ప్రతిదాన్ని, ప్రతివాణ్ణి, ప్రతిస్త్రీని తిడుతూన్న, యీ పిగ సోవే ఉద్యోగం చేస్తున్నప్పుడు ఏం చేసేవాడో తెలుసునా?'

'ఏం చేసేవాడూ?'

'అప్పుడు రెండుచేతులా లంచాలు మేసేవాడు.'

'నిజంగానా?'

'నిజం. ముమ్మాటికీ నిజం.'

'అతనలాంటివాడని అనుకోలేదే?'

'నీకేం తెలుస్తుంది? ఆడదానివి.'

కొంతసేపు మౌనంగా యిద్దరూ వుండిపోయారు. పావ్‌లోవ్నా, భర్తను యిలా ప్రశ్నించింది. 'మిమ్మల్ని ఒకటడగాలనుకుంటున్నాను.'

'అడుగు. చెబుతాను.'

పావ్‌లోవ్నా నవ్వి కొంచెం సిగ్గుతో అడిగింది. 'నటాలియాకి, మా అన్నకీ పెళ్లైతే...'

'ఊఁ. పెళ్లైతే?'

'యిద్దరి దాంపత్యం బాగా వుంటుందా అని.'

'బాగానే వుంటుంది. చిలకాగోరంకల్లా వుంటారు. యిద్దర్లోకి ఆ పిల్లే గడుసుది. అతను మంచివాడు. మనసారా ప్రేమించాడు! పెళ్ళి చేసుకుంటున్నాడు. పెళ్లాం చెప్పినట్టు వింటాడు. యింతకన్న యింకేం కావాలి? భార్యాభర్తలిద్దరూ అన్యోన్యంగా వుంటారు... మనయిద్దరి మాటే తీసుకో. ఒకళ్ళనొకళ్ళం ప్రేమించుకున్నాం. పెళ్ళి చేసుకున్నాం. సుఖపడుతున్నాం. ఏమంటావు మరి.'

ఆమె నవ్వింది. నవ్వి అతని చేతులను పట్టుకుంది.

♦ ♦ ♦

అదేరోజున మిట్టమధ్యాహ్నపు ఎండలో ఒక మూడు గుర్రాలబండి రోడ్డుమీద గుబిర్నియావైపు పోతున్నది. చిరిగిపోయిన ఓవర్‌కోటు వేసుకొని గూనివాడిలా బండి తొట్టెల్లో కూచుని ఒకతను గుర్రాలను కొరడాలతో అదిలిస్తు

న్నాడు. బండిలో గూడుకింద ఒక పొడుగైన వ్యక్తి ఆసీనుడై వున్నాడు. పెద్ద టోపీ పెట్టుకున్నాడు. బట్టలు మాసిపోయాయి. పక్కను ఒక పెట్టెవుంది. బండిలో కూచున్న వ్యక్తి రూడిన్. తల కిందకువంచుకుని, పక్కకు ఒరిగిపోతున్న టోపీని సర్దుకున్నాడు. గతుకులకు బండి కుదుపుతోంది. కుదుపులకు అటూ యిటూ కదులుతూ రూడిన్ జోగిపోతు న్నాడు. జోగిపోతున్న మనిషి సర్దుకుని కూచున్నాడు. 'ఎప్పటికైనా సత్రవుకు చేరుకుంటామటోయి' అని బండివాణ్ణి రూడిన్ ప్రశ్నించాడు.

'అయ్యో గుర్రం! అరెరే.' అంటూ గుర్రాలను అదిలించాడు. 'ఆట్టే దూరం లేదండీ. ఆమడదూరం వెడితే అదే సత్రవు. అదిగదిగో. ఆ కొండమళుపు దాటితే వెళ్ళిపోయామన్నమాటే...నడవక ఏమిటాలోచన గుర్రాలకి! బండి విప్పనీ; మీ పని పడతా. గుగ్గిళ్లు తిని బద్ధకం బలిసిందే గుర్రాలకి?' అంటూ బండివాడు ఛెళ్లున ఒక గుర్రాన్ని కొరడాతో కొట్టాడు.

'గుర్రాలు కాదయ్యా. నీకు తోలడం తెలియదు. పొద్దుట్నుంచి అలా బాదుతున్నావుగాని ఒక్కడుగు బండిని కదిలించవే? వాటిని కొట్టడంమాని, ఏదైనా పాటపాడు. యిద్దరికీ ఊసుపోతుంది.'

'కాళ్లు గుంజెక్కిపోయాయి. లాగలేకపోతున్నాయి బాబు! మరి చాలా దూర మొచ్చాం కదండయ్యా! అందులోనూ గతుకుల దారి. ఫెడేలుమని చెంపమీద కొట్టినట్టు ఎండొకటి... నేనేం పాడతానండీ? నాకేం పాటలు రావండి...

అరెరె. గుర్రాలూ, గొర్రెపిల్లల్లా కదలవే? నడవండే. యింకెంతో దూరంలేదు.'

బండి కెదురుగా ఒక కుర్రవాడు అడ్డం వచ్చాడు. బండివాడు కోపంగా 'దారిచూసుకుని నడవరా కుర్రాడా' అని బండి ఆపాడు.

'బండి మీదకుతోలి, నన్ను చూసుకోమంటావే?' అని కుర్రవాడు గద్దించాడు.

'అబ్బో. చురచుర లాడుతున్నావు. ఎవరనుకున్నావు. బండిలోవున్న దెవరనుకున్నావు? దొరగారు. మాస్కోనుంచి వస్తున్నారు. పట్నపుబాబుల్తో నీకేమిటి? దారిచూసుకు నడు!' అంటూ బండివాడు బండినిపోనిచ్చాడు. యీడుస్తూ గుర్రాలు సత్రవును చేరుకున్నాయి. బండిదిగి రూడిన్ బండివాడికి డబ్బిచ్చి పంపించివేశాడు. పెట్టెపట్టుకుని సత్రవులోనికిఅడుగులు వేశాడు. సత్రవులో కాపలావాడు నిద్రపోతున్నాడు. నిద్ర పోతున్న కాపలావాణ్ణిలేపి, రూడిన్ 'యిక్కడెక్కడైనా మంచి గుర్రపుబండి దొరుకుతుందా' అని ప్రశ్నించాడు. మంచిగుర్రాలు యీప్రాంతాల్లో లేవని అతను సమాధాన మిచ్చాడు.

'మంచివికాకపోతే పోనీ, గుర్రాలు దొరుకుతాయా?'

'మీ రెక్కడికి వెడుతున్నారు?'

రూడిన్ తాను వెళ్ళబోతున్న గ్రామంపేరు చెప్పాడు. కాపలావాడు 'గుర్రాలు దొరకవండీ' అన్నాడు. రూడిన్ ఒక గదిలోనికివెళ్ళి విసుగ్గా, టోపీ కిటికీచెంతకు విసిరివేశాడు. ఎంతసేపు గడిచినా అతనిలో కలిగిన పెద్దమార్పేమీ లేదు.

మోము కొంచెం ముడతలు తేరింది. ఉంగరాలజుత్తు అక్కడక్కడ తెల్లబడింది. కొంతతేజస్సును కోల్పోయినా అతని అందమైన కనులు కాంతులతో ప్రజ్వలిస్తున్నాయి. పెదవులదగ్గిర చిన్న చిన్న లొత్తులుపడ్డాయి. భరించలేని కష్టాలను, అనుభూతాలను, విషాదాన్ని అతనిమోము వ్యక్త్యంచేస్తున్నది. మాసిపోయిన దుస్తులువేసుకున్నాడు. దుస్తులు యీమధ్యన కుట్టించుకున్నవికావు. చొక్కామీద కోటు తొడుక్కున్న జాడ కానరావడంలేదు. యౌవనమంతా నశించిపోయినట్టు కనిపిస్తున్నాడు. సత్రవుగోడమీదవున్న రాతిపలకను చూస్తూ అక్షరాలను చదువుతూ నిలబడ్డాడు. బయటికివెళ్ళిన కాపలా మనిషి తిరిగివచ్చి, ఆ వూరికైతే బండి దొరకదు బాబూ. అంతదూరం రాలేమంటున్నారు' అన్నాడు.

'అయితే ఏ వూరికైతే దొరుకుతాయి?'

'ఓవోకైతే తిరుగుబళ్లున్నాయండి!'

'ఓవోకా? అక్కడనుంచి మళ్ళీ వెళ్లాలంటే చాలా దూరమే! చుట్టుదారి. 'ఓవో', 'టాంబోవు' కు వెళ్లేదారిలో కాదూ వుంది? నేను 'పెంజా'కు వెళ్లాలి.'

'దానికేముందండి. 'టాంబోవు'నుంచి వెళ్లొచ్చండి. ఓవోనుంచి అడ్డదారికూడా వుందండి.'

రూడిన్ ఆలోచించాడు.

'ఓహో! అలాగా? అయితే బండి కుదుర్చు. ఎలాగైనా నాకొకటే. 'టాంబోవు'కే వెడతాను.'

బండికి గుర్రాలను పూన్చారు. రూడిన్ పెట్టె తీసుకుని యివతలి కొచ్చాడు. మెల్లగా బండిఎక్కి తలవంచుకొని

చూస్తూ కూచున్నాడు. నడుంవంచుకుని కిందకుచూస్తున్న రూడిన్ అసహాయునిలా, దైన్యంగా నిట్టూర్చాడు. బండి కదిలింది. గుర్రాల డెక్కల, మెడలోని మువ్వల చప్పుడు వినిపిస్తోంది.

## 13

ఎవరాగినా కాలం ఆగదు. లిప్తలో కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి. ఋతువులు వెళుతున్నాయి; వస్తున్నాయి. శరదృతువు వచ్చింది. చెట్లు, పండిన ఆకులను టపటపా కన్నీటిబొట్లవలె రాలుస్తున్నాయి. 'గుబెర్నియా' ప్రాంతంలో 'యస్' అనే నగరం పెద్దది. నగరం మధ్యను పెద్ద హోటలు ఒకటి వుంది. కరకరా పొద్దుపొడిచింది. చలిగాలి రొప్పుకొస్తోంది. హోటల్ ముందు ఒక గుర్రపుబగ్గీ ఆగింది. బగ్గీలోంచి ఒకవ్యక్తి దిగి బద్ధకంగా ఆవులించి, వళ్లు విరుచుకొని చిటెకెలు వేశాడు. మనిషి వయసులో అంత పెద్దవాడు కాకపోయినా అతన్ని చూసేసరికి గౌరవభావం ఉదయిస్తుంది. హోటల్‌లోకి వెళ్ళి మేడమెట్లెక్కి మొదటి అంతస్తులోనే నిలబడి అటుయిటూ చూశాడు. ఎవరూ కనిపించలేదు. 'ఎవరూ లేరే? నాకో గదికావాలి' అని బిగ్గరగా అరచాడు. మూలనున్న గదితలుపు తెరుచుకొని, ద్వారపు తెరలను తొలగించుకొని ఒక కుర్రవాడు బయటకు వచ్చాడు. వచ్చి ఆ మనిషిని ఒక గదిలోనికి తీసుకువెళ్ళాడు. గదిలోకి వెడుతూ ఆ వ్యక్తి ఓవర్‌కోటు విప్పుకొని, బల్లమీదకు విసరివేసి, సోఫాలో చతికిలబడ్డాడు. రెండుచేతులూ ముణుకుల

మీాద ఆనించుకొని, సగం సగం నిద్రపోతూ 'మా నౌకరు కుర్రాడు అవతల వున్నాడు. పిల్చుకురా' అని ఆజ్ఞాపించాడు. యీ వ్యక్తి మరెవరోకాదు; లెజ్‌నోవ్.

నౌకరు గదిలోకి వచ్చాడు. ఉంగరాలజుత్తు, ఎర్రని బుగ్గలు కుర్రవాడు సొగసుగా వున్నాడు. గోధుమరంగు ఓవర్‌కోటు వేసుకున్నాడు. బూట్లు బరువుగావున్నాయి.

'మంచిది; కుర్రోడా! ఎలాగో యిక్కడికిచేరుకున్నాం. అమ్మయ్య!'

'ప్రాణం కుదుటబడిందండీ.'

మేడమెట్ల చెంత కాలిఅలికిడి వినిపించింది. అడుగుల చప్పుడు లెజ్‌నోవ్ గదిదగ్గర ఆగిపోయింది. 'ఎవరిక్కడా? హోటల్‌లో ఎవరూ లేరూ?' అనేపిలుపు వినవచ్చింది. లెజ్‌నోవ్ లేచినించుని గది తలుపుతీశాడు గదికి కొంచెందూరంలో ఒకవ్యక్తి నుంచుని హోటల్‌కుర్రాడికోసం నిరీక్షిస్తున్నాడు. మనిషి ఎత్తుగావున్నాడు. రాగిజుత్తు, మొఖమల్‌రంగు కోటు వేసుకున్నాడు. యి త్తడిబొత్తాలు తళతళా మెరుస్తున్నాయి. మనిషిని చూడగానే, లెజ్‌నోవ్ ఆనవాలుపట్టి 'రూడిన్' అని పిలిచాడు. పిలుపువిని రూడిన్ అటుతిరిగాడు. లెజ్‌నోవ్ మొహం గదివైపు తిరిగివుంది; వెనకతట్టుచూసి, రూడిన్ అతన్ని వెంటనే గుర్తుపట్టలేకపోయాడు. లెజ్‌నోవ్ అటు తిరిగి, 'నన్నింకా గుర్తేపట్టలేదా?' అని అడిగాడు.

'ఓహో! మైకేల్ మిఖిలోవిచ్ లెజ్‌నోవా?' అంటూ రూడిన్ కరస్పర్శ చేసేందుకు తనహస్తాన్ని ముందుకుచాచి గబుక్కున వెనక్కిలాక్కున్నాడు. అనాడు తన ప్రేమఉదంతం

చెప్పడానికని, రూడిన్ లెజ్‌నోవ్ యింటికి వెళ్ళాడు. కరస్పర్శ చేయబోయాడు. లెజ్‌నోవ్ తనహస్తాన్ని వెనక్కిలాక్కుని 'మనకి, మనకి కరస్పర్శ లెందుకులే' అన్న ఆనాటిమాటలు, రూడిన్‌కు జ్ఞాపకమొచ్చాయి. చాచినహస్తాన్ని వెనక్కి లాక్కుని సంశయంగా చూస్తున్న రూడిన్ చేతిని, లెజ్‌నోవ్ ఆప్యాయంగా రెండుచేతులతోనూ పట్టుకొని ఒత్తాడు.

గదిలోనికి అతన్ని తీసుకువెడుతూ' లోపలికిరా. కులాసాగా గడుపుదాం.' అని ఆహ్వానించాడు. యిద్దరూ కుర్చీల మీాద కూచున్నారు. కొంతసేపు నిశ్శబ్దం. బొంగురుపోయిన గొంతుతో, మెల్లగా లెజ్‌నోవ్ 'చాలా మారిపోయావే' అన్నాడు.

రూడిన్ గది నలుమూలలా దృష్టినిసారిస్తూ, 'అవును. మారిపోయాననే అంతా అంటున్నారు. పోయేకాలమేగాని వచ్చేకాలమేమిా కాదుగదా. ఒక్కొక్క ఏడే మీాదపడుతోంది. వయసు మళ్ళుతోంది. కాని నువ్వు మామూలుగానే వున్నావు. అన్నట్టు అడగటంమరిచిపోయాను. పావ్‌లోవ్నా... నీభార్య కులాసాగావుందా?'

'కులాసాగానే వుంది. మమ్మల్ని నువ్వు మర్చిపోనందుకు కృతజ్ఞుణ్ణి. అయితే యిక్కడికి ఏంపనిమిాద వచ్చావు?'

'నేనా? ఏం పనీలేదు.'

'యిన్నాళ్లూ ఏం జేస్తున్నావు?'

'అదంతా ఓ పెద్దగాథ. యిక్కడికి కాకతాళీయంగా వచ్చాను. యిక్కడ నాకు తెలిసున్న మనిషొకడున్నాడు.

ఆయన వస్తాడని, వస్తే కలుసుకుందామనుకుంటున్నాను. సరే, నా మాటకేంగాని, నిన్నిక్కడ కలుసుకున్నందుకు...'

'భోజనం, బస ఎక్కడ?'

'నా భోజనమా? అదెక్కడో నాకే తెలియదు. ఏదో సత్రవు ఎలాగా దొరుకుతుంది. యీవేళ వెళ్ళిపోవాలి కూడాను.'

'వెళ్ళిపోవాలా?'

రూడిన్ అర్థవంతంగా నవ్వేడు, 'వెళ్ళిపోవద్దు మరి. నన్ను మా గ్రామానికి వాళ్లు పంపిస్తున్నారు. అక్కడే వుండి పోతాను.'

'మనిద్దరం కలిసి భోంచేదాం,' రూ డి న్ తలెత్తి చూశాడు. యిద్దరిచూపులు కలుసుకున్నాయి.

'నన్ను భోజనాని కుండమంటున్నావా?'

'అవును రూడిన్. ఉండమంటున్నాను. పూర్వంలాగే మనం చదువుకుంటున్న రోజుల్లో ఎలా గడిపేమో, ఎంత స్నేహంగా ఉన్నామో అలాగే యిప్పుడూ వుందాం. భోజనానికి వుంటావు గదూ? నిన్ను కలుసుకోగలుగుతానని నేనెప్పుడూ అనుకోలేదు. ఆడబోయిన తీర్థం ఎదురైనట్లు యిక్కడ నువ్వే తారసపడ్డావు. మళ్ళీ మనం కలుసుకుంటామో లేదో. యిద్దరం కాస్సేపు కులాసాగా కాలక్షేపం చెయ్యకుండా ఎవరిదారినివాళ్లు వెళ్ళిపోవడం భావ్యమా మరి?'

'సరే. ఉండిపోతాను.'

లెజ్నోవ్, రూడిన్ చేతులను పట్టుకొని సంతోషంతో

సిమిరేసు. నౌకర్ని పిలచి 'యిద్దరికి భోజనం చెప్పు. ఐస్ వేసి ద్రాక్షపానీయం తీసుకురమ్మను...'

♦ ♦ ♦

భోజనంవేళైంది. మౌనంగా మిత్రులు భోజనం చేస్తున్నారు. తమ విద్యార్థిదశను జ్ఞప్తికితెచ్చుకొని, ఆనాటి ముచ్చట్లను చెప్పుకోవాలనే కోరిక ఒకరికొకరికి తెలియకుండా యిద్దరికీ కలిగింది. చూపులతోనే పరస్పరం అర్థంచేసుకున్నట్లు యిద్దరూ ఆనాటి ముచ్చట్లను చెప్పుకుంటున్నారు. తమ స్నేహితులు, సహాధ్యాయులు, ఉపాధ్యాయులు వారి యోగ క్షేమాలూ ప్రసంగంలో దొర్లుకొస్తున్నాయి. కొందరు సహాధ్యాయులు చనిపోయారు. మరికొందరు యిప్పుడు పెద్ద ఉద్యోగాలు చేస్తున్నారు. రూడిన్ మొదట ఏమీ మాట్లాడ లేకపోయాడు. రెండుగ్లాసుల ద్రాక్షసారా తాగిన తరవాత మనసుకు కొంచెం ఉల్లాసం కలిగింది. లెజ్నోవ్ లేచి తలుపు బిగించి, ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుని చేతులమీద గడ్డాన్ని ఆనించుకొని, అతని కళ్ళల్లోకి చూస్తూ ఉండి పోయాడు. 'యిక యిప్పుడు చెప్పవయ్యా రూడిన్! మనం కలుసుకొని చాలా ఏళ్ళయింది. అప్పట్నించీ యిప్పటివరకూ జరిగిన విశేషాలన్నీ చెప్పు.'

రూడిన్ లెజ్నోవ్ వంక చూశాడు. రూడిన్ దీనవదనాన్ని చూసి 'ఎంతమార్పు! పాపం పూర్తిగా మారిపోయాడు' అనుకున్నాడు లెజ్నోవ్.

అవును. రూడిన్ పూర్తిగా మారిపోయాడు. ఆనాడు మూడుగుర్రాల బండీలో కుదుపులకు ఊగుతూ కూచున్న

రూడిన్ వేరు. యిప్పటిరూడిన్ వేరు. ముసలితనం ముసురుకు వస్తున్నట్లు, కంటిచూపు మారింది. నడుస్తున్నపుడు ఒకవిధ మైన వణుకుపట్టుకుంది. మాటలుకూడా ధారాళంగా రావడం లేదు. ఆగుతూ, తడబడుతూ, నీరసంగా మాట్లాడుతున్నాడు. పూర్వం అతనిమాటలు బాకులవలె గుచ్చుకొనేవి. ఒరలో నుండి దూసిన కత్తులవలె హృదయంలోంచి వెలువడేవి. యిప్పుడు మాటల్లో పూర్వపు చమత్కారమూలేదు. తేజస్సూ లేదు. అలసిపోయినట్లు, విచారంతో కృంగిపోతున్నట్లు లోనున్న విషాదాన్ని దాచుకుందుకు ప్రయత్నిస్తున్నట్లు, వూహించినకలలు పేకమేడలుగా కూలిపోయినట్లు, రూడిన్ భగ్నహృదయంతో మాట్లాడుతున్నాడు.

'ఇన్నేళ్ళూ ఎలా గడిపేనో చెప్పమనికదూ, అడిగేవు నువ్వు! ఎలా గడుపుకువచ్చానో చెప్పలేను. చెప్పి లాభం లేదు...చాలా బాధపడ్డాను. చెప్పలేనంత బాధ. ఒక వూరు కాదు; వాడ కాదు. వూరూరా తిరిగాను. కష్టాలు కలకాలం కాపురముండవంటారు. కాని నేను కష్టాల్లోపుట్టాను. కష్టాల్లో పెరిగాను. జీవితమే ఒక దిగులు. శారీరకకష్టమే కాదు. మానసికంగా అవస్థల పాలయ్యాను. అబ్బ! జీవితంలో ఎన్ని రాగద్వేషాలు, ఎన్ని అనుబంధాలు. వీటికి అంతూపొంతూ లేనులావుంది...ఏమాటలు నాపెదవులనుంచి జారిపడ్డాయో, పెదవి విప్పి నే నే మాటలన్నానో, ఆమాటలే నాకు ఎదురు తిరిగాయి. పగపట్టాయి. నన్నేకాదు, నామాటలు నమ్మి, నాఆశయాలతో ఏకీభవించిన ప్రతివాణ్ణి, ఆమాటలు పాముల్లా కాట్లువేశాయి! గుర్రం వుంది. కొరడాతో ఒకసారికొడితే

అనుకుంటుంది. యింకోసారైతే బెదురుతుంది. అస్తమానం కొడితే బండబారిపోతుంది. నేనూ అంతే. నా స్థితీ అంతే. మొదట చిన్నపిల్లాడిలా మారాం చేశాను. తరవాత ఆ గుర్రం లాగే మొద్దుబారిపోయాను. ఎప్పుడూ సంతోషం, ఏవేవో ఆశలు, కలలు, వీటికోసం తాపత్రయం, కోపతాపాలు, దెబ్బ లాటలు వీటితోనే నా జీవితం గడిచిపోయింది. కనీసం ఒక్క కలా నిజం కాలేదు. మొగ్గలోనే పుట్టి, మొగ్గలోనే ఆశలన్నీ నశించిపోయాయి. ఎక్కడికి వెడుతున్నా డేగలా బయలు దేరేవాణ్ణి. కాని నత్తలా ముడుచుకుపోయి తిరిగివచ్చేసేవాణ్ణి. వచ్చే ఏముంది? గుల్ల లేని నత్త మిగిలింది. నేను తిరగనిచోటు లేదు. వెళ్ళని వూరులేదు. వెదకని స్థలంలేదు. తొక్కనిదారి లేదు. ఆగదు కాకిలా దేశమంతా తిరిగాను. ఎన్నెన్నో ఆలో చించాను. అనేక బాటలవెంట నడిచాను. కొన్ని బాటలు సుగమయం. మరికొన్ని ముళ్లదార్లు.' రూడిన్ కళ్లు పెద్దవి చేసుకొని, పక్కకి చూస్తూ. 'లెజ్‌నోవ్!' అని మన్ననగా పిలచి, 'ఈ సంగతి తెలుసునా?' అని ప్రశ్నించాడు.

తనను రూడిన్ మన్ననచేయడం లెజ్‌నోవ్‌కు కష్ట మనిపించింది. 'నన్నెందుకలా మన్నాపనచేస్తావు రూడిన్! పూర్వం మనం కలసి మెలసి ఎలా వుండేవాళ్ళం? ఒక కంచంలో తింటూ ఒక మంచంమీద పడుకొని, మనం చదువుకున్న రోజులు మరచిపోయావా? ఆరోజులు మళ్ళీ వచ్చా యనుకుందాము అప్పుడు మనిద్దరం ప్రాణస్నేహితులం.' యిప్పుడు సోదరులం.'

రూడిన్ మనోధైర్యం తెచ్చుకున్నాడు. కుర్చీలోంచి
లేచాడు. ఒక్కసారి, లెజ్నోవ్ వంక చూశాడు.
అతని చంచలమైన చూపులలో చెప్పలేనిభావాలు! మాటల
కందని భావాలను చూపులు వ్యక్తంచేస్తున్నాయి. అప్పటి
వలె రూడిన్ ధాటీగా మాట్లాడలేకపోతున్నాడు. అప్పు
డతను మాటకారి. గవ్వాలగుత్తి; గువ్వాలపలుకు! ఊపిరి
విడుస్తూ, నవ్వుతూ రూడిన్ 'లెజ్నోవ్! చూశావా? నా
స్థితి ఎలావుందో. నాలో ఏదో పురుగు ఉందనుకుంటాను.
అది అస్తమానం తొలుస్తూ, చెట్టుమొవ్వను తింటున్నట్టు
నాశక్తిని హరించివేస్తోంది. యింక మనశ్శాంతి ఎలా
వుంటుంది? ఎవరైతే మొదట నేనంటే మోజుపడతారో,
వాళ్ళే తరువాత నాకు వ్యతిరేకమౌతారు...మీవూళ్ళోంచి
వెళ్ళినతరువాత, ఎంత ప్రయత్నించా ననుకున్నావు? ఏదో
సాధిద్దామని నా కల. ఇప్పుడిప్పుడే జీవితం ఆరంభమైందను
కొని ఉత్సాహంగా ఒకప్రయత్నం చేసేవాణ్ణి. ప్రయత్నం
సగంలో విఫలమయ్యేది. మళ్ళీ యింకోప్రయత్నం; పురిట్లోనే
సంధి. ఆశలన్నీ యిలా కూలిపోయినప్పుడు మనిషేమైపో
తాడు? నీకు వేరేచెప్పాలా!'

'అందుకు తగినంతధృతి నీకులేదు రూడిన్.'

'నువ్వన్నది నిజం. శక్తి సన్నగిల్లింది. భవనం ఎలా
వుండాలో ఊహిస్తానేతప్ప దానిని కట్టలేను. అదీ నాలోపం.
యింతకీ భవనం కట్టేముందు స్థలం ఉండాలికదా! నా కాళ్ళ
కింద ఏముందో, నేలమీద నుంచున్నానో లేదో నాకే తెలి
యదు. నిలబడడానికి నాకు జాగాయే లేదు. జాగావుంటేగదా

పునాదిరాళ్లు వేయడం, శంకుస్థాపనాను! యిన్నేళ్లు ఎలాగ గడిపానో, ఏసాహసకృత్యాలు చేశానో నా ప్రయత్నాలన్నీ ఎలా వ్యర్థమయూయో అవన్నీ చెప్పి నీకు విసుగెందుకు కలిగించడం?'

'నాకు విసుగేమిటి రూడిన్! మనం సోదరులమని చెప్పలేదూ? జరిగిందంతా చెప్పు. నీకష్టాలు నాతో కాక యింకెవరితో చెప్తావు?'

'సరే. రెండుమూడు ఉదంతాలు చెబుతాను. రెండు మూడు సంఘటనలు జరిగాయి. అదృష్టదేవత కనికరించిం దనుకున్నాను. చిరునవ్వులతో నన్ను పలకరించిందనుకు న్నాను. నా ఆశలన్నీ ఫలిస్తాయని వొళ్లుపులకరించింది. వాటిమీదనే నాఆశలన్నీ పెట్టుకున్నాను...'

రూడిన్ చికాకుగా, నిరాశతో తనజుత్తును రేపుకుంటు న్నాడు. జుత్తు చెరిగిపోయింది.

'ఏమి టా ఘటనలు?'

'విను; చెప్తాను. మాస్కోలో ఒక వ్యక్తితో నాకు పరిచయమైంది. అత నొక వింతవ్యక్తి. చాలా సిరిసంపన్నుడు. రెండుమూడు జమీలున్నాయి. ప్రభుత్వం ఉద్యోగ మిస్తా నన్నా నిరాకరించాడు. జీవితంలో అతనికి ఒకటే ఆశ. తాను పెద్ద శాస్త్రవేత్త కావాలని కలలు కనేవాడు. విజ్ఞానశాస్త్రమంటే వొళ్లు మరిచిపోయేవాడు. అతనికి ఎందు కింత ఆసక్తివుందో, ఆ దేవుడికే తెలియాలి. జీనుచూస్తే గుర్రం సకిలించినట్లు, విజ్ఞానశాస్త్రం పేరు వినగానే అతను ఎగిరి గంతువేసేవాడు. అయితే ఆ శాస్త్రాన్ని అర్థం చేసుకునే

పాటి తెలివితేటలు పూజ్యం. మాట్లాడ్డం అసలు చేతగాదు. నోరు మెదిపేవాడుకాదు. ఏం జెప్పినా బండిచక్రాల్లా గుడ్లు గిరగిరా తిప్పుతూ, అవునవునన్నట్టు బుర్ర టకాయించేవాడు. ఏంచెప్పినా బోధపడదు. ఎంత చెప్పినా తల కెక్కదు. అంత శుద్ధమొద్దావతారాన్ని నే నెక్కడా చూళ్లేదు. ఒట్టి చవిటి బుర్ర. చవిటిపర్రలో అక్కడక్కడ కనీకనిపించకుండా కొద్దిగా గడ్డి మొలుస్తుంటుంది. ఆ గడ్డిని పశువులుసైతం ముట్టవు. మనవాడు ఒకపని ప్రారంభించాడో, వెంటనే విధిగా ఉల్టాసీదా అయిపోయిందన్నమాటే! గోళ్లతో పోయేదానికి గొడ్డళ్లతో చీలుస్తానంటాడు అవలీలగా అయిపోయేపని అతను తలపెడితే, అతికష్టమౌతుంది; చెడిపోతుంది. చెడి పోయినా బాగుండునుకాని, ఎదురు తిరుగుతుంది. అతనే ప్రజల్ని పరిపాలిస్తే, ప్రజలు రెండుచేతులా గడ్డి తినవలసిందే. అయితేనేమి, అతను పడేశ్రమ చెప్పలేం. పుస్తకంమీద పుస్తకం చదివేవాడు. దస్తాలకొద్దీ కాయితాలు ఖరాబు చేసేవాడు. విజ్ఞానశాస్త్రం అతని కొరక అందమైన యువతి కాబోలు. ఆ పిల్ల ప్రేమించకపోయినా, వలపులుకురిపిస్తూ వెంగుపట్టుకు లాగేవాడు. 'పగలు చెయ్యిపట్టుకులాగితే లేదు గాని, రాత్రి కన్నుగీటితే వస్తుందట' అలా వుండేది అతని వ్యవహారం. అన్నీ తెలుసున్నట్టు నటించేవాడు. అయితేనేం; ఒక్కసుగుణం. అంతా భల్లూకపట్టు. ఎవరితోనూ చనువుగా వుండేవాడుకాదు ఒక్కడే, ఏకాకిగా కాలం గడిపేవాడు. అతన్నంతా, చాలా వింతమనిష నేవారు. ఈ వింతమనిషితో నాకు పరిచయమైందయ్యా; లెజ్‌నోవ్! అతనికి నేనంటే

గురి. అతని ఉత్సాహంచూస్తే నాకు సంతోషం. అతనొక ఆవేశంలాంటివాడు. డబ్బుందీ జమీలున్నాయి. ఏకూచింతా లేదు. అతనివల్ల ఏదో ఘనకార్యం సాధిద్దామనుకున్నాను. కొంతకాలం మాస్కోలోనే యిద్దరం ఉన్నాం. తరవాత అతని జమీకి వెళ్ళాం. ఆ రోజుల్లో నా వ్యూహాలు, పథకాలు, ప్రణాళికలు ఎన్నని చెప్పను! అంతా సంస్కరిద్దామనుకున్నాను. మళ్ళీ కలలు కన్నాను. నూతన సంస్కరణలు, పోకడలు, జీవితంలో ప్రారంభించాలనుకున్నాను.'

లెజ్నోవ్ ప్రేమతో నవ్వుతూ 'అవి, లాసున్స్కయా యింట నువ్వు కనిన కలలవంటి వనుకుంటాను.'

'కాదు. కాదు. లాసున్స్కయాయింట ఉన్నప్పుడు, నేను మాటాడుతున్నదంతా, ఎందుకూ పనికిరాదనుకునే మాటాడేవాణ్ణి. అక్కడ ఏదీ సాధించలేనని, అంతా నిష్ప్రయోజనమేనని కొంతకాలం పోయాక, నేననుకున్నాను. కాని యీ జమీందారుయింట వున్నప్పుడు నా ఆశలన్నీ చిగిర్చాయి. జీవితంలో గొప్ప అవకాశం వచ్చిందనుకున్నాను ... జమీకి వెళుతున్నప్పుడు చాలా పుస్తకాలు కూడా తీసుకువెళ్ళాను. అవన్నీ వ్యవసాయ శాస్త్ర గ్రంథాలు. వాటిలో ఒక్క పుస్తకంకూడా పూర్తిగా నేను చదవలేదు. సరే. కార్యక్రమాని కుపక్రమించాం. మొదట పనులు అనుకున్నంత, సులువనిపించలేదు. నెమ్మదిగా ఒక కొలిక్కి వస్తున్నాయి. జమీందారు నాకు స్నేహితుడేకదా. మొదట, పనుల్లో అతను జోక్యమేమీ పెట్టుకోలేదు. ఊరికే చూసేవాడు. ఏమీ అనేవాడు కాదు. అతని అభిప్రాయ మేమిటో

తెలుసుకోవాలనుకునేవాణ్ణి కాని చెప్పేవాడుకాదు. యిలా చేస్తే బాగుంటుందని నేనే సూచించేవాణ్ణి. నేను సూచించిన ప్రకారం, నడుచుకునేవాడు. కాని ఆ పనులు అయిష్టంగానే చేసేవాడు. లోలోపల ఏదో బాధపడేవాడు. ఉన్న అసంతృప్తేమిటో, పైకి తెలియనిచ్చేవాడుగాదు. అంతా లోలోపల స్వయంపాకం. చడీచప్పుడులేకుండా, యింతాచేసి వ్యవహారం యిక చక్కగా నెరవేరుతుందనగా, నేను చెప్పిందానికి భిన్నంగా తనకు తోచినట్లు చేసేవాడు. కోకిలగ్రుడ్డును ఏ రెక్కలతో, కాళ్ళతో, కాకి కొంతకాలం పొదిగి, ఆ రెక్కలతోనే, ఆ కాళ్ళతోనే కిందకు తోసేస్తుందో అలాగే అతను నా పథకాలను చిందరవందర చేసేవాడు.'

'అలా ఎందుకు చేసేవాడు?'

'నాకేదో పలుకుబడి వచ్చిపడిపోతుందని అతనికి భయం కాబోలు. అలాగే కనిపించేవాడు. ప్రవర్తించేవాడు. నేను చెప్పింది అడ్డదిడ్డంగా చేయడమో, లేకపోతే మొదట ప్రారంభించి, తరువాత రద్దుచేయడమో! ఇదీ అతనుచేసేపని. యిలా రెండేళ్ళు బాధపడ్డాను. నా శాయశక్తులా, బాగుచేద్దామని ప్రయత్నించాను. ప్రారంభించినపని, దినదినాభివృద్ధిగా పాడయ్యేది. నాకువిసుగెత్తేది. పొమ్మనలేక పొగబెడుతున్నట్లు నన్ను ఊదరపెట్టేవాడు. అతనిమీద నాకు నమ్మకంలేదు నామీద అతనికి విశ్వాసంలేదు. యీ విషయం, లో లోపల యిద్దరికీ తెలుసును. ఒకళ్ళమీద ఒకళ్ళకి అసంతృప్తి. పైకి మాత్రం తెలియనిచ్చేవాళ్ళం గాము. ఏవ్యవహారం శాంతంగా చర్చించుకోవడం మానేశాం. ఒకనాడు నాకు జ్ఞానోదయ

మైంది. అతనికి మడులు, మాన్యాలు ఉన్నాయి. నాకు లేవు. అతనికి తెలివితేటలు పూజ్యం. నాకు ఆలోచనాశక్తి వుంది. అతను అన్నంపెడుతున్నాడు. బసయిచ్చాడు. నేను అతనికి నాసలహాలిస్తున్నాను. నాకు లేనిది అతనిస్తున్నాడు. అతనికి లేనివి నేనిస్తున్నాను. తిండికి మొహంవాచి కూచు, గుడ్డకోసం ఒక నిరక్షరకుక్షి, ఆ జమిందారు వెంట తైనాతీలా తిరిగితే తిరగవచ్చు. కాని నాకిదేంఖర్మ! పైగా నేను చెబుతున్న సలహాలన్నీ, చెవిటివాడిముందు శంఖంవూదినట్లే. పైగా నా కష్టప్రదిష్ట కూడాను. వ్యవహారం చెడితే బాధ్యుణ్ణినేను. నెరవేరితే ఆ గొప్ప అతనిది. అక్కడ వుండడంవల్ల నా కాలమూ హరించిపోతుంది; శక్తీ వృధా అవుతోంది. మళ్లీ నా ఆశలు కూలిపోయాయి. ఒకనాడు దురదృష్టకర సంఘటన జరిగింది. ఒకళ్ళమీద ఒకళ్ళం కేకలువేసుకున్నాం. దెబ్బలాడుకున్నాం. కొట్టుకున్నంతపనీ జరిగింది. నేను అక్కడనుంచి వెళ్ళిపోయాను.'

'మరి వెళ్ళిపోతే?'

'వెళ్ళిపోతే నష్టమేమిటో నాకు తెలుసును. గడవడం కష్టమే. అయితేనేం?'

'ఆ ఆశ్రయంకూడా పోగొట్టుకున్నావన్నమాట.'

'పోగొట్టుకోలేదు. అదే పోయింది. మళ్ళీ జీవితం మామూలే. యిల్లూ వాకిలీ లేదు; తిండీ తిప్పలు లేవు. వీధుల్లో తిరిగాను. ... అబ్బ. లెజ్‌నోవ్! కొంచెం పానీయం యీ గ్లాసులో పోయి'

లెజ్‌నోవ్ గ్లాసులో పానీయం పోస్తూ, నీ ఆరోగ్యం కోసం పానీయం పుచ్చుకుందామన్నాడు. పొకోర్‌స్కి స్మృత్యర్థము మరొక గ్లాసు పానీయం అందించాడు. కుర్చీ లోంచి లేచి ప్రేమాభిమానాలతో రూడిన్ నుదుటను ముద్దు పెట్టుకున్నాడు. 'పాపం! పొకోర్‌స్కి చనిపోయాడు. ధైర్య వంతులుగాని పేదరికాన్ని అనుభవించలేరు. పొకోర్‌స్కి ఎంత ధైర్యవంతుడు! ఎన్ని కష్టాలకు ఓర్చుకున్నాడు!'

రూడిన్ గ్లాసును పెదవులదగ్గర పెట్టుకొని ఒక గుటక వేశాడు. లెజ్‌నోవ్, తరవాత ఏం జరిగిందో చెప్పమన్నట్టు రూడిన్‌వంక చూశాడు. రూడిన్ టేబిల్‌మీద గ్లాసుపెడుతూ తన కథ మళ్ళీ ప్రారంభించాడు.

'మాట్లాడాలనిలేదు లెజ్‌నోవ్! విసుగుపుడుతోంది. ఆయాసం వస్తోంది....చాలాచ్చూళ్లు తిరిగాను. ఇంపీరియల్ ఆఫీసులో సెక్రటరీ ఉద్యోగం వచ్చింది ... అదంతా చెప్తే యీ రాత్రంతా సరిపోదు. యీలోగా ఏవో పనులు చేశాను. చాలా ఉద్యోగాలు చేశాను. ఆఖరికి, నవ్వకు; చెబుతాను. గొప్ప వర్తకుణ్ణౌదామనుకున్నాను. నీకు అతను తెలుసు ననుకుంటాను. 'కుర్బోల్వ్' అని ఒకతను ఉన్నాడు.

'అతన్ని గురించి నేనెప్పుడూ వినలేదే! కాని రూడిన్! ఒక సందేహం. ఏమీ అనుకోనంటే అడుగుతాను.'

'అడుగు. సందేహ మెందుకు?'

'అంత నిశితప్రజ్ఞావంతుడివికదా; కొసకు వ్యాపారం లోకి దిగేదాకా వచ్చావన్నమాట.'

'చేసేవ్యాపారం లేకపోతే వ్యాపారమే చేద్దామనుకున్నాను. కుర్ఖోవ్ నీకు తెలీదన్నమాట. నీకు పరిచయమైతే బాగుండునే. నన్నంతా మహోపన్యాసకు డంటారుగాని, అతనిముందు నే నెంత? మనిషి విపరీతంగా చదువుకున్నాడు. అపారమైనజ్ఞానం. ఒకటి వూహించనూవూహిస్తాడు. చేయనూ చేస్తాడు. వర్తక వాణిజ్యాలలో, పరిశ్రమల నిర్వహణలో చేయితిరిగినవ్యక్తి. వేసేప్రణాళికలా అద్భుతం. మా యిద్దరికీ పరిచయమైంది. యిద్దరం చర్చించుకున్నాం. ప్రజలకిపనికివచ్చే ఘనకార్యం ఒకటి చేద్దామనుకున్నాం.'

'ఏమిటది?'

'చెబితే నవ్వుతావేమో!'

'నవ్వెందుకూ?'

'అయితే చెబుతాను. గుబెర్నియాలో 'కా' అనే పట్టణందగ్గిర నది వుందిగదూ. దానికి ప్రాజెక్టు కడదామనుకున్నాం. ప్రాజెక్టు కడితే పడవలు, ఓడలూ తిరిగితే నది ఎలా వుంటుందో అని వూహించాం.'

'మంచిపనిచేశారు! అయితే ఆ కుర్ఖోవ్ కుబేరుడా ఏమిటి?'

'కుబేరుడూ! వాడెలావుంటాడు? మనవాడిచేతుల్లో రాగిదమ్మిడీలేదు.'

లెజ్నోవ్ పకపకానవ్వి, రూడిన్ చేతులుపట్టుకొని నవ్వాపుకున్నాడు. 'క్షమించు. నవ్వొచ్చింది. అయితే మీ ప్రణాళిక వూహల్లోనే వుండిపోయిందన్నమాట.'

'మా యిద్దరికీ పుట్టినవుత్సాహం, అలా వుండిపోతుందా? వెంటనే పని ప్రారంభించాం. కూలీలను మాట్లాడుకున్నాం. పని పురమాయించాం. అన్నీ అడ్డంకులే. పట్నంలో మిల్లులున్నాయి. ప్రాజెక్టంటే మిల్లుదార్లకి గిట్టలేదు. యంత్ర సామాగ్రి లేకపోతే, ప్రాజెక్టు లేదు. అడిగితే వాళ్ళివ్వరు. కొనుక్కుందామంటే, మాదగ్గర డబ్బులేదు. యిద్దరం ఆర్నెల్లు పూరికొంపల్లో మకాం పెట్టి శతవిధాలా ప్రయత్నించాం. అతను ఒట్టి రొట్టెమాత్రం తిని మంచినీళ్లు పుచ్చుకునేవాడు. నేనిన్ని అరటిపళ్లు తినేవాడిని...యిన్నికష్టాలుపడ్డా, మాకేం దిగులుగా వుండేదికాదు. లెజ్నోవ్! అక్కడి ప్రకృతివుండేదీ, నోటితో వర్ణించలేమనుకో! ఎలాగైనా ప్రాజెక్టుకట్టి పంటలు పండించాలని మాప్రయత్నం. వర్తకులదగ్గరకు పోయాం. అదీ యిదీ చెప్పాం. పొలాలు బాగుపడతాయన్నాం. నీళ్లు పుష్కలంగా దొరుకుతాయన్నాం. దగ్గరున్న వర్తకుల్ని స్వయంగా కలుసుకున్నాం. దూరంగా వున్నవాళ్ళకి ఉత్తరాలురాశాం. ప్రాజెక్టుకోసం నాజేబులోవున్న ఆఖరి రూపాయివరకూ ఖర్చు పెట్టేశాను.'

రూడిన్ కిటికీలోంచి బయటకు తొంగిచూశాడు.

'ఆ ప్రాజెక్టే కడితేనా? ఎంత నీరు! ఎంత పంట! అన్నోదశాలకి లోటుండేదికాదు.'

'చివరి కతను ఏమయ్యాడు?'

'ఇప్పుడు సైబీరియాలో వున్నాడు...అక్కడ బంగారపు గనులున్నాయట. తవ్వకొస్తానన్నాడు...నీ ఉద్దేశం అతను

ఉత్తిచేతుల్తో వస్తాడనా? అతను పట్టింది బంగారమేలే. మన్ను ముట్టుకుంటే బంగారమౌతుంది.'

'నువ్వుమాత్రం బంగారం ముట్టుకుంటే మన్నౌతుంది.'

'నే ముట్టుకుంటేనా?... నే నెందుకూ పనికిరానివాణ్ణనా నీ వుద్దేశం?'

'ఎవరనగల రామాట? ఒకప్పుడు నీలోవున్న బల హీనతనే చూసేవాణ్ణి. నమ్ము; నామాట. నీశక్తిసామర్థ్యాలు ఎటువంటివో యిపుడు తెలుసుకున్నాను. బంగారాలూ, నగలు, నాణాలు గడించడం నీ ఆశయం కాదు...అందుకే నువ్వంటే నాకు గౌరవం, ప్రేమ.'

'నిజంగానా?'

'అందుకే నువ్వంటే నాకు గౌరవం.'

యిద్దరూ కొంతసేపు మౌనంగా కూచున్నారు.

'నేను చేసిన మూడో సాహసకృత్యం చెప్పమంటావా?'

'చెబితే సంతోషించేవాళ్ళల్లో నేను మొదటివాణ్ణి.'

'అయితే సరే. యిది మూడోదీ, ఆఖరిదీ. యీమధ్యనే యిది తటస్థించింది.'

'చెప్పు, చెప్పు; విందాం.'

'నీకు తెలుసుకదా. ఒకొక్కప్పుడు నాకు తీరిగా వున్నపుడు ... ఒకొక్కప్పుడేంలే, ఎప్పుడూ నాకు తీరికే. ఒక అభిప్రాయం తటాలున తట్టింది. నేను చదుకున్నవాణ్ణి కదా! పదిమందికీ పనికొచ్చేపని చేద్దామని నాకుతూహాలం.'

'కుతూహాల మేమిటి? ఆశయం!'

'ఆ ఆశయంతో నే అనేక కార్యాలు తలపెట్టాను. తల

పెట్టిన వేపీ కొనసాగలేదు... యిప్పుడు నే నెందుకు ఉపాధ్యాయుడుగా పిల్లలకి జ్ఞానబోధ చేయకూడ దనుకున్నాను. అనవసరంగా జీవితం వృధాచేసేకంటె జీవితంలో నేనార్జించిన జ్ఞానాన్ని యితరుల కెందుకు బోధించగూడదు? యిదివరకే యీ పనిచేసివుంటే కొంతమేలు చేకూరేదికదా. మామూలు మనిషికంటె, నాకు అంతో యింతో జ్ఞానంవుంది. శక్తి సామర్థ్యాలున్నాయి. ధారాళంగా మాట్లాడే నేర్పువుంది.... యిలా ఆలోచించుకొని ఉద్యోగానికి దరఖాస్తు పెట్టాను. చిన్నస్కూళ్ళల్లో, బొత్తిగా చిన్నపిల్లలకి చెప్పేదేమీఉండదు. కాని అక్కడే నాకు ఉద్యోగమిస్తానన్నారు. వద్దన్నాను. ప్రయివేట్లు చెప్పుకుందామంటే—యింతబతుకూ బతికి, యింటి వెనకాల చచ్చినట్లనిపించింది. ఎలాగైతేనేం, యీవూళ్ళో నే కళాశాలలో ఉద్యోగమైంది.'

'ఏంపాఠాలు చెప్పేవాడివి?'

'రష్యన్‌సాహిత్యంగురించి బోధించేవాణ్ణి. యిదివరకు ఏపనీ యింతశ్రద్ధగా చేయలేదు రాత్రింబవళ్లు పుస్తకాలు తిరగేసేవాణ్ణి. యువకుల మనస్సులను సాహిత్యవిషయాల వైపు మళ్ళిస్తున్నానుగదా అని ఉప్పొంగిపోయేవాణ్ణి. వాళ్లని ఏదారిలోపెడితే బాగుపడతారాఅని, ఆలోచించేవాణ్ణి. మొదటి రోజు క్లాసుకు వెళ్ళాను. వెళ్ళేముందు మూడువారాలు ఆలోచించి, ఆలోచించి చెప్పేలెక్చరు వ్రాసుకున్నాను,'

'ఆకాపీ యిప్పుడు నీదగ్గర వుందా?'

'లేదయ్యా. ఎక్కడో అన్యాయంగా పోయింది. చాలా బాగా వచ్చింది. అనుకోనట్టుగా వచ్చింది. క్లాసులో, వేదిక

ఎక్కి కుర్చీలో కూచున్నాను. నేను రాగానే కుర్రాళ్లు లేచి నిలబడ్డారు. కూర్చోమన్నాను. లెక్చర్ ప్రారంభించాను. చెప్పవలసింది ఒకగంట. కాని నా లెక్చరు గంటసేపుపట్టలేదు. కొత్తగదూ. గడగడా, రాసింది చదివేశానేమో యిరవై నిమిషాలసేపే వచ్చింది. యిన్స్పెక్టరు, నేను చెబుతున్నపుడు అక్కడేవున్నాడు. క్లాసు అయిపోయింది. గంట కొట్టారు. గంట కొట్టగానే, యింతసేపూ నా లెక్చరువిన్న ఇనస్పెక్టరు దగ్గరకువచ్చి యిలా అన్నాడు.—'బాగుంది. లెక్చరు బాగుంది. కాని పదాడంబరం జాస్తి. అంతంతలేసిమాటల్ని కుర్రాళ్ళు అర్థంచేసుకోలేకపోవచ్చు. లెక్చర్‌లో స్పష్టత లేదు. అసలు విషయం కొంచెమే చెప్పావు.' కాని లెజ్‌నోవ్! విద్యార్థులు మాత్రం, నా లెక్చరెంతోజాగ్రత్తగా విన్నారు. చెవులప్పగించి విన్నారు. వాళ్ళ మొహాల్ని చూశానుగదా, ఎంతఆసక్తి, ఎంత గౌరవం, ఎంత ఆశ్చర్యం! రెండోసారి క్లాసుకు వెళ్ళినపుడు, ఉపన్యాసం తయారుచేసుకునే వెళ్ళాను. మూడోసారి అలవాటైపోయింది. యిక ముందేమీ రాసుకోకుండానే క్లాసులోనే ఉపన్యసించేవాణ్ణి.'

'ఆ ఉపన్యాసాలు ఎలావున్నాయి?'

'అందరూ బాగున్నాయన్నారు. హృదయంలో కలిగిన ప్రతి భావాన్ని, విపులంగా చెప్పేవాణ్ణి. కుర్రవాళ్లు శ్రద్ధగా వినేవాళ్లు. అందులోనూ ముగ్గురు, నలుగురుకుర్రాళ్లు మెరికల్లావుండేవాళ్లు. వాళ్ళ మేధస్సు పాదరసంలా పరుగెత్తేది. నాకేసి ఆశ్చర్యంగా చూసేవాళ్లు. మిగతావాళ్ళకి నా ఉపన్యాసం అర్థమయ్యేదికాదు. నిజంచెప్పాలిగదా. నాఉపన్యాసం

అర్థమైనవాళ్ళుకూడా, అప్పుడప్పుడు, సందేహాలతో ప్రశ్నలు వేసి కంగారుపెట్టేవాళ్ళు. కాని అది నాకేమీ చికాకనిపించ లేదు. విద్యార్థులకు నే నంటే అమితమైన ప్రేమ. పరీక్షల్లో అందరికి పూర్తిగా మార్కులు వేసేవాణ్ణి. యిలావుండగా నాకూ కొందరికీ జగడంవచ్చింది. జగడం కాదనుకో. నేను కొంచెం దారితప్పాను. నన్ను చూస్తే వాళ్ళకి విభ్రాంతి. నే నందరికీ విభ్రాంతి కలిగిస్తాను. కాలేజీ కుర్రాళ్ళకి అంతంత లేసిమాటల్లో తాత్వికవిషయాలు చెప్పడం అనవసరంగదా? విశ్వవిద్యాలయాల్లోకూడా ప్రొఫెసర్లు అలా ఉపన్యసించరు. నేను విశ్వవిద్యాలయాల్లోని ప్రొఫెసర్లను మించి కాలేజీ విద్యార్థులకు పాఠాలు బోధిస్తున్నాను. అదీ నా లోపం. నేను చెప్పేవిషయాలు వాళ్ళకి బోధపడవేమో ననే అనుమానం నాకు కలగలేదు. నీకు తెలుసుకదా; నేను ఉన్నదాంతో తృప్తిపడనని. ఏదోకావాలని కోరుకుంటాను. అది నాలోపం. కాలేజీల్లో, విద్యావిధానంలో, పాఠాలుచెప్పే తీరులో, ఏ ఏ సంస్కరణలు అవసరమో ఆలోచించుకున్నాను. ఆ సంస్కరణలు యిట్టే ఆచరించవచ్చును. ఎంతోసులభం. అయితే ఎలా అమల్లోపెట్టించాలి? ప్రిన్సిపాల్ కి నే నంటే గౌరవం. అతను మంచివాడు. తగు మనిషి. నేనుచెప్పింది వినకపోడు. ఆయన భార్య నాకు తోడ్పడింది. ఆవిడలాంటి మనిషిని నాజీవితంలో ఎక్కడా చూళ్ళేదు. ముప్పైఏళ్ళున్నా, పదిహేనేళ్ళ పిల్లలా మంచిహుషారిగా వుండేది. ఒక మంచిపని తలపెడితే, తానే ముందుకొచ్చేది. తాను నిజమని నమ్మినదాన్ని ఆచరించాలని ఆవిడ తహతహ. తన అభిప్రాయాల్ని నిష్కర్షగా,

ఎక్కడైనాసరే, ఎవరిముందైనాసరే, జంకూగొంకూ లేకుండా చెప్పేది. ఆవిణ్ణి మర్చిపోమన్నా మర్చిపోలేను. ఆవిడకి నా సంస్కరణాభిలాషను తెలియజేశాను. ఆవిడ సలహాపైన ఒకపథకం తయారుచేశాను...యింకేముంది? నాశత్రువులు, ఆవిడకు నాకూ విరోధంపెట్టారు. నామీద ఆవిడకు చాడీలు చెప్పారు. మా కాలేజీలో లెక్కలమాష్టరు ఒకాయన ఉన్నాడు. అతను అచ్చం పిగసోవే. పిగసోవ్‌కు తెలివితేటలు లేవు. యితనికి ఉన్నాయి. కనుకనే నా కపకారం చేయ గలిగాడు...అన్నట్టు అడగడం మర్చిపోయాను. పిగసోవ్ ఎలా వున్నాడు? బతికే వున్నాడా?'

'బతికే ఉన్నాడుగాని, చచ్చినట్టు పడివున్నాడు. ఆమధ్యన ఒక బస్తీపిల్లను పెళ్లిచేసుకున్నాడు. ఆవిడ అతన్ని కొడుతుందని ఊళ్లో పుకారు.'

'పోనీ యిప్పటికైనా బుద్ధొస్తుందిలే ... నటాలియా ఎలావుంది? ఆరోగ్యంగా వుందా?'

'ఆరోగ్యంగానే వుంది.'

'ఎప్పట్లా కులాసాగా వుందా?'

'వుంది.'

రూడిన్, పరధ్యానంగా గోడమీదపడుతున్న తన క్రీనీడనుచూస్తూ వూరుకున్నాడు.

కొంతసేపు అయాక మెలకువ తెచ్చుకొని 'ఆఁ, ఎంత వరకు వచ్చాను? లెక్కల మాష్టరు సంగతి కామా చెప్తు న్నాను?'

'అవును. అత నేం జేశాడు?'

'అతనికి నేనంటే ద్వేషం. పాముపగ. స్పష్టంగా అర్థం కాని చిన్నపదం, వాక్యం నా ఉపన్యాసంలో దొర్లిందా దాన్ని గోరంతలు కొండంతలుచేసి వూరంతా ప్రచారం చేసే వాడు. నా ఉపన్యాసంలోని శబ్దాలు బాణసంచా కాల్చి నట్టుండేదట. పేల్చిన టపాకాయలట. చిటపటలాడే కప్పగంతులట. నేనోసారి క్లాసులో ఒకపాఠం చెప్పాను. చెప్తూ, పదహారవ శతాబ్దపు ఒక పురాణంనుంచి ఉదాహరణలు యిచ్చాను. అందులో చిన్న పొరపాటు దొర్లింది. దా న్నతను పరిశోధించి కనుక్కున్నాడు. బుద్ధి పూర్వకంగానే పిల్లలకు నేను తప్పులు చెప్తున్నానట. నా ఉపన్యాసాలన్నీ తప్పులతడకలని పనిగట్టుకొని యింటింటికి పోయి ప్రచారం చేసేవాడు. యినస్పెక్టరు నేనంటే మొదటి నుంచీ సుముఖంగాలేడు. ప్రిన్సిపాల్ని నాకు వ్యతిరేకంగా కూడగట్టుకున్నాడు. లెక్కలమాస్టరు, యినస్పెక్టరు ఒక టయ్యారు. గూడుపుఠాణీచేశారు. మాకు తగు వొచ్చింది. నన్ను లొంగిపొమ్మన్నారు. నేను లొంగనన్నాను. చిక్కులు పెట్టారు. నాకు కోపం వచ్చింది. వ్యవహారం పూర్తిగా బెడిసింది కాలేజీ కమిటీకి, మా జట్టీలు తెలిశాయి. నేను రాజీనామాచేయక తప్పిందిగాదు. చేయడం నాకిష్టంలేదు. అంత అన్యాయంగా, నిర్దాక్షిణ్యంగా వెళ్లగొట్టడానికి నే।నెవరనుకున్నారు? అక్కడేవుండి ఆ అన్యాయమేమిటో, దానిఅంతూ పొంతూ తేల్చుకోవాలనుకున్నాను…కాని ఏం చేయను లెజ్నోవ్! రాజీనామాచేయక తప్పిందికాదు…యిప్పు డిక గత్యంతరంలేదు. యీ పట్టణంలో తలెత్తుకుని ఎలాతిరగను చెప్పు

లెజ్‌నోవ్ మాట్లాడలేదు. తలవంచుకొని కూచున్నాడు. రూడిన్ మాట్లాడాలని ప్రయత్నించి, కంఠం బొంగురుపోగా, మౌనంగా తలవంచుకున్నాడు. క్షణకాలం నిశ్శబ్దం. రూడిన్ లెజ్‌నోవ్ వంక తిరిగి, 'నా కిప్పుడు, మహాకవి 'కోల్త్సోవ్' వాక్యం జ్ఞాపకమొస్తోంది. ఆయనన్నాడుకదా 'యౌవనమా! కలలతో ఊరించావు. ఆశలతో భ్రమపెట్టావు. నువ్వు పూరించిన కలలు, పెట్టిన ఆశలు యిప్పుడు నన్ను భయపెడుతున్నాయి. భయాలమధ్య దిగుళ్ళమధ్య నన్ను దింపి, నువ్వు నిష్క్రమించావు. దారులన్నీ మూసివేసి దశదిశలూ ముంచెత్తి, నన్ను బంధించావు' అయితే లెజ్‌నోవ్! యీ లోకంలో నే నెందుకూ పనికిరానా? యీ భూమిమీద నే నెందుకు పుట్టేను? యీ చేతుల్తో ఒక్క కార్యం నెరవేర్చడానికికూడా నేను పెట్టిపుట్టలేదా? యీ ప్రశ్నలు నన్ను బాధిస్తున్నాయి. వేధిస్తున్నాయి. నన్ను నేనే ప్రశ్నించుకున్నాను. లోనున్న శక్తినంతా అణుచుకొని అణగిమణగి యీ లోకంలో పడివుండాలనుకున్నాను. కాని నాలో తెలియని, యితరులకులేని శక్తి ఏదో నన్నావహిస్తోంది. ఆవహించి, నన్నాదేశించింది. ఎవరికీలేని ఒక ప్రత్యేకత, ఒక సుగుణం, సామర్థ్యం నీకు ఉన్నప్పుడు, నువ్వెందుకు, ఎందుకూ పనికిరానట్టు పడివుండాలి? నీ శక్తి సామర్థ్యమంతా, మేధస్సంతా వృథా కావలసిందేనా? యింకొకటి జ్ఞాపకముంచుకో లెజ్‌నోవ్! మనిద్దరం చదువుకుంటున్న రోజుల్లో, నేను భేషజంగా తిరిగేవాణ్ణి. అన్నీ తెలిసున్నట్టు ప్రవర్తించేవాణ్ణి. లోకంలో నాకేమిటి కావాలో, అప్పుడు తెలుసుకోలేక

పోయాను. ఆనాడు నాకా చైతన్యం లేకపోయింది. మాట్లాడుతూ, ఎంత బాగా మాట్లాడేనో అని ఉబ్బిపోయేవాణ్ణి. అంతటితోనే సంతృప్తిపడేవాణ్ణి. మనుష్యులను వదలి, వారి క్రీనీడలను పట్టుకొని, వ్రేలాడేవాణ్ని. కాని యిప్పుడు, నాకేం కావాలో తెలుసును. నా వాంఛలు స్పష్టంగా ఒక రూపం దాల్చేయి. దాచుకునేందుకు యివేవీ రహస్యాలుకాదు. నాకు రహస్యాలులేవు. ఒక ప్రయోజనాన్నర్థించి, దాన్ని సాధించడానికి అనేక బాటలను వెతుక్కుంటున్నాను. నాకొక ఆశయం, ఆదర్శం, జీవితలక్ష్యం ఉంది. యిప్పుడు నన్ను నేనే శాంతపర్చుకొని, ఒదిగివుండాలనుకుంటున్నాను. పరిస్థితులనుబట్టి మనిషి ప్రవర్తించాలి. ఏ పరిస్థితులొచ్చినా, వాటిలోనే యిమిడిపోవాలనుకుంటున్నాను. జీవితంలో, నేను కోరుతున్నది స్వల్పాతిస్వల్పం. నా ధ్యేయం ఆట్టే దూరంలో లేదు. చేరువలోనే వుంది. లోకంలో ఏదోఒక, పనికివచ్చే కార్యం అదెంత స్వల్పమైనదైనా నిర్వర్తించాలని నా ఆఖరి కల....యిదీ చేయలేను గాబోలు. ఎందుకు చేయలేనూ? యితరులవలె పనిచేసుకుంటూ, ఎందుకు నా పొట్ట నేను పోషించుకోలేను? యిలా అనుకుంటూనే, కష్టపడి ఒక ఉద్యోగమో సద్యోగమో సంపాదించాననుకో. యిక జీవితంలో స్థిరపడతా ననగా, భయంలేదు అనుకుంటూవుంటే, వెంటనే భయం నన్ను వెంటాడుతుంది. అదృష్టం ఎదురుతిరుగుతుంది. దానితో ఆ స్థిరత్వానికి స్వస్తి. కాలమంతా యిలాగే గడిచింది. అదేమి కర్మో మరి ... ఎందుచేతంటావు? లోపమెక్కడుందంటావు?'

'ఇది పెద్ద సమస్యే. నువ్వే నాకో సమస్య. నీ చిన్నప్పుడుకూడా, యిలాగే చేసేవాడివి. మొదట, నువ్వు చేసిన పని బాగానే వుండేది. నీ దక్షతకు, నా హృదయం ఉప్పొంగిపోయేది. కాని చివర్న మాత్రం నువు ప్రారంభించినపనే నీ చేతుల్తోనే పాడుచేసేవాడివి....నీ కర్థమైందనుకుంటాను. అప్పుడు అలా ఎందుకు చేసేవాడివో, నా కర్థమయ్యేదికాదు. నువు విచిత్రంగా కనిపించేవాడివి. భయంకూడా వేసేది. నువ్వు వస్తే, ఎందుకో భయం. నీకు దూరదూరంగా ఉండాలనుకునే వాణ్ణి. నీకున్నశక్తి ఎవరికీలేదు. ఒకపని చేద్దామనుకుంటావు. యిలా చేద్దామని వూహించుకుంటావు. పట్టుదల వహిస్తావు. నీ ఊహాలు, పట్టుదల అద్భుతం.'

'మాటలు! కేవలంమాటలు; జీవితమంతా మాటలతోనే గడిపేను. జీవితంలో అవే మిగిలేయి. క్రియశూన్యం. నే నేమిటి సాధించానో చెప్పు!"

'ఏమిటి సాధించావా! సాధించటానికి యింతకంటె ఏముటుంది? ఒక మంచిమాట చెప్పటంకూడా, మంచిపని చేయడంవంటిదే.'

రూడిన్ లెజ్‌నోవ్ వంకచూస్తూ మెల్లగా తలవూపేడు. లెజ్‌నోవ్ మొహానికి చేతులు అడ్డంపెట్టుకొని అతికష్టంమీద 'యిప్పుడిక మీ వూరు వెళ్ళిపోతావా?'

'వెళదామనుకుంటున్నాను.'

'అక్కడేముంది వెళ్ళడానికి?'

'చనిపోతే ఒకబారెడు జాగా వుంది'

లెజ్‌నోవ్ విచారంగా నవ్వేడు.

'ఇలా మాటాడుతున్నానని ఏమీ అనుకోకు. నా మాటలు నీ కాశ్చర్యంగానే వుంటాయి. ఆ మాటలే నా వినాశనానికి కారణం. ఏం చేయమంటావు? అది నాకో వ్యసనమైపోయింది. యిప్పుడు నేను చెప్పింది ఉట్టిమాటలు కాదు....ఇంకొంతకాలానికి నా జుత్తు పూర్తిగా తెల్లబడుతుంది, ఈ బుగ్గలు యింకా లోతుకుపోతాయి. ... నువ్వు నన్నెప్పుడూ నిష్కర్షగానే, నిర్మొహమాటంగానే సంభావించేవాడివి. కాని న్యాయంగానే చూసేవాడివి. అంతా అయిపోయింది. చేతులుకాలేక ఆకులుపట్టుకొని ప్రయోజనమేమిటి? దీపంలో చమురులేదు. ఒత్తి కొడిగడుతోంది. ... మృత్యువే అన్నింటినీ పరిష్కరిస్తుంది.'

'రూడిన్, ఏమిటంటున్నావు? మృత్యువా! నా మీద నీకెందుకు కినుక? ఆ మాటకి నేను తగుదునా? నీశక్తిని కొలవడానికి నే నేపాటివాణ్ణి. జీవితంలో భాగ్య భోగాలు కావలసివస్తే, వాటిని సాధించే సామర్థ్యం నీకు తప్ప యింకెవరి కుంది? నీ కేది కావాలనుకుంటే, అది చేయగలవు. శక్తివుంది. నాకా సంగతి తెలుసు. కాని యీ సిరిసంపదలతో నువ్వు ప్రమేయం పెట్టుకోలేదు. భోగాలనన్నిటినీ త్యజించావు. సుఖాలను పరిత్యజించావు. ఏ మానవుడు, ధనరాసులను తృణప్రాయంగా త్రోసిపుచ్చి, ఆదర్శాలకోసం పరుగులు పెట్టేడో, ఆ మానవుడు ఆకలితో అలమటించడంలో వింతేముంది.'

'నే నంటే నీకు జాలిగా వుందికదూ!'

'నీ మీద జాలికొద్దీ నే నీ మాటలు అనడంలేదు. నువ్వంటే నాకు గౌరవం. నీ కే సంపదలు కావాలనుకుంటే,

ఆ జమీందారుతో నే సరిపెట్టుకో నేవాడివి. అతన్ని యిచ్చకం చేసి, యింత ఆర్జించుకో నేవాడివి. కాలేజీలోంచి వెళ్ళిపోయే వంటే, ఎందుకు వెళ్ళిపోయేవో, నే నూహించుకోలేనూ! నీ వ్యక్తి లాభాన్ని, సుఖాన్ని త్యజించావు. రూడిన్! ఒక్క మాట. లోకంలో రెండురకాల మొక్క లున్నాయి. కొన్నింటిని అంటు తొక్కొచ్చు. కొన్ని అంటుతొక్కితే బతకవు. నువ్వు మహావృక్షానివి రూడిన్!'

'కాదు లెజ్‌నోవ్; మజిలీలుచేస్తూ, ఎక్కడికి వెడుతున్నానో తెలియక గమ్యంలేని బాటసారిని. అదీ కాదు. ఒట్టి డొల్లుపుచ్చకాయిని.'

'దీని కర్థం, నువ్వు ఒకచోట యిమడలేవనే అయితే నే నంగీకరిస్తాను. కాని యిందాక నీలో ఏదో పురుగు ప్రవేశించి, నిన్ను తొలుస్తోందన్నావు. కాని నువ్వనుకుంటోంది న్యాయంకాదు. సత్యంకోసం అన్వేషించాలనే తీవ్రకాంక్ష నీలోవుంది. నీలో అస్థిత్వం వుంటే వుండవచ్చు. నీ సత్యాన్వేషణ నిరతి ఎనలేనిది. ఈ కాంక్ష యింకొకరిలో నే నింతవరకు చూడలేను. జిజ్ఞాస, పరిశోధన, లక్ష్యం యివి నీ సహజగుణాలు. నాకు ఒకప్పుడు కొంతకాకపోతే కొంత యీగుణాలుండేవి. నేనేనువ్వైతే ఆనాడే యీసద్గుణాలన్నిటికి పూర్తిగా స్వస్తిచెప్పి, కూచుని ఎలాగోలాగ కాలం గడిపేవాణ్ణి. కాని నువ్వలాకావు. వయసులో నేను నీ కంటే యువకుణ్ణి కావచ్చు. కాని నే నేనాడో ముసలివాణ్ణయిపోయాను. నువ్వు నిత్యయౌవ్వనుడివి. నీ బుద్ధికి వృద్ధాప్యంలేదు. ఏదైనా ఒక నూత్న

వస్తువు గోచరించింది; యువకుడికంటే యింకా ఉత్సాహంగా నువ్వు ముందుకు పురోగమిస్తావు.'

'లేదు లెజ్‌నోవ్. నా కా శక్తి లేదు. ఆ శక్తంతా యిప్పుడు ఉడిగిపోయింది.'

'ఉడిగిపోయింది! ఆ మాట నీ దరిదాపులకేరాదు... మృత్యువు అన్ని సమస్యలను పరిష్కరిస్తుందన్నావు? మృత్యువు కూడా జీవితసత్యమేకదూ, రూడిన్! ఎవరైతే, తోటిజనుల పట్ల సహనాన్ని కోల్పుతారో, వారు క్షమాభిక్షకు అనర్హులు. యితరుల క్షమాభిక్షపై ఆధారపడని మానవుడు యీ లోకములోవుండడు. నువ్వు ఎంతచేయగలవో, అంతటిని జీవితంలో సాధించావు. ఎంతవరకు పోరాడగలవో, అంతవరకూ పోరాడేవు...అంతకన్నా నువ్వింకేం చేయాలి?'

'నువ్వోక వింతమనిషి వైపోయావు. లోకంలో తప్ప బుట్టేవు.'

'మనిద్దరి దారులు జీవితంలో చెరొకవైపుకు మళ్లాయి. నాను, అదృష్టమనూ, యింకేమన్నా అను; కాలం కలిసొచ్చింది. అంతోయింతో వుంది. అది తింటూ కూచున్నాను. జీవితంలో నే నేం పాల్గొన్నాను? నాటకం వేస్తుంటే, కుర్చీలో కూచొని ఆనందించే ప్రేక్షకుడిని నేను. ఆ నాటకంలో పాత్రధారివి నువ్వు. జీవిత నిత్యసంఘర్షణ నీ ఊపిరి. యుద్ధరంగంలో సైనికుడివి. మనిద్దరం ఒకటే రూడిన్. దారులు వేరైతేనేం? రెండుదారులూ దూరంగాలేవు. సన్నిహితంగా వున్నాయి. మన హృదయాలోని భాష మనకి తెలుసును. నా మూగమూపుల్ని నువ్వర్థం చేసుకుంటావు. నీ అలసిన

కళ్లను నే నవగతం చేసుకుంటాను. మనిద్దరి ఆదర్శాలు ఒకటే. అలాగే గడిపేవాళ్లం. అలాగే చదువుకునేవాళ్ళం. మనతో చదువుకున్న వాళ్లల్లో—పాపం! చాలామంది చని పోయారు. బహుశ మనిద్దరమే మిగిలేమేమో! అప్పుడు మనం వాదించుకుంటే, దెబ్బలాడుకుంటే ఎంత బాగుండేది! జీవితం మనచుట్టూ పరచుకొని ఉండేది. యిప్పుడు మనతరం వెళ్ళిపోతోంది. నూతన తరం వస్తోంది. మన పక్కనుంచే ఆ తరం వెడుతోంది. ఏవో ఆదర్శాలకోసం, యీ తరం ముందుకు పురోగమిస్తుంది. మనిద్దరం చేతులు పట్టుకొని ఆప్యాయంగా వుందాం. ... రూడిన్, యింకొక్క గ్లాసు. ఈ ఒక్కగుక్క పానీయం పుచ్చుకో. ఏదీ, మనం ఆ రోజుల్లో పాడుకునే యువగీతం పాడుకుందాం.'

స్నేహితులిద్దరూ గ్లాసులలో పానీయం నింపుకున్నారు. గ్లాసులను స్పర్శింపజేస్తూ నిట్టూర్పు విడిచారు. సంతోషంతో యువగీతం జ్ఞప్తికి తెచ్చుకున్నారు. గొంతులుకలిపి పాడేరు. గీతం ముగిసేక, లెజ్‌నోవ్, 'నువ్వు మీ వూరు వెడుతున్నావు కదూ?'

'వెడుతున్నాను'

'అక్కడ నీ కేం తోస్తుంది? ఆట్టేకాలం ఉండలే నను కుంటాను...'

'ఎందుకుండ లేను?'

'అక్కడ 'నా' అన్నవాళ్ళెవరున్నారు? ... కాలూ చెయ్యీ వంగితే....'

రూడిన్ ఏమీ మాట్లాడలేదు.

'రూడిన్ ! ఒక్క ప్రార్థన. మరోలా అనుకోకు. నీకు ఏ ఆపదవచ్చినా, నే నింకా జీవించేవున్నానని జ్ఞాపకంపెట్టుకో. నీకూ ఓ యిల్లుందనుకో. నీకూ ఒకతమ్ము డున్నాడనుకో.'

'సంతోషం లెజ్‌నోవ్ ! ఆ మాటే పదివేలు. నీమేలు మర్చిపోను. కాని నే నందుకు తగను'

'నువ్వు ఒకవ్యక్తివి కావు రూడిన్ ! నువ్వొకఆలోచనవి. ఒక భావానివి. ఆలోచనకికూడా భావానికికూడా విశ్రాంతి కావాలికదూ?'

'నా జీవితమంతా వృథా. ఎన్ని ఆలోచనలుంటే ఏమి ప్రయోజనం? భావనాజగత్తుకు. నా ఆలోచనలతో నే నేమి సంపన్నవంతం చేశాను?'

'దిగులుపడకు రూడిన్! ప్రకృతి మనిషికి కొంత శక్తినే యిస్తుంది. అంతశక్తిని యివ్వదు. అంతశక్తీ అతనిదగ్గరలేదని మనం దిగులుపడక్కర్లేదు. ఎంతశక్తివుందో అంతవరకే మనం ఆశించాలి.'

'నాశక్తి సంచారంతోనే, యాత్రలతోనే హరించుకు పోయింది. యిలా తిరిగి నే నేం సాధించినట్టు?'

'నీసంచారం వృథాకాదు. అలా సంచారంచేస్తూనే జీవితంలో పురుషార్థాన్ని నువ్వు సాధిస్తావేమో! అలా మజిలీలు చేస్తూనే, దివ్యసందేశాన్ని లోకానికి అందిస్తావేమో! మానవసేవచేసి తరిస్తావేమో!...యింతకీ రూడిన్, మన మంతా దేవుడిచేతిలో కీలుబొమ్మలం కదూ?'

రూడిన్ ఏమీ మాట్లాడలేదు. నిశ్చలంగా చూస్తూ

కూచున్నాడు. రూడిన్ కుర్చీలోంచిలేస్తూ బల్లమీది తన టోపీని, చేతపుచ్చుకున్నాడు.

'ఇప్పుడే వెళ్ళిపోతావా? ఈరాత్రి యిక్కడవుండవా?'

'వెళ్ళిపోతాను లెజ్‌నోవ్. కృతజ్ఞుణ్ణి.'

'అంతత్వరగా వెళ్ళిపోవడమే?'

'వెళ్ళిపోవాలి.'

'జీవితంలో నీ తమ్ముడొకడు ఉన్నాడనిమాత్రం మర్చిపోకు. నాయిల్లు నీయిల్లు.'

స్నేహితులిద్దరూ ఒకర్నొకరు కౌగలించుకున్నారు. రూడిన్ గదిలోనుంచి వెళ్ళిపోయాడు. గదంతా చిన్నబోయింది. లెజ్‌నోవ్ కుర్చీలో కుప్పగాకూలబడ్డాడు. దీర్ఘంగా నిట్టూర్చాడు. కుర్చీలోంచి లేచి నుంచున్నాడు శూన్యంగా చూస్తూ అటూ యిటూ తిరిగాడు. 'పాపం! రూడిన్' అనుకుంటూ మళ్ళీ కూచున్నాడు. కాగితం కలం తీసి భార్యకు ఉత్తరం రాస్తున్నాడు.

గది బయట చీకటి జీబూతంలావుంది. గాలి హోరున వీస్తోంది. దుఃఖిస్తున్నట్లు గాలిరొద వినిపిస్తోంది. కిటికీలు దబదబా చప్పుడౌతున్నాయి. రోడ్డుమీద చెట్టుకొమ్మ ఫెళ్ళునవిరిగి క్రిందపడింది. హోరున గాలివీస్తున్న, దుమ్ము రేగుతున్న యిలాంటి రాత్రులలో, హాయిగా యింటిపట్టున కూర్చున్న మానవులు అదృష్టవంతులు. యిల్లూ, వాకిలీ లేక యీ గాలిలో, చీకటిలో, దుమ్ములో వీధులవెంట తిరుగుతున్న బికారులు... వాళ్ళని ఆ భగవంతుడే రక్షించాలి!

♦ ♦ ♦

కొన్నాళ్లుగడిచేయి. పద్దెనిమిదివందల నలభై ఎనిమిదవ సంవత్సరం ... నెలలు గడుస్తున్నాయి; జూన్ నెల రోజులు వొర్లిపోతున్నాయి. ... యిరవై ఆరో తేదీ...సాయంత్రం అవుతోంది. గాలి స్తంభించింది. ఉక్కబోస్తోంది. పారిస్ నగరంలో, అగ్నివలె ప్రజ్వరిల్లిన మహావిప్లవం క్రమక్రమంగా సన్నగిలుతోంది. ప్రభుత్వ సైనికులు ఆయుధాలతో ప్రజలమీద విరుచుకుపడుతున్నారు. నగర వీధులలో స్వైరవిహారం చేస్తున్నారు. విప్లవయోధులు అప్రతిహతంగా ప్రభుత్వ సైనికులను ప్రతిఘటిస్తున్నారు. యస్. ఆంటోనీ ఫాబర్గ్ లోని ఒక చిన్నవీధి. వీధిముందర రక్షణశ్రేణిని నిర్మించుకొని, విప్లవవీరులు వీధి ప్రతి అంగుళాన్ని కాపాడుకుంటున్నారు.... ప్రభుత్వసైనికుల బూట్ల చప్పుడుతో, అవతలవీధి ప్రతిధ్వనిస్తోంది. బూట్ల చప్పుడు దగ్గిరపడింది. సైనికులు తుపాకులను గురిపెట్టారు. యుద్ధం హోరాహోరీ సాగుతోంది. యిళ్ళమీద మంటలు లేచాయి. పొగ కమ్ముకువస్తోంది. రక్షణశ్రేణిని ప్రభుత్వసైనికులు ఛేదించారు. విప్లవసైనికుల వ్యూహం చెదిరిపోయింది. ఒక్కరొక్కరే, తుపాకి గుళ్ళను తప్పించుకొంటూ పరిగెడుతున్నారు. రక్షణదుర్గంచెంత యుద్ధవాహక మొకటి తలక్రిందులుగా పడిపోయింది. రక్షణదుర్గంమీద హఠాత్తుగా, నల్లని పొగలమధ్య ఒక మెరుపు మెరిసినట్లు, ఒక వ్యక్తి వచ్చి నిలబడ్డాడు. ఆ వ్యక్తి గంభీరంగా, తీక్షణంగా, గురిపెడుతున్నట్లు చూస్తున్నాడు. ఆజానబాహువు. వేసుకొన్నకోటు చినిగిపోయి [illegible] పేలికలా వేలాడుతోంది. ఎర్రని గుడ్డకట్టుకొని న[illegible]న్నాడు

రేగిపోయినజుత్తు గడ్డిటోపీలోంచి తొంగిచూస్తోంది. ఒక చేత్తో ఎర్రజండా, మరొకచేత్తో పెద్దఖడ్గం పట్టుకొని నుంచున్నాడు. జండా ఎగురుతోంది. కత్తి సూర్యకాంతిపడి మెరుస్తోంది. కత్తిని వూపుతూ, జెండాను ఎగురవేస్తూ తన గొంతునెత్తి, ఏదో అంటున్నాడు. ప్రభుత్వ సైనికులు రక్షణ దుర్గం అవతల పొంచివున్నారు. జండాను చూసి ఒకసైనికుడు ఆ మనిషికి గురిపెట్టాడు. తుపాకిపేలింది. గుండు దూసుకుపోయింది...ఆ ఆజానుబాహువు చేతులలోంచి జండాను, కత్తిని జారవిడుస్తూ రక్షణదుర్గంమీదనుంచి ఒరిగిపోయాడు; భూదేవి పాదాలచెంత మోకరిల్లినట్లు పడిపోయాడు. ఇంకొక గుండు అతని రొమ్ముల్లోంచి దూసుకుపోయింది. పొగలుకమ్ముకు వస్తున్నాయి. మంటలు విజృంభిస్తున్నాయి. విప్లవకారులు పరుగెడుతున్నారు. వీధిలో పక్కయిళ్ళల్లో దాగొంటున్నారు.

రొమ్ముల్లోంచి గుండు దూసుకుపోయిన, నేలకుఒరిగిన వ్యక్తినిచూసి, ఒక విప్లవయోధుడు కూడావస్తున్న మరొక యోధునితో 'ఆ ఆత్మార్పణచేసిన మహావీరుడు ఎవరో తెలుసునా?'

గుండు దూసుకుపోయిన, అరటిపూల దొప్పలుగా తల విడిపోయిన, ఆ ఆజానుబాహువు 'ఆత్మార్పణచేసిన మహావీరుడు' రూడిన్ ! డిమిట్రీ నిఖిలోవిచ్ రూడిన్ !!

శ్రీ వేమన గ్రంథాలయము
...ల్లు. (కృష్ణా జిల్లా.)

... ప్రెస్, విజయవాడ - 1



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B104 |
| పుస్తకం పేరు | హాడిన్ |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 245 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |